# చతుర ప్రపంచం

## పచ్చబొట్టు

'పచ్చబొట్టూ చెరిగీ పోదులే...' అంటూ ఆమధ్య సినీ గేయ కవిగారు ఓ పాట రాశారు. ఓసారి పచ్చపొడిపించుకుంటే శరీరంవున్నంత కాలం శాశ్వతంగా వుండిపో




తుంది. ఈ పచ్చపొడిపించుకోవడం మనదేశంలో కొండజాతులు, గిరిజనులు మొదలైన వారిలో ఎక్కువవుండేది. ఓ మాదిరి చదువుకున్న వాళ్లు, ఉన్నతకులస్థులు.. ఈ పచ్చబొట్లు పొడిపించుకునేవారుకాదు. కానీ అమెరికాలోను, ఇతర పాశ్చాత్య దేశాల్లోనూ ఈ పచ్చబొట్టు పెద్ద ఫ్యాషనయిపోయింది. పచ్చబొట్టు పొడిచే పాత శాస్త్రీయ పద్ధతి పోయి దానికి సంబంధించిన ఆధునిక యంత్రాలు వాడుకలోకి వచ్చాయి. వీటికి సంబంధించిన కేటలాగ్స్ అనేకం మార్కెట్లలోకి వచ్చాయి. వీటిలో అక్షరాలే కాక రకరకాల బొమ్మలు కూడా వుంటాయి. మనిషి తన అభిరుచినిబట్టి కావలసిన దానిని ఎంచుకుని పచ్చపొడిపించుకోవచ్చు. కనీసం 15 డాలర్లనుండి 100 డాలర్లదాకా దీనికి ఖర్చు అవుతుంది. పాములు, పక్షులు, హృదయం, నగ్నస్త్రీ, కంప్యూటర్, ఏరోప్లేన్... ఒకటేమిటి? అనేక రకాల బొమ్మలని పచ్చపొడిపించుకోవచ్చు.

కనీసం 6 అంగుళాల పొడవు నుంచి, పన్నెండంగుళాల దాకా ఈ బొమ్మలను పొడుస్తారు. ముంజేతిమీద, భుజంమీద, ఛాతీమీద, తొడలమీద శరీరంలో ఏ ప్రదేశంలోనయినా పచ్చబొట్టు పొడవచ్చు. శృంగారానికి సంబంధించిన ఎన్నో మాటలు, బొమ్మలు తొడలమీద పొడిపించుకుంటారు చాలామంది. దీనికి సంబంధిం

కవర్‌ఫొటో: డి.బెనర్జీ

చిన కేటలాగులు వేరే వున్నాయి.

బ్రౌన్‌గా లేదా నల్లగా వుండే ఇండియన్స్ చర్మం మీదకన్నా తెల్లగా వుండే పాశ్చాత్యుల చర్మం మీద నల్లని పచ్చబొట్లు ప్రస్ఫుటంగా కనిపించడంతో అవి అక్కడ పాప్యులర్ అవడానికి కారణమయింది. పచ్చబొట్టు పొడిచే విధానాన్ని కనుక్కున్నది ఇండియన్ ఇంక్ కనుక్కున్న చైనీసే. అప్పట్లో వుడెన్ హాండిల్‌కి బిగించిన చిన్నచిన్న నొక్కులుగల ఇనపపాళీని ఇండియన్ ఇంక్‌లో ముంచి చర్మంలో ఎంత లోతుగా వీలయితే అంత లోతుగా గుచ్చి తియ్యడమే పచ్చపొడిచే పద్ధతి. ఇది బాధాకరమైన పద్ధతి. చిన్న డిజైన్‌కానీ లేదా అక్షరాలనుగానీ ఒక్క సిట్టింగ్‌లో పూర్తి చేయవచ్చుకానీ కాంప్లికేటెడ్ డిజైన్ అయితే ఎక్కువ సిట్టింగ్స్ తీసుకుని పూర్తిచేయాల్సి వుంటుంది. ముఖ్యంగా నలుపొక్కటే కాక ఇతర రంగులతో కలిపి పచ్చబొట్టు పొడిచే సందర్భాల్లో అనేక సిట్టింగ్స్ తప్పనిసరి.

ఒకప్పుడు నేరస్థులు, హంతకులకు మాత్రమే పరిమితమైన పచ్చబొట్టు ఇప్పుడు నాగరిక ప్రపంచాల్లో కూడా ఫ్యాషన్‌గా మారింది. అమెరికాలోని పాపులర్ డిజైన్ ఏదంటే ఎరుపు, నీలంరంగుల్లోని వారి జాతీయజండా. పేర్ల తర్వాత జెండాకే ప్రాధాన్యత ఇస్తున్నారు అమెరికన్లు.

---

# పేదల పెన్నిధి వేరుసెనగ

స్థూలకాయంతో బాధపడే వారు తినకూడని పదార్థాల్లో వేరుసెనగ ఒకటి. ఏ బీచ్‌కో సినిమాకో వెళ్లినప్పుడు వేడివేడిగా పల్లీ పకోడీలో, వేయించిన పల్లీలో తింటూ వుంటే ఎంతో మజాగా వుంటుంది. ఈమధ్య కాలంలో చాలా ఆహార పదార్థాల్లో జీడిపప్పు స్థానాన్ని భర్తీ చేస్తోంది వేరుశనగ.

వేరుసెనగ శాస్త్రీయనామం అరాచిస్ హైపోజియా. దాని జన్మభూమి బ్రెజిల్. అక్కడి నుంచి ఇది పెరూ దేశానికి ప్రయాణించింది. తదనంతరం వ్యాపారస్థులు దీనిని మెక్సికోకి, వెస్టిండీస్‌కి తీసుకెళ్లారు. ఆ తరువాత ఇండియాకి చేరుకుందీ పంట.

దీనిలో అనేక రకాలున్నాయి. ఇండియాలో 16 రకాల వేరుసెనగలు పండుతున్నాయి. వీటి రుచి రకాన్ని బట్టి మారుతుంటుంది. వేరుశనగ గింజల రంగులు ఇటుకరాయి ఎరుపునుంచి, తుప్పు రంగు దాకా వుంటాయి. ఇండియాలో ఆంధ్రాలో... అదీ తెలంగాణాలో పల్లీలుగా పిలవబడే ఈ గింజలు అమెరికాలో పీనట్స్‌గా, ఇంగ్లండులో 'గ్రౌండ్‌నట్స్'గా పిలవబడతాయి. దీనికి 'పూర్‌మాన్స్ డ్రైఫ్రూట్' అనే ఓ నిక్‌నేమ్ కూడా వుంది. కారణం ఖరీదైన డ్రైఫ్రూట్స్ అయిన బాదంపప్పు, జీడిపప్పుల్లోలాగ వేరుసెనగలో కూడా ఎక్కువ పోషక పదార్థాలే వున్నాయి. ఓ పౌండ్ బరువుగల పల్లీలు 2700 కేలరీల శక్తినిస్తే అదే బరువుగల ఎద్దు మాంసం 2900 కేలరీల శక్తినిస్తుంది.

వీటిని ప్రపంచమంతా తినే పద్ధతులు నాలుగే నాలుగు. పచ్చిగా తినచ్చు లేదా వేయించుకుని తినవచ్చు. పంచదార పాకంలోగానీ, బెల్లం పాకంలోగానీ వేసుకుని తినచ్చు. ఉప్పునీళ్లలో ఉడకబెట్టుకుని తినవచ్చు.

వేరుసెనగ గింజల నుంచి నూనె తీశాక మిగిలే పిప్పిని పశువులకి మేతగా పెడతారు. ఇందులోని మాంసకృత్తులవల్ల పాలిచ్చే పశువులు ఈ ఆహారంతో అధికంగా పాలిస్తాయి. ఇంకా ఇందులో రిబోఫ్లావిన్, థయామైన్, విటమిన్ ఇ, పైరొడొక్సిన్, లైసిథిన్, నికొటినిక్ సైనైడ్ మొదలైన విటమిన్లుంటాయి. ఒక్కొక్క గింజలో 18 శాతం పిండి పదార్థముంటుంది. చిన్న పిల్లలకోసం








తయారయ్యే ఆహారపు టిన్నులలో వేరుశనగ పిండిని విధిగా కలుపుతున్నారు. వేరుశనగ నూనెని వంటల్లో వాడటం అనాదిగా వస్తున్నదే. ఇంకా ఈ నూనెను కాస్మెటిక్స్ తయారీలో కూడా వాడుతున్నారు.

---

## వెయ్యిమంది పిల్లల తండ్రి

'అపుత్రస్య గతిర్నాస్తి...' అని పెద్దలు చెబుతారు. ఆ మాట నిజమైతే అవ్వచ్చేమో గానీ, అధిక సంతానం మాత్రం అధోగతికే దారి తీస్తుంది ఈ రోజుల్లో. కుటుంబ నియంత్రణ ప్రచారంలో మునుపు ఇద్దరు లేక ముగ్గురు అని వుండేది. అటుపైన ఒక్కరూ లేక ఇద్దరనీ, ఇప్పుడు ఒక్కరే చాలని... అలా కన్నవాళ్లకు ఎన్నో బహుమతులు, ఉద్యోగ సౌకర్యాలులాంటి ఎరలు చూపిస్తోంది ప్రభుత్వం.

అయితే పూర్వకాలంలో ఇలా కుటుంబ నియంత్రణ ప్రచారం లేకపోయినా మాలే ఇస్మాయిల్‌గారి సంతతి సంఖ్య మాత్రం విన్నవాళ్ళకి గుండెనెప్పి వచ్చేలా చేస్తుంది. ఈయనకి 1000 మంది సంతానం. అధిక సంతానంగల తండ్రిగా ఈయన గిన్నిస్ బుక్‌లోకి ఎక్కివున్నాడు. మాలే మొరాక్లో చక్రవర్తి. రాజు తలుచుకుంటే... అన్నట్టు... 'నేను తల్చుకుంటే ఎంతమంది పిల్లల్నయినా పోషించగల'నని అనుకున్నాడేమో ఈయన. అందుకే 700 మంది కొడుకులు, 340 మంది కూతుళ్ళూ పుట్టారు. ఆయన జనానాలో వున్న 500 మంది స్త్రీల ద్వారా ఈ సంతతి ఏర్పడింది ఆయనకు. ఈయన 39వ ఏట 700వ కొడుకు పుట్టాడు. ఆ తర్వాత అతనికి జబ్బు చేసి మంచం ఎక్కినా ప్రతిరాత్రీ 5, 6గురు స్త్రీలను తన గదికి పిలిపించుకునేవాడు. మాలే ఇస్మాయిల్ పెద్దకొడుకు ఒక్కడే తండ్రి జనానాలోకి అడుగుపెట్టగలిగేవాడు. మిడిల్ ఈస్ట్‌లో ఆ కాలంలోని సుల్తానులందరూ తమ హేరేమ్‌లోకి మగపురుగు కూడా వెళ్ళకుండా జాగ్రత్తపడేవారు.

మాలే ఇస్మాయిల్ గొప్ప తండ్రేగాక




గొప్ప క్రూరుడు కూడా. పరమత అసహనంతో రోజుకి 500 మంది క్రిస్టియన్ ఖైదీలను చిత్రహింసలు పెట్టడమేకాక కొంత మంది తలలు కూడా తీయించేవాడు. బ్లాక్ గార్డ్ అనే పేరుగల ఒకప్పటి బానిసల సైన్యం ఇతనికెంతో అణిగి మణిగివుండి ఇతను చెప్పిందల్లా చేసేది.

'మాలే ది బ్లడ్ థ్రస్టీ'గా పేరు తెచ్చుకున్న ఈ దుర్మార్గుడు మరణించాక అంతమంది కొడుకులున్నా, అతని మేనల్లుడు సింహాసనాన్ని అధిష్ఠించాడు.

ఇంతమంది సంతానాన్ని కన్న గొప్ప తండ్రిగా గిన్నిస్‌బుక్‌లోకెక్కిన ఇతని పేరును బహుశా మరెవరూ పడగొట్టలేక పోవచ్చును.

## నేచురల్ 'ఇన్సులిన్'

కాయగూరల్లో 'కాకరకాయ' అంటే ఇష్టపడే వారికన్నా ఇష్టపడనివారే ఎక్కువ. దానికి ముఖ్యకారణం దానిలో వుండే చేదుగుణం. ముఖ్యంగా పిల్లలు ఆ కూరను అసలే తినరు. కానీ కాకరకాయలో ఎన్నో ఔషధ గుణాలున్నాయంటున్నారు వైద్యులు. డయాబిటిస్‌కి, దీనికీ అవినాభావ సంబంధముంది. ఇది నేచురల్ ఇన్సులిన్‌గా పనిచేస్తుందంటున్నారు. ఇందులో ఇన్సులిన్‌లా పనిచేసే గుణముండటంతో దీన్ని ప్లాంట్ ఇన్సులిన్ అని అంటారు. రక్తంలోని మూత్రంలోని సుగర్ లెవెల్స్‌ని ఇది క్రమబద్ధం చేస్తుంది. సుగర్ ఎక్కువగా వున్నవారు రోజూ ఉదయంపూట 4, 5 కాకరకాయలు రసం తీసుకుని పరగడుపునే తాగితే కొన్నాళ్ళకి సుగర్ తప్పక కంట్రోల్‌లోకి వస్తుంది. దీని గింజలు ఎండబెట్టి పొడిచేసి ఆహారంలో తినవచ్చు. సాధారణంగా సుగర్ వ్యాధిగ్రస్తులు బలవర్ధకమైన ఆహారలోపంతో బాధపడతారు. అలాంటప్పుడు కాకరకాయ భుజించడంతో అందులో వుండే ఎ, బి2, సి విటమిన్లు ఐరన్ మొదలైనవన్నీ శరీరానికి బలాన్నిస్తాయి. బ్లడ్‌ప్రెషర్, కంటివ్యాధులు మొదలైన వాటికి కూడా కాకరకాయ ఔషధంగా ఉపయోగపడుతుంది. ఇది శరీరంలో రోగ నిరోధక శక్తిని





పెంచుతుంది. మూలశంక రోగులకి కూడా ఇది దివ్యౌషధం. దీని ఆకులను నూరి మూడు చెంచాల రసంతీసి, ఒక గ్లాసుడు మజ్జిగలో కలిపి ఓ నెలపాటు సేవిస్తే మూల శంక మటుమాయమవుతుంది.

రక్తానికి సంబంధించిన రోగాలు స్కాబిస్, ఇచ్చింగ్, రింగ్‌వర్మ్, సొరియాసిస్, ఇతర ఫంగల్ ఇన్‌ఫెక్షన్లకి కాకరకాయ మంచి మందు. ఒక కప్పుడు కాకరరసంలో ఒక చెంచాడు నిమ్మరసం కలిపి నెమ్మదిగా ఒక్కొక్క గుక్క చొప్పున తాగాలి. ఇలా ఆరునెలలపాటు రోజూ తాగగలిగితే పై రోగాలన్నీ పూర్తిగా తగ్గుతాయి అంటున్నారు. నిత్యం దీనిని తినగలిగితే కుష్ఠుకు నివారణ ఔషధమవుతుంది. శ్వాసకోశ సంబంధ రోగాలకు కూడా ఇది మంచి మందు. ఈ తీగయొక్క వేళ్ళను కడిగి, ముద్దజేసి కొంచెం తేనెతోగానీ లేదా తులసిరసంతోగానీ సేవిస్తే ఆస్తమా, బ్రాంఖైటీస్, జలుబు మొదలైన రోగాలు మటుమాయమవుతాయి. దీని ఆకురసం మద్యపాన ప్రియులకు యాంటీడోట్‌గా పనిచేస్తుంది. మద్యపానం వల్ల లివర్ చెడిపోతే కేవలం కాకరకాయతో నయం చెయ్యవచ్చంటున్నారు వైద్యులు. వేసవిలో వచ్చే కలరా, డయేరియా మొదలైన రోగాలకు కూడా కాకరకాయ ఔషధంగా పనిచేస్తుంది.

కాకరకాయను పులుసు, పచ్చడి, కూర, ఊరగాయ... ఇలా ఎన్నోరకాలుగా రుచికరంగా చేసుకుని తినవచ్చు.




# హాలీవుడ్ సినిమా ఖరీదెంత?

హాలీవుడ్ సినిమా తయారవడానికి ఎంత ఖర్చవుతుందో ఇటీవల ఓ అమెరికన్ వారపత్రిక ఆడిటర్ లెక్కకట్టాడు. ఓ సినిమాకయ్యే ఖర్చు అందులో నటించే నటీనటుల పారితోషికాన్నిబట్టి మారుతుంటుంది.

సిల్వెస్టర్ స్టాలోన్, ఆర్నాల్డ్ స్వాజ్ నిగ్గర్ల పారితోషికం సినిమాకి 2 కోట్ల డాలర్లట. కనీసం 32 మంది రచయితలు వాళ్ల సినిమాకి పనిచేస్తారట. ఆఖర్చు 5 లక్షల డాలర్లట. ఏతావాతా ఓ సినిమా ఖర్చు 4 కోట్ల డాలర్ల పైమాటే.

హీరోయిన్ డెమీమూర్ హెయిర్ డ్రెసర్‌కి






10,000 డాలర్ల పారితోషికం ఇవ్వాలి. ఆమె నటించిన స్ట్రిప్‌టీజ్ అనే చిత్రానికి డెమీకిచ్చిన పారితోషికం 1 కోటీ 25 లక్షల డాలర్లు.

టాప్ దర్శకులకి 50 లక్షల నుంచి కోటి డాలర్లదాకా పారితోషికం ముడుతుంది. టాప్‌రైటర్స్‌కి 50 లక్షల డాలర్లు ఇచ్చుకోవాలి. సగటు రచయిత్రికి ఓ చిత్రానికి 50,000 డాలర్లు ఇస్తారు.

ఇంతవరకు ఎక్కువ ఖర్చుతో తీసిన చిత్రం 'టైటానిక్' అనుకున్నారు చాలా మంది. కానీ అతి పెద్ద ఖర్చుతోకూడిన సినిమా 'వాటర్‌వరల్డ్' దీన్ని తీయడానికి 17 కోట్ల 50 లక్షల డాలర్లు ఖర్చయింది. ఛేజ్‌లు, ట్రెయిలర్లు, అవుట్‌డోర్‌లొకేషన్లు, హీరోహీరోయిన్ల బస మొదలయినవన్నీ అందులో నటించే హీరో ప్రెస్టేజిని బట్టి పెరిగిపోతూ వుంటాయి.

---

## అల్లం 'టీ' లో ఔషధగుణం

ఉదర సంబంధ వ్యాధులకి అల్లం మంచి మందు అంటున్నారు వైద్యులు. అన్నం అరగకపోవడం, త్రేనుపులు, పొట్ట ఉబ్బరింపు వగైరా బాధలను అల్లపు రసంతో నివారించవచ్చును. అసలు ప్రతిరోజూ భోజనమయ్యాక ఒక చిన్న అల్లం ముక్కను నమిలి ఆ రసాన్ని మింగితే పై రోగాలు దరిదాపుకు రావు. మాంసాహారం అతిగా భుజించినప్పుడు, నూనెపదార్థాలు తిన్నప్పుడు, అరగని కొవ్వుపదార్థాలను తిన్నప్పుడు, మూలశంక, కామెర్లు, వేవిళ్ళు... మొదలైన ఎన్నోబాధల నివారణకు అల్లం ఔషధంగా ఉపయోగపడుతుంది. ఒక అరచెంచా అల్లపు రసం, ఒక టీ స్పూన్ నిమ్మరసం, ఒక స్పూను పుదీనా రసం, ఒకస్పూను తేనె కలిపి సేవిస్తే పై రోగాలని అరికట్టవచ్చు. జలుబు, దగ్గులకి కూడా ఇది ఔషధమే. కొంచెం అల్లపురసంలో, కొద్దిగా తేనెను రంగరించి రోజులో 4, 5 మార్లు తీసుకుంటే దగ్గు ఉపశమిస్తుంది. జలుబు వున్నప్పుడు కొంచెం అల్లాన్ని చిన్నచిన్న ముక్కలుగా చేసి ఓ కప్పుడు నీళ్ళలో వేసి ఉడికించి, కొంచెం చక్కెర కలుపుకుని వేడిగా ఆ నీటిని తాగాలి. అల్లపు టీని కూడా తయారుచేసుకోవచ్చు. నీళ్ళు మరుగుతున్నప్పుడు టీ పొడి




వేయడానికి ముందుగా అల్లంముక్కల్ని వేసి కాసేపు ఉడకనిచ్చి ఆపైన టీ పొడి, పాలు, చక్కెర చేర్చి 'టీ' తయారుచేసుకుని తాగవచ్చు. దీనికి రుచితో పాటు ఔషధగుణం కూడా వుంది.

ఫ్లూజ్వరం వచ్చినప్పుడు ఒక చెంచాడు అల్లపు రసాన్ని, మెంతులు వేసి కాచిన ఓ కప్పుడు నీళ్లలో కలిపి, దానికి కొంచెం తేనెచేర్చి తీసుకుంటే మంచిది. అది బ్రాంకైటిస్, ఆస్త్మా, గొరింతదగ్గు, క్షయలను దరికి రానివ్వదు.

బహిష్టులు సక్రమంగా రానప్పుడు కొంచెం అల్లాన్ని తీసుకుని ఓ కప్పుడు నీళ్లలో ఉడికించి దానికి కొంచెం చక్కెర చేర్చి రోజూ 3 సార్లు భోజనమయ్యాక సేవించగలిగితే మంచిది.

తలనెప్పి, పంటినెప్పి, చెవినెప్పి మొదలైన బాధలను కూడా అల్లం లేదా సొంఠిని ఉపయోగించి నివారించవచ్చు. చెవినెప్పి వచ్చినప్పుడు రెండు చుక్కలు అల్లపురసాన్ని చెవిలో వేయాలి. తలనెప్పికి సొంఠి గంధం తీసి వెచ్చచేసి తలకి పట్టువేయాలి.

ఎండిన అల్లాన్ని సొంఠి అంటారు. ఈ రెండింటిలోనూ ఎన్నో ఔషధగుణాలున్నాయి. పాశ్చాత్య దేశాల్లో ఈ అల్లాన్ని బ్రెడ్, బిస్కట్స్, కేక్‌లు, పుడ్డింగ్‌ల తయారీలో బాగా వాడతారు. చైనీయుల వంటకాల్లో ఇది అతి ముఖ్యమైన సుగంధద్రవ్యం.

# కిల్లర్ వేవ్స్

సముద్రం మీంచి వచ్చే తుపానుల వల్ల కలిగే ప్రమాదం మనకి తెలుసు. కానీ సునామీ కెరటాల గురించి కేవలం పసిఫిక్ మహాసముద్రంలోని కొన్ని దీవుల ప్రజలకే తెలుసు.

పసిఫిక్ మహా సముద్ర గర్భంలో అనేక అగ్ని పర్వతాలున్నాయి. అవి పేలినప్పుడు లావా బయటకు వచ్చే బదులు సముద్రంలో నీటిమీద దాని ప్రభావం పడుతుంది. ఫలితంగా నీరు రెండడుగుల కెరటంగా మారి గంటకి 600 మైళ్ల వేగంతో జపాన్‌కి వేల మైళ్ల దూరంలో వున్న అలాస్కా లేదా హవాయ్ దీవులవైపు ప్రయాణిస్తుంది. నేల

# సచిత్ర విచిత్రం



'జురాసిక్ పార్క్' చిత్రం పబ్లిసిటీలో భాగంగా, అమెరికాలో 'ఒక్లహోమా' రాష్ట్రంలోని టుల్సా అనే ఊళ్ళో ఓ బెలూన్‌ని గాల్లోకి వదిలారు. తోకనుంచి ముక్కుదాకా 168 అడుగుల పొడవుగల ఆ బెలూన్ డైనోసారస్ ఆకారంలో వుంటుంది. అయితే ఆ బెలూన్ గాల్లోపైకి వెళ్ళక ఓ ఇంటిమీదకి వచ్చి

# ఇల్లెక్కిన డైనోసార్



వాలింది. అదృష్టవశాత్తు ఆ ఇంట్లోవాళ్ళు అప్పుడు బయటకు వెళ్లడంతో ఎవరికీ ఎలాంటి గాయాలూ తగల్లేదు. ఆ బెలూన్‌లో గాలి బయటకు పోవడానికి 20 నిమిషాలు పట్టింది. ఇంటి కిటికీ అద్దాలు పగలడం మినహా మరే ఇతర డామేజీ జరగలేదు.

దగ్గరయ్యే కొద్దీ ఈ తరంగాలు తీవ్రమవుతాయి.

చడీచప్పుడూ చేయకుండా సునామీ తరంగాలు ఆ దీవుల్లో 30 నుంచి 100 అడుగుల ఎత్తున దాడిచేస్తాయి. తమ దారిలో వున్న మనుషుల్ని, ఇళ్లని ఇవి ముంచేసి తరువాత తమతోపాటు వెనక్కి అంటే సముద్రంలోకి లాక్కుపోతాయి.

1993లో జపనీస్ దీవి ఒకోహూమిని సునామీ తరంగాలు దాడిచేస్తే 60 మంది మరణించారు. 30 కోట్ల డాలర్ల విలువగల ఆస్తి ధ్వంసమయింది.

హవాయ్ దీవుల్లోని ప్రజలకు సునామి తరంగాల గురించి అనుభవ పూర్వకంగా తెలుసు. అయితే జపాన్ దేశానికి వచ్చే సునామీ తరంగాలు చాలా దూరంనుంచి రావాల్సిన పనిలేదు. అగ్నిపర్వతాలు విచ్చలవిడిగా వున్న జపాన్ చుట్టుపక్కల సముద్రంలో ఎక్కడైనా అగ్నిపర్వత విస్ఫోటనం జరిగితే చాలు... ఈ తరంగాలు బయలుదేరతాయి.

అందుకే ఒకోహూమీ ద్వీపం చుట్టూ 35 అడుగుల ఎత్తున ఓ వంద అడుగుల స్థూపాకారపు గోడను నిర్మిస్తున్నారు. పావువంతు పూర్తయింది ఆ కట్టడం. కింద వంద అడుగులుండే ఇది సముద్రంవైపు ఏటవాలుగా పది అడుగుల ఎత్తుకి లేస్తుంది. కాంక్రీటుతో కట్టిన ఈ గోడ సునామీ తరంగాలను ఎంతవరకూ తట్టుకోగలదో ఇంకా తెలియదు.

అమెరికన్ ప్రభుత్వం హవాయ్ దీవుల్లోని హొనలూలూలో 'పసిఫిక్ సునామీ వార్నింగ్ సెంటర్'ని స్థాపించింది. ఈ సెంటర్ సముద్రంలోని అగ్నిపర్వత విస్ఫోటాలను గుర్తించి, సునామీ తరంగాలను ఆదిలోనే కనిపెట్టి అవి ఏఏ దీవులను తాకవచ్చో తెలియచెప్పి ముందు జాగ్రత్తగా హెచ్చరికలు చేస్తుంది. ఈ సెంటర్ ఈ విషయంలో 365 రోజులూ, 24 గంటలూ అప్రమత్తంగా వుంటుంది.

కొన్ని దీవుల్లో అహర్నిశలూ వీడియో కెమేరాలనుంచి టీవీలో సముద్ర నీటిమట్టం, కెరటాల వేగాన్ని సదా గమనిస్తూ సునామీ రాకని ముందుగానే పసిగట్టడానికి ప్రయత్నిస్తున్నారు.

★







# ఏరినముత్యాలు

★ నెంబర్‌వన్ అవడంకన్నా ఆ స్థానాన్ని నిలబెట్టుకోవడం కష్టం.

–బిల్‌వాల్డ్రో

★ ప్రతి హీరో కూడా చివరికి విసుగు తెప్పించే వ్యక్తిగానే తయారవుతాడు.

–ఎమర్సన్

★ అజ్ఞాని హృదయం నోట్లోనే వుంటుంది. విజ్ఞానులు మాత్రం హృదయ మందిరంలోంచి మాట్లాడతారు.

–ఫ్రాంక్లిన్

★ సుఖజీవనానికి మనశ్శాంతి ప్రధానం.

–సిసిరో

★ కారణం లేకుండా ఏదీ జరగదు, అందువల్ల అవకాశం రావడం అన్నది అర్థంలేని వ్యర్థపదం.

–వాల్టేర్

★ క్రూరత్వంకంటే నీచత్వం హీనమైనది.

–అంబేద్కర్

★ అధికారి అన్నవాడు మృదుమధురంగా మాట్లాడటం నేర్చుకోవాలి

–బద్దెన

★ పులిని ఎంత మచ్చిక చేసుకున్నా రింగ్‌మాస్టర్‌కు కొరడా అవసరం తప్పదు.

–చర్చిల్

★ న్యాయానికి హాని జరిగితే చివరకు శాంతి భద్రతలు సైతం హరించుకుపోతాయి.

–ఎడ్గర్‌హోవర్

★ భవిష్యత్‌కన్నా వర్తమానం మిన్న.

–లైబ్నిజ్

★ మహాత్ములు యుద్ధాలు ఆపడం కోసం యుద్ధాలు చేస్తారు.

–టాల్‌స్టాయ్

★ రాజ్యం, డబ్బు, బంగారం దేన్నైనా దానం చెయ్యి. హృదయాన్ని మాత్రం ఇవ్వకు.

–హోస్మాన్

★ మన జీవితకాలమంతా గడపవలసిన భవిష్యత్తు గురించి శ్రద్ధ వహించక తప్పదు.

–చార్లెస్ ఎఫ్. కేటరింగ్

★ తోటి మనిషిని ద్వేషించేంత అధమ స్థాయికి నేనెప్పుడూ దిగజారను.

–వాషింగ్టన్

సేకరణ: కుంచం కోటేశ్వరరావు

చతుర
సంపుటి : 22 సంచిక : 5 జూన్ 1999

పెళ్లినాటికి ఆ అమ్మాయి వయసు పధ్నాలుగేళ్లు. కానీ... అప్పటికే కొడుకులూ, కోడళ్లూ, మనవలూ కూడా వున్నారామె భర్తకి. తల్లితండ్రులను కాదనలేని దుర్భర పేదరికపుస్థితి.... ఆ అమ్మాయిని ఆ పెళ్లికి తలవొంచేలా చేసింది.
అయినా... ఆ తర్వాత తన కూతుర్ని బాగా చదివించాలనుకుంది.
ఉద్యోగస్థురాలైన కోడల్ని తెచ్చుకుంది.
చివరకు మనవరాలు "మీ కాలంలో మొగుడంటే దేముడు. వాడికి మీరు బానిసల్లా సపర్యలు చేసేవారు. ఈ రోజుల్లో మాకు మొగుడంటే ఫ్రెండ్. స్నేహంతోనే మా దాంపత్యం నడుస్తుంది" అంటే ఆ అమ్మాయి ప్రేమ వివాహాన్ని సంతోషంగానే అంగీకరించింది.
అలా... నాలుగుతరాల స్త్రీల జీవితాలను సన్నిహితంగా పరిశీలించిన ఆమె చివరకు తెలుసుకున్న... కఠోరసత్యం ఏమిటి?
ఆదికాలంనుచి ఆధునిక యుగంవరకు అబల జీవితంలోని ఆటుపోట్లను అక్షరీకరించిన పొత్తూరి విజయలక్ష్మి రచన 'అబలాయానం'
ఈ నెల చతుర సమగ్ర నవల.

# అబలాయానం

పొత్తూరి విజయలక్ష్మి

నేను ఓ ఆడపిల్లనని ఓ పెద్ద మొట్టికాయ వేసిమరీ నాకు తెలియజేసిన ఆ సంఘటన నాకు ఈనాటికీ కళ్లకు కట్టినట్లుగా గుర్తుకొస్తుంటుంది.

అప్పుడు నా వయసు అయిదేళ్లో ఆరేళ్లో! మేము, మా ఊరివాళ్లం చాలామందిమి కలిసి తిరణాలకో, సముద్ర స్నానానికో, సమారాధనకో బయల్దేరి వెళ్లాం. ఆ వెళ్లిన సందర్భం సరిగా గుర్తులేదు. బండిమీదా, బస్సు మీదా కూడా చాలాసేపు ప్రయాణం చేశాం. ఎంతసేపు ప్రయాణం చేశామో గుర్తు లేదు.

ఒక చోట దారిలో ఆగాం.

నాతోబాటు నలుగురైదుగురు మగపిల్లలు కూడా వున్నారు. అందరూ బండి దిగి పరిగెట్టుకెళ్లి దారి పక్కనే నిలబడి పని కానిస్తూ వుంటే నేను కూడా పరికిణీ పైకెత్తుకొని వాళ్ల పక్కనే కూర్చుండిపోయాను.

అంతే!

ఆ తర్వాత భూకంపం వచ్చినంత హడావుడి అయింది.

మా అమ్మ నా వీపు మీద తాటలేచేలా కొట్టింది.

"ఆడముండవి కాదూ! ఏవిటా దిక్కుమాలిన పని? " అంటూ బాదేసింది.

"వాళ్లంతా పోసుకోలా? " అన్నాను వెక్కుతూ.

"వాళ్లకేం మగ మహారాజులు. ఆడపక్షివి వాళ్లతో నీకు వంతా? అలా పక్కకి వెళ్లి తగలడాలి" అని బుగ్గలు పిండింది నా మేనత్త.

"ఓ పక్కన కడుపు ఉబ్బిపోయి అవస్థపడుతుంటే ఆడేవిటి? మగేమిటి? " అనిపించి ఆ మాటే అడిగాను అమాయకంగా!

"ఏడిశావ్ నోర్ముయ్! ఆడజన్మ ఎత్తాక తలొంచుకోక తప్పుతుందా!" అంది అమ్మ గుడ్లురిమి.

"దీన్ని ఇప్పటినుంచే హద్దుల్లో వుంచు. లేకపోతే తెలివిమీరి కొంప మునిగాక ఏడ్చి ఏం ప్రయోజనం? " అన్నారు మిగిలిన అమ్మలక్కలు.

"నా దగ్గర సాగవు దీని పిచ్చి వేషాలు. తాట ఒలిచెయ్యనూ!" అని భరోసా ఇచ్చింది అమ్మ, మాడు పగిలేలా మరో పెద్ద మొట్టికాయవేస్తూ.

పెద్దగా ఏడిచాను.

జీవితంలో మొదటిసారి నేను ఆడపిల్లనని, అంటే చాలా తక్కువ దాన్ననీ తెలిసి ఏడిచాను. మగ పిల్లలిపట్ల అసూయతో, మా ఆడపిల్లల దుస్థితికి బాధతో ఏడిచాను.

ఆ తర్వాత అనుదినం.

"ఆడపిల్లవి అణిగిమణిగి వుండాలి"

"ఆడపీనుగవి వాడితో నీకు వంతేమిటి? "

"ఆడపక్షివి నోరుమూసుకుని ఓ పక్కన పడుండు"

అనే పదాలు రోజులో కనీసం ఒకటైనా వినిపిస్తూ వుండేవి.

విని విని విసుగేసి ఓ రోజు నిలదీసి అడిగేశాను.

"మరి మగపిల్లాడు గొప్పవాడూ, ఆడపిల్ల తక్కువ అని తెలిసిన దానివి నన్ను కూడా మగపిల్లాడిగా కనెయ్యక పోయావా? ఇలా ఎందుకు చేశావు? " అన్నాను.

"అదంతా నా చేతుల్లో వుంటే బాగానే వుండును. అందరూ మగపిల్లలనే కనివుండేదాన్ని" అంది అమ్మ కసిగా.

"నీ చేతుల్లో లేదుసరే, నా చేతుల్లో వుందా? " తెలుసుకుందామని అడిగాను.

"తెలివి తేటలకేం లోటులేదు" అంటూ లెంపకాయకొట్టింది అమ్మ! అనుదినం ఆడపీనుగని అయిన నన్ను కన్నందుకు బాధప




డిన అమ్మ అంతటితో ఆగక మరో నలుగుర్ని ఆడపిల్లనుగలనే కన్నది.

మా అందరికీ ముందు ఒక అన్న వున్నాడు. వాడికి రాజభోగం. మాకు వెట్టి చాకిరి.

"ఆడ సంత"

"ఇంటినిండా ఆడ జనం"

అని వచ్చే పోయే బంధుమిత్రులు జాలి పడేవారు.

బడి అంటే ఏమిటో ఎరగను. ఒక చెల్లెలు చంక దిగే వయసు వచ్చేసరికి మరొకత్తె చంక ఎక్కడానికి సిద్ధంగా వుండేది. అలా ఎవరో ఒకర్ని మోసుకుంటూ తిరిగేదాన్ని.

ఆ రోజుల్లో మా ఇంటికెదురుగా ఒక ఇల్లాలు వుండేది. ఆయన స్కూల్లో పంతులు. అందరూ ఆవిడని పంతులమ్మగారు అనేవారు. ఆవిడకి పిల్లలు లేరు. అనారోగ్యం మనిషి. మా చెల్లెళ్లని ఆడిస్తూ వాళ్ల అరుగుమీదికి వెళ్తే లోపలికి పిలిచేది. కబుర్లు చెప్పేది. బెల్లం ముక్క పెట్టేది. ఆవిడ లేవలేకపోతే ఆ పనీ ఈ పనీ చేసి పెట్టేదాన్ని. ఆవిడా నన్ను కనిపెట్టి వుండేది.

ఒకసారి పాతపట్టు చీరె ఇస్తే మా అమ్మ దానితో నాకు పరికిణీ, నా చెల్లెళ్లకి గౌన్లు కుట్టించింది.

ఆవిడే నాకు రెండుమూడు పద్యాలు నేర్పింది.

"శ్రీ రుక్మిణీశ కేశవ నారద సంగీతలోల నగధరశౌరీ ద్వారక నిలయ జనార్దన కారుణ్యముతోడ మమ్ము కావుము కృష్ణా" అనే పద్యం నాకెంతో ఇష్టం.

ఇంటికొచ్చి ఆ పద్యం పాడి వినిపిస్తే మా నాయనమ్మ ఎంతో సంతోషించేది.

"ఊరికినే తిరక్కుండా ఆవిడ దగ్గిర ఒక అక్షరం ముక్క నేర్చుకో" అంది. నేనూ నేర్చుకుందామనే అనుకున్నాను. అంతలోనే పంతులమ్మగారు వేరే ఊరు వెళ్లిపోయారు.

ఆవిడ వెళ్లిపోయాక నాకు బెల్లం ముక్క, ఎండుకొబ్బరి ముక్క పెట్టేవాళ్లు కరువైపోయారు.

మా సందు చివరలో ఒక కోమటావిడ పుణుకులు, వేరుశనగ వుండలు అమ్ముతూ వుండేది. అడపాదడపా అన్నయ్య కొనుక్కుని తినేవాడు. నాకు నోరూరుతూ వుండేది. కానీ అడిగితే అమ్మ తిట్టిపోసేది.

కాణీకి నాలుగు పుణుకులు. మూడు పప్పుండలు. ఎలాగైనా కాణీ సంపాదించాలని కోరిక.

మా ఇంట్లో అయిదారు కనకాంబరం మొక్కలు వుండేవి. నేను, పెద్ద చెల్లి కలిసి వాటికి పాదుచేసి నీళ్లుపోసి పోషించాం. పూలు పూశాయి. వాటిని కోసి భద్రపరిచి పక్క వీధిలో వుండే వడ్లమర వారింట్లో అమ్మేం. ఒక కాణీ వచ్చింది. ఆ కాణీతో పుణుకులు కొనుక్కుందాం అనుకున్నాం. కానీ అమ్మకు ఏదో అవసరంవచ్చి మా కాణీ కాస్తా తీసేసుకుంది. మేము పూలు అమ్మడం, అమ్మ డబ్బుతీసుకోవడం ఒకసారి కాదు అలా అయిదారుసార్లు జరిగింది.

ఇక విసుగేసి ఏడ్చి గొడవచేశాం.

కనకాంబరాలకి అదే ఆఖరి పూత.

ఏమనుకుందో ఏమో "ఈసారి తీసుకోనులే ఏడిచి చావకండి" అంది.

ఈసారి కాణీకాదు అర్ధణా వచ్చింది. పరుగునవెళ్లి పుణుకులు, వేరుశనగ వుండలూ కొనుక్కున్నాం.

ఇంటికి తెచ్చుకుని అపురూపంగా ఆకు విప్పామో లేదో ఎక్కడినుంచి వచ్చాడో గద్దలా తన్నుకు పోయాడు మా అన్నయ్య. అరిచిగీపెట్టినా ఇంత పిసరు కూడా పెట్ట



కుండా బకాసురుడిలా మొత్తం తినేశాడు. మనసులోనే ఎన్నో శాపనార్థాలు పెట్టాం.

ఆ తర్వాత మాకు పుణుకులు తినే అవకాశమే రాలేదు.

ఆ మరుసటి సంవత్సరం మా ఆఖరి చెల్లికి అమ్మవారు పోసింది. దానికి తగ్గీ తగ్గగానే అన్నయ్యకి అంటుకుంది. చెల్లెలికి గొంతులో నీళ్లు కూడా పొయ్యని అమ్మ, నాయనమ్మ అహోరాత్రాలూ అన్నయ్య పక్కనే కూర్చుని సేవచేశారు. అమ్మవారికి మొక్కులు మొక్కారు. కానీ ఫలితం దక్కలేదు.

గుండెలు బాదుకుని ఏడిచింది అమ్మ. పొర్లిపొర్లి ఏడ్చాడు నాన్న. ఉన్న ఒక్క వంశాంకురాన్నీ తీసుకుపోయే బదులు ఈ ఆడదయ్యాల్లో ఒకత్తెని తీసుకుపోకూడదా అని ఏడిచింది నాయనమ్మ.

ఆవిడేకాదు చూడ్డానికి వచ్చిన వాళ్లందరూ కూడా వాడు పోయినందుక్కంటే మేము బతికున్నందుకే ఎక్కువ బాధపడ్డారు.

ఆ ఘట్టం ముగిశాక అసలే ముభావంగా వుండే నాన్న మరింత ముభావంగా తయారయ్యాడు. ఇంట్లో మనుషులతో రోజుల తరబడి మాట్లాడేవాడు కాడు. చేసే పని మీద శ్రద్ధ తగ్గిపోయింది. దానికి సాయం ఆ సంవత్సరం వర్షాలు లేక కరువొచ్చి పడింది పంటలు పండలేదు.

మహామహా వాళ్లే కడగండ్లు పడుతుంటే మాలాంటి నిత్య దరిద్రులమాట వేరే చెప్పాలా. దుర్భర దారిద్ర్యం అనుభవించాం. పస్తులుండలేక సతమతం అయిపోయాం. మా దొడ్లోని బాదం కాయలు తిని మంచినీళ్లు తాగి పడుకున్న రోజులు గుర్తే నాకు. మా కరణంగారి దొడ్లో నిమ్మ చెట్టు వుండేది. ఎండవేళ వాళ్లు పడుకున్న సమయం చూసి గోడదూకి నిమ్మకాయలు దొంగతనం చేసి తీసుకొచ్చి నీళ్లల్లో పిండుకుని ఉప్పువేసి తాగేవాళ్లం.

వానలు పడాలని దేవాలయంలో పూజలు చేయించారు. ఆ సందర్భంలో ఇచ్చే పానకం, వడపప్పు కోసం తోసుకుని కాళ్లు పచ్చడి చేసుకుని కడుపునిండా పానకం తాగి తృప్తిపడి కాళ్లనొప్పులతో వారం రోజులు బాధపడ్డాను.

ఏదో రీతిన కాలం గడిచిపోయింది. వానలు కురిశాయి. కరువు తీరింది.

మా నాన్న అశ్రద్ధవల్ల మా బతుకులలో మాత్రం మార్పు లేదు. ఓ పూట తినీ, ఓ పూట తినకా ఇల్లిల్లూ తిరిగి అప్పడాలొత్తీ, వడియాలు పెట్టీ, అటుకులు దంచీ, సాయంచేసేవాళ్లం, మేమూ అమ్మా! వాళ్లిచ్చిన తృణమో పణమో పుచ్చుకునేవాళ్లం. ఆ రోజుల్లోనే మా నాయనమ్మ చచ్చిపోయింది. ఒక నోరు తగ్గినా తగ్గినట్లే అనుకుని ఊరుకుంది అమ్మ.

ఆ మరుసటి సంవత్సరమే నేను పెద్దమనిషిని అయ్యాను. పదమూడో ఏడు. అమ్మ దీనంగా గుడ్లనీళ్లు కుక్కుకుంది. నాకూ ఏడుపు వచ్చింది. తనివితీరా ఏడిచాను.

"వాకిట్లో అడుగుపెట్టి వారణాసి ఎంత దూరం అన్నాట్ట నీలాంటివాడే. ఇదిగాక ఇంకా నలుగురున్నారు. ఇప్పటినుంచి ఏడవడం మొదలు పెడితే ఎప్పటికి అయ్యేను? కళ్లు తుడుచుకో. నాలుగు తాటాకులు కోయించి దాన్ని కూర్చోబెట్టి ఇంత చిమ్మిలి తొక్కి దానికి పెట్టు. సమర్తాడిన వేళావిశేషం బాగుండి మళ్లీ ఏడాదికి పెళ్లి కూతురవుతుంది నీ కూతురు" అంటూ ధైర్యం చెప్పారు ఇరుగుపొరుగు ఇల్లాళ్లు.

వారి మాట నిజం అయింది. ఏడాది తిరిగేసరికి నాకు మంచి సంబంధం వచ్చింది. వందలేసి ఎకరాల భూములుట. ఏడువారాల నగలుట. పాడీపంటా పొంగిపొర్లుతూ

వుంటాయిట. పెద్ద భూస్వాములట. మా అమ్మ ఏనుగెక్కినంత సంబరపడిపో యింది.

ఆయనకిది రెండో పెళ్లట. పెద్ద భార్య పాపం పురిట్లో పోయిందిట. ఆడ దిక్కులేక అవస్థపడుతున్నారుట.

వయసెంత వుంటుందో అని అడిగిన వాళ్లకి,

"ఆ ఏం వయసు? అయినా మగవాడికి వయసుతో ఏం పని? మనిషి దిట్టంగా వున్నాడు. కలిగిన సంసారం. పిల్ల మహారాణీలా వుంటుంది. కోరిన తిండి. కోరిన బట్ట. అది బాగుపడడమే కాక మమ్మల్నీ కనిపెట్టి వుంటుంది" అంది అమ్మ సరదా పడిపోతూ.

నాకూ సరదావేసింది. నగలూ నాణ్యాలూ, పొలం పుట్రా ఎలా వున్నా కోరిన తిండి అనేసరికి నోరూరింది. రెండు పూటలా కంచం నిండా అన్నం పెట్టుకుని కడుపునిండా తినడంకంటే స్వర్గం ఇంకెక్కడుంది? అదంతా నా అదృష్టం అనుకున్నాను.

ఉభయ ఖర్చులూ వారే భరించి పెళ్లి చేసుకుంటాం అన్నారుట. మూఢం వెళ్లాక గుళ్లో పెళ్లికి ముహూర్తం పెట్టారు.

పెళ్లికి ముందు రోజు నాన్న, అమ్మ, నేను, ముగ్గురం వెళ్తే ముడి పడదని బయలుదేర దీయించిన నా ఆఖరి చెల్లెలుతోపాటు పెళ్లికి వెళ్లాం. అక్కడికి చేరేసరికి మధ్యాహ్నం అయింది. గుడి పక్కనే సత్రంలో మాకు గది ఇచ్చారు.

స్నానం చేయించి నన్ను పెళ్లికూతురిని చేశారు. కడుపునిండా భోజనం పెట్టారు. కొత్త పరికిణీ, ఓణీ వేసుకుని గుడి చుట్టూ వున్న తోటలో తూరీగలా తిరిగాను. నేనూ చెల్లాయ్ బోలెడు ఆటలు ఆడుకున్నాం.





చికుచిక్కు పుల్ల, ఒప్పులకుప్ప, తొక్కుడు బిళ్ల అలా అలా లెక్కలేనన్ని ఆటలు ఆడు కున్నాం.

"అక్కా నువ్వు పెళ్లైతే మనూరు రావా?" అని అడిగింది చెల్లాయ్ దిగులుగా.

నాకూ దిగులువేసింది. "ఊహు రాను. పెళ్లయ్యాక అత్తవారింటికి వెళ్లిపోతాను. నువ్వు, అమ్మా నాన్నా మన ఊరికి వెళ్తారు" అన్నాను ఆరిందాలా.

"ఒక్కర్తివీ నీకు అక్కడ భయం వెయ్యదూ?" అడిగింది.

"లేదు... అక్కడ అందరూ వుంటారుగా. నీకు తెలుసుగా... మా అత్తగారు చాలా డబ్బున్నవాళ్లు. మనూళ్లో మేడ సాంబయ్య గారిలా అన్నమాట. బోలెడు నగలుట. బోలెడంత తిండిట. లడ్డూలు, అరిసెలు, చక్కిరాలు ఒకటేమిటి అన్నీను. బిందెలకొద్దీ పాలుట" అని చెప్పాను నోరూరేలా.

ఆశగా చూస్తూ గుటకలు మింగింది చెల్లాయ్. "అవన్నీ తింటావా నువ్వు! అక్కా నన్నూ తీసుకెళ్లవా?" అంది దీనంగా.

"ముందు నేను వెళ్లి తర్వాత మీ అందర్నీ తీసుకెళ్తాను" అని హామీ ఇచ్చాను.

దాని కళ్లు మెరిశాయి. "అప్పుడు మీ ఇంట్లో నేను కూడా గ్లాసు నిండా పాలు తాగుతాను. అక్కా పాలు తియ్యగా వుంటాయా?" అంది సందేహంగా.

నాకూ తెలియదు. అయినా బింకంగా "అవును తియ్యగా, కమ్మగా వుంటాయి" అన్నాను.

ఆటలు ముగించి గదికి వెళ్లాం ఇద్దరం. అమ్మ నాలుగు చీవాట్లు వేసింది.

"పెళ్లికూతుర్ని చేశాక చెట్టూ చేమలూ పట్టుకుని తిరగచ్చా" అని తిట్టింది.

ఆ తెల్లవారుజామున మూడింటికో నాలు గింటికో నా పెళ్లి.

రాత్రి పీకలదాకా తిని కమ్మగా నిద్రపో యాను. అర్ధరాత్రి అమ్మ లేపింది బలవం

తాన. తలంటిపోసి జడవేసి అలంకరిం చింది.

పాతబడిపోయి చవుడు కారుతున్న ఒక సత్రం గదిలో పెళ్లిపీటలు వేశారు. ఒక ముసలివాడు సన్నాయి నోట్లో పెట్టుకుని కూర్చున్నాడు. అతడి పక్కన కునికిపాట్లు పడుతూ ఒక కుర్రకుంక శృతి పెట్టె పట్టు కుని కూర్చున్నాడు. పురోహితుడు అన్నీ సిద్ధం చేసుకుంటున్నాడు.

పీటలమీద ఒక పెద్దాయన కూర్చుని వున్నాడు. ఇంచుమించు మా నాన్న వయసు వుంటుంది. కాకపోతే నాన్న చిక్కి శల్యమై డొక్కులా వుంటే ఆయన దిట్టంగా బొగ్గుల బస్తాలా వున్నాడు. సగం నెరిసిన మీసాలు, బట్టతల. ఆయనకు కాస్త దూరంలో పట్టుచీరె కట్టుకుని, మెడలో గొలుసులు వేసుకుని, నుదుట కాసంత బొట్టుతో వుంది ఒకావిడ. మా అత్తగారు, మామగారు కాబోలు అనుకున్నాను. ఆ మాటే అమ్మని అడిగాను. నెత్తిన మొట్టింది.

ఆవిడ అత్తగారనేది అక్షరాలా నిజం. కానీ ఆయన విషయంలో నా అంచనా తప్పు. ఆయనే పెళ్లికొడుకు. ఆశ్చర్యం వేసింది నాకు. అంతలోనే అమ్మ తీసికెళ్లి పీటలమీద కూర్చోబెట్టింది.

"చెయ్యి పట్టమ్మా, కళ్లు మూసుకో..." అంటూ ఆజ్ఞలు జారీ చెయ్యసాగాడు పురో హితుడు.

ఆ హడావిడిలో పడిపోయాను. ఆ తర్వాత కమ్మగా నిద్రవస్తూ వుంటే అతి కష్టం మీద ఆపుకుంటూ కునికిపాట్లు పడుతూ కూర్చున్నాను.

పెళ్లయిపోయింది.

తెల్లవారింది. అమ్మా, నాన్నా, చెల్లాయ్, నేనూ నా భర్తా మా అత్తగారూ అందరం కలిసి బస్టాండుకి వెళ్లాం. వాళ్లు ఆ బస్సు, మేము ఈ బస్సూ ఎక్కాం. అమ్మ కొంగులో మొహం దాచుకుని ఏడిచింది. నేనూ ఏడిచాను. మా అత్తగారు ఏడవద్దని మెత్తగా మందలించింది.

బస్సు బయలుదేరగానే నిద్రపోయాను. గమ్యం చేరాక అత్తగారు లేవదీస్తే మెలకువ వచ్చింది.

బస్సుదిగి బండీలో ఇంటికి చేరాం.

దిష్టితీశారు. కుడికాలు పెట్టి లోపలికి రమ్మన్నారు. వెళ్లాను.

పెద్ద ఆవరణలో పెద్ద ఇల్లు. ఒక మూల వందలకొద్దీ బస్తాలు పట్టే ధాన్యంకొట్టు.

హాల్లో పెద్ద భోషాణం పెట్టె. ఉయ్యాల బల్ల.

పడక గదిలో పెద్ద పందిరిమంచం. నిలు వెత్తు ఇనప్పెట్టె. దాని మీద కళకళలాడే వదనంతో ధనం కురిపిస్తూ పద్మాసనంలో కూర్చుని వున్న ధనలక్ష్మి బొమ్మ.

వెనకాల ఒకేసారి వందమంది భోజనం చేయగలిగే భోజనాల గది.

పక్కనే పచ్చళ్ల గది. అందులో గట్టుమీద వరసగా ఊరగాయ జాడీలు.

ఇటు పక్కనే వంటగది. దాన్నిండా పాత్ర సామాను.

దొడ్డిగుమ్మం దాటి వెళ్తే వెనుక వైపు రెండు పక్కలా అరుగులు ఎదురుగా తులసి కోట.

పెద్ద ఆవరణలో ఒకమూల గిలకబావి. కాస్త దూరంలో బట్టలుతికే బండ. కుంకుడు, బాదం, వేప, చింత, కరివేప, కొబ్బరి, గోరింట చెట్లు.

ఇంకోపక్క పెద్ద పశువుల శాల.

ఇంటి ముందుపక్క గదిలో దొంతరగా పేర్చిన పరుపులు, పక్క బట్టలు, దిళ్లు.

మరో గదినిండా ఎత్తి వుంచిన నవారు మంచాలు. వాకిలి పక్కగా వుండే గదిలో పెద్ద రాతబల్ల. దాని ఎదురుగా చెక్కకుర్చీ

పక్కనే పెద్ద పడక్కుర్చీ

హాల్లో పెద్ద గోడగడియారం. మరో గోడకి నిలువెత్తు అద్దం. ఇంకో పక్క కొమ్ములతో వున్న జింక తల.

గోడనిండా ఎప్పటెప్పటివో పెళ్లి ఫొటోలు.

గీతను బోధిస్తున్న కృష్ణుడు.

శివపార్వతులు, లక్ష్మీదేవి, ఆంజనేయ స్వామి, విశ్వరూప సందర్శనం, సత్యనారాయణస్వామి, పద్మావతీ సమేత వెంకటేశ్వర స్వామి, వినాయకుడు, గాంధీగారు, కస్తూరిబా! మొదలగు పటాలు. ఇంకా బట్టల్లేని చిన్న పిల్లల ఫొటోలు.

చెక్క కుర్చీలు, బల్లలు, చాపలు ఎక్కడపడితే అక్కడే వున్నాయి. ఇల్లంతా చూపించి గర్వంగా నవ్వింది మా అత్తగారు.

"ఏం, కళ్లు తిరుగుతున్నాయా? " అంది ఎగతాళిగా.

రెండు నిట్రాళ్ల పూరిపాకలో పెరిగిన నాకు ఆ ఇల్లు చూస్తే నిజంగానే కళ్లు తిరిగాయి.

"మనది జమీందార్ల వంశం. మా తాత ముత్తాతలు జాగీర్దారులు. ఇటువంటి ఇంటికి కోడలిగా రావడం నీ పూర్వ జన్మ సుకృతం. ఏ జన్మలో పూజ చేశావో ఈ జన్మలో ఈ అదృష్టం పట్టింది. బుద్ధిగా వుండి మా అందరి చేతా మంచి అనిపించుకో" అంది మా అత్తగారు దర్పంగా.

ఆ తర్వాత ఇంట్లోని సభ్యులందరినీ పిలిచి పరిచయం చేసింది. ఎదుటలేని వారి గురించి వివరించి చెప్పింది.

అంత ఇంటికి తగినట్లు బోలెడంత మంది జనాభా.

నా భర్తకి ఇద్దరు కొడుకులూ, ముగ్గురు కూతుళ్లు.

పెద్ద కొడుక్కి పెళ్లయింది. ఇద్దరు పిల్లలు. రెండో కొడుక్కి పెళ్లి అయింది. భార్య పురిటికి పుట్టింటికి వెళ్లింది.

పెద్ద కూతురికి పెళ్లై అత్తవారింట్లో వుంది. ఆవిడకి ఇద్దరు పిల్లలు. తండ్రి పెళ్లి కాబట్టి ప్రస్తుతం పుట్టింటికి వచ్చింది.

రెండో కూతురికి పెళ్లి అయింది. కడుపుతో వుంది. మూడో ఆమెకి ఇంకా పెళ్లి కాలేదు. కాస్త అటూ ఇటూగా నా వయసే వుంటుంది ఆ అమ్మాయికి.

వీరుకాక నా భర్త మేనత్త ఇంట్లోనే వుంది. మా అత్తగారి తల్లి కూడా వుందిట. కానీ ఆవిడకి కాస్త మతి చలించిందిట. అందుకని మూలగా ఒక గదిలో వుంటుందిట. బయటికి రాదుట.

మా మావగారు ఎక్కడా కనిపించలేదు. అడిగాను.

"ఆయన ఉత్తర దేశయాత్రలకి వెళ్లారు" అంది మా అత్తగారు రుసరుసలాడుతూ.

ఇంట్లో వంటా అదీ చూస్తూ ఓ నడివయసావిడ వుంది. ఆవిడ పేరు రంగనాయకి.

ఇల్లంతా తిప్పి చూపి అందర్నీ పరిచయం చేసి గదిలో మంచం వాల్చింది మా అత్తగారు.

"కాస్సేపు పడుకో" అనేసి వెళ్లిపోయింది.

మంచంమీద నడుం వాల్చాను. మా అమ్మ చెప్పిన ప్రకారం 'బోలెడంత ఆస్తి వుంది. ఇంట్లో ఆడదిక్కులేక పెళ్లి చేసుకుంటున్నాడు'

తీరా చూస్తే ఇంట్లో బోలెడుమంది ఆడవాళ్లున్నారు.

అయోమయంగా అనిపించింది నాకు. ఆలోచిస్తూనే నిద్రపోయాను.

"పిన్నీ పిన్నీ లే" అంటూ నిద్ర లేపుతూ వుంటే మెలకువ వచ్చింది. లేచి కూర్చున్నాను.

"మొహం కడుక్కో పిన్నీ" అంది నన్ను




నిద్రలేపిన నా పెద్ద కూతురు.

పిన్ని ఎవరా అని చుట్టూ చూశాను. తర్వాత గుర్తు వచ్చింది. ఎవరో కాదు. ఆవిడకి వరస ప్రకారం నేనే పిన్నిని.

లేచి ఇవతలకి వచ్చాను.

"అత్తయ్యగారూ" అంటూ నా కోడలు పలకరించి మాట్లాడింది. కాఫీ ఇచ్చారు.

చీకటిపడుతూ వుండగా నా భర్త ఇంటికొచ్చాడు. నా సవితి కొడుకులు, పెద్ద అల్లుడు కూడా వచ్చారు.

భోజనాలు అయ్యాక మా అత్తగారు నాకో తెల్లచీర కట్టి, జడవేసి, పూలుపెట్టి, పాల గ్లాసు చేతికిచ్చి గది ముందర నిలబెట్టి లోపలికి వెళ్లమని చెప్పి వెళ్లిపోయింది.

ఆవిడ అటు వెళ్లగానే గబగబా నాలుగు గుక్కల పాలు తాగేసి మూతి తుడుచుకున్నాను.

చెప్పద్దూ అమృతంలా వున్నాయి ఆ పాలు.

నాకు నా చిన్న చెల్లి గుర్తు వచ్చింది.

మెల్లిగా లోపలికి వెళ్లాను.

గదిలో మంచం మీద కూర్చుని వున్నాడాయన. మా అత్తగారి ఆదేశం ప్రకారం పాల గ్లాసు అందించాను.

"వద్దు నువ్వే తాగు" అన్నాడు.

అన్నదే తడవు క్షణం ఆలస్యం చేయకుండా గడగడా గ్లాసుడు పాలూ తాగేశాను.

పడుకోమన్నాడు మంచం చూపించి.

పడుకున్నాను. మెత్తగా ఎంత హాయిగా వుంది పక్క. మెల్లిగా నా మీద చెయ్యి వేశాడు. ఆ తర్వాత అతని ప్రవర్తనకి వాంతి వచ్చినంత పనైంది నాకు.

కోపం వచ్చి చెయ్యి రక్తం వచ్చేలా కొరికాను.

జవాబుగా చెంప పగిలేలా కొట్టాడతను.

"నోరు మూసుకుని పడుకో" అని కసిరాడు.

రాత్రంతా ఏడుస్తూనే వున్నాను.

తెల్లవారింది.

నాలుగు రోజులు తిరిగేసరికి ఆ సంసారం గురించి అంతా ఆకళింపు చేసుకున్నాను. చూసి తెలుసుకున్నది కొంత, రంగనాయకమ్మ ద్వారా తెలుసుకున్నది మరి కొంత.

ఆస్తి అంతా మా అత్తగారిది.

ఆవిడ తండ్రి మంచి భూస్వామి. తెలివి గలవాడు, కష్టజీవి, సమర్థుడు. ఆయన హయాంలో బోలెడంత ఆర్జించాడు.

ఆయనకి ఒక్కతే కూతురు.

ఆవిడని ఒక బుద్ధిమంతుడికి ఇచ్చి పెళ్లి చేసి ఇల్లరికం తెచ్చుకుని అంతా అతడి చేతుల్లో పెడితే ఇంతకి పదింతలు అవుతుందనే సదుద్దేశ్యంతో మా మామగారిని వెతికి పట్టుకుని కూతుర్నిచ్చి పెళ్లి చేశాడుట.

మరి అంత తెలివి గలవాడే ఎక్కడ పొరబడ్డాడో అల్లుడిని ఎంచుకోవడంలో, పప్పులో కాలువేశాడు.

ఆయనెంత కష్టజీవో అల్లుడంత సోమరిపోతు. ఆయనెంత తెలివిగలవాడో ఈయనంత మేధకుడు.

ఆయన అమాయకత్వాన్ని నోరులేని తనాన్ని ఆసరా చేసుకుని జలగల్లా పట్టుకుని పీడించసాగారు ఆయన బంధువర్గం.

ఫలితంగా ఆస్తి అంతా చూస్తుండగానే చెల్లాచెదరైపోవడం మొదలయింది. అది చూసి బెదిరిపోయిన మామగారు అల్లుడిని కట్టడి చేశాడు. పైసా అందకుండా చేశాడు.

పైకి గాంభీర్యం నటించినా ఇంతా సంపాదించి ఇటువంటి చేతగాని వాడి చేతుల్లో పెట్టాననే చింతతో కృంగిపోయి మంచాన పడి ప్రాణం వదిలాడాయన.



ఆయన పోయాక అల్లుడి పని మరీ దిగ జారిపోయింది. అడగని వాడిదే పాపం అన్నట్లు దోచిపెట్టసాగాడు. అది చూసి భార్య నోరు చేసుకుంది. ఆవిడ నోటికి ఆగ లేక ఇల్లొదిలి పెట్టి పోయాడు ఆయన. మళ్లీ తిరిగి రాలేదు. ఉన్నాడో పోయాడో కూడా తెలియదు.

ఆయన ఇల్లొదిలి పోయే నాటికి మా ఆయనకి పదో ఏడుట. తండ్రి పోలిక కొడుక్కి ఎక్కడొస్తుందో, చేతగాని వాడిలా తయారైపోతాడో అని భయపడి మా అత్త గారు మొదటినుండి కొడుకుని గట్టిగా, కరుకుగా తయారయేలా పెంచిందిట.

ఫలితం ఈయన కొరకరాని కొయ్య అయి కూర్చున్నాడు.

ఆయనకి తోచదు. ఒకరు చెప్పింది వినడు.

ఎంత సంపాదిస్తున్నాడో, ఎంత ఖర్చు పెడుతున్నాడో ఎవరికీ చెప్పడు.

ఎంత వుందో ఎంత పోయిందో మరో మానవ మాత్రుడికి తెలియదు.

కన్న తల్లికీ చెప్పడు. కట్టుకున్న భార్యకీ చెప్పడు. కడుపున పుట్టిన బిడ్డకీ చెప్పడు.

భేషజాలకి తక్కువ లేదు. జల్సాలు ఎక్కువ. వ్యసన పరుడు. ఈయన హయాంలో ఆస్తికి మరీ కాళ్లొచ్చేశాయి.

వందలాది ఎకరాలు కరిగిపోయాయి. ఇంట్లో ధాన్యం కొట్లో ఓ మూల దాగి వున్నాయి ధాన్యం బస్తాలు. ఆ కాసినీ ఇంటివారి తిండికి సరిపోతాయి. పాడి పశువులు తరిగిపోయి రెండు పాడి గేదెలు మాత్రం మిగిలాయి.

"పరిస్థితి రానురాను దిగజారుకుంది.

ఆర్థికంగా అంతంత మాత్రంగా వున్నా ఆర్భాటాలకేం తక్కువ లేదుగా.





పురుళ్లకూ, పుణ్యాలకూ, రాకలూ పోకలూ ఏవి తప్పుతాయి?

"మీ అత్తగారి తల్లి ఓ పిచ్చి మాలోకం. ఆవిడని ఇన్నాళ్లూ నీ మొగుడి మేనత్త ముండ చూసింది. ఆవిడకీ రెండుసార్లు గుండెపోటు వచ్చింది. ఇహనో ఇప్పుడో అనేట్లు వుంది. ఈవిడ కాస్తా హరీమంటే ఆవిడని ఎవరు చూస్తారు?

"మీ అత్తగార్ని చూశావుగా. ఇవతలి పుల్ల అవతల పెట్టదు. కోడళ్లున్నారంటే చంటిపిల్లలతో వాళ్లపనే వాళ్లకి సరిపోతుంది.

"నేనున్నానూ అంటే రెండు నెలలు చాకిరీ చేయించుకుని ఒక నెల జీతం ఇచ్చే ఈ కొంపలో నేను మాత్రం ఎంత కాలం వుంటాను? ఇంటెడు చాకిరీ చెయ్యాలంటే ఎవరు చేస్తారు. డబ్బిచ్చి మనిషిని పెట్టినా ఎన్నాళ్లుంటుంది? అందుకని తెలివిగా వ్యవహరించి బారెడు పుస్తెముక్క నీ మెళ్లో కట్టి శాశ్వతంగా పడుండే మనిషిని తెచ్చుకున్నారు"

"పసిపిల్లవి వీళ్ళందరి జీవితాలూ ఢోకాలేకుండా వెళ్ళదీసేవరకూ పిక్కలా వుంటావు. ఏమాటకామాటే చెప్పుకోవాలి మీ అత్త కాలాంతకురాలు. బాగా ఆలోచించే ప్లాను వేసింది. లేకపోతే యాభయ్యవ పడిలో పడినవాడికి పెళ్ళేమిటి?

"నీకైతే జీతంభత్యం అక్కర్లేదు. పారిపోతావనే భయం లేదు. ఇలాటి కొంపలోకి పెళ్ళిపేరున సాగనంపిన దరిద్రులు నీ పుట్టింటివారు. ఇక ఏ అండ చూసి పారిపోతావుగనక? చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవ" అంది రంగనాయకమ్మ చివరిగా నిట్టూరుస్తూ.

నాకు ఏడుపొచ్చింది, ఏడిచేశాను.

"ఏడవకే వెర్రి తల్లీ! ఏడిచి ఏం ప్రయోజనం? ఏడిస్తే బతుకులు బాగుపడతాయా? " అంది ఆవిడ కళ్ళొత్తుకుంటూ.

అంతలోనే లోపలినించి పిలిచింది మా అత్తగారు.

"ఏవిటా మంతనాలు? పనివాళ్ళతో నీకు మాటలేవిటి? అంతేలే. తక్కువ మనుషులు తక్కువ బుద్ధులు అని. దరిద్రపు కొంపలో పుట్టిపెరిగినదానివి నీకేం తెలుస్తాయి ఈ ఇంటి పద్ధతులు? మనది జమీందార్ల వంశం" అంటూ పెద్ద ఉపన్యాసం ఇచ్చింది.

అప్పుడనేకాదు రోజులో కనీసం ఒక్కసారైనా అలా లెక్చరు ఇవ్వడం ఆవిడకి అలవాటు.



క్రమంగా నాకూ అలవాటు అయింది. మెల్లగా ఆ ఇంటి వాతావరణానికి అలవాటు పడసాగాను. వంట మాత్రం రంగనాయకమ్మ చేసేది, పైపన్లు నేను చూసుకునే దాన్ని.

నా కొడుకులు ఇద్దరూ పొద్దున్నే భోజనాలు చేసి పక్క ఊరికి వెళ్ళిపోతారు. తిరిగి సాయంత్రం చీకటిపడ్డాకే రావడం.

మాఆయనకి ఓ వేళాపాళాలేదు. త్రిపాది నక్షత్రం. ఎప్పుడొస్తాడో ఎప్పుడు పోతాడో ఆయనకే తెలియదు.

కోడళ్ళూ, కూతుళ్ళూ వాళ్ళ గోలలో వాళ్ళుంటారు. ఇష్టమైతే మాట్లాడతారు. కష్టం అయితే మానేస్తారు.

మా ఆయన మేనత్త బాగా పెద్దదైపోయింది. సరిగ్గా వినపడదు. ఆపసోపాలు పడుతూ తన పని చేసుకుని ఆ ముసలావిడ పని చేసేసరికి సరిపోతుందావిడకి.

మా అత్తగారు దమ్మిడీ పని చెయ్యదు. కానీ మాటలు మాత్రం కోటలు దాటుతాయి. "నా చిన్నతనంలో అరగంటలో అడ్డెడు బియ్యం దంచి అరిసెలు చేసేదాన్ని. మానెడు పిండి లడ్డులు కట్టాలంటే క్షణం పని నాకు" అంటూ కబుర్లు చెప్తూవుంటుంది.

రంగనాయకమ్మ మంచిదే. కానీ చెయ్యివాటుతనం ఎక్కువ. ఉప్పు, పప్పు, చింతపండూ అన్నింటికీ కాళ్ళు వచ్చేస్తూంటాయి. ఒకసారి రెండు సార్లు కళ్ళారా చూసి ఇదేమని అడిగితే నామీద గయ్‌మని లేచింది. "జీతం తిన్నగా ఇవ్వకపోయినా ఈ ఇల్లు కదలకుండా పట్టుకుని పాకులాడుతున్నది ఎందుకనుకున్నావ్. ఇందుకే. నాకు మాత్రం ఇల్లు గడవద్దూ! అని నిలదీసి అడిగింది. నాకెందుకని ఊరుకున్నాను.

పదిహేను రోజులు గిర్రున తిరిగి వచ్చాయి. పదహార్రోజుల పండగ అయింది.

ఆ మరుసటి వారంలోనే నా రెండో కూతురికి సూడిదలు ఇచ్చి తీసుకురావాలని ముహూర్తం పెట్టారు. అడ్డెడు బియ్యం చలిమిడికోసం నానబోశారు. పిండి దంచమని పురమాయించింది మా అత్తగారు.

నేను పుట్టింది పేద ఇంట్లోనే. అపురూపంగా పెరగకపోయినా వంటరిగా ఇటువంటి బండపనులు చేసి ఎరగను. ఎండలో నిలబడి రోకలితో బియ్యం దంచేసరికి చేతులు బొబ్బలు ఎక్కాయి.

నా పెద్దకోడలు పిండి జల్లించడంలో సహాయం చేసింది.

బొబ్బలు ఎక్కిన చేతులకి కొబ్బరి నూనె రాసింది రంగనాయకమ్మ.





"ఓయబ్బా సంబడం. ఈమాత్రం దానికే? నీ వయసులో నేను బస్తాడు బియ్యం దంచి అవతలపడేసేదాన్ని ఆడుతూపాడుతూ" అంది మా అత్తగారు.

మర్నాడు కూతురి అత్తవారింటికి వెళ్ళమన్నారు. నాకు భయం వేసింది. ఆ మాటే అంటే "ఇంకా నయం. నువ్వెళ్ళకపోతే వాళ్ళు తప్పు పట్టుకోరూ? పెద్దది సాయం వస్తుందిలే" అంది అత్తగారు.

ప్రయాణానికి సిద్ధం అయ్యాం నేనూ నా పెద్దకూతురూ. చలిమిడి బిందెలూ, పళ్ళ గెలా బండిలోకి ఎక్కించారు. నేనూ గబగబా తయారై వచ్చాను. ఎగాదిగా చూసింది మా అత్తగారు.

"ఆ గూడకట్టూ, ఆ వాలుజడా! ఏం లక్షణంగా వుంది! వియ్యాలవారింటికి వెళ్ళేటప్పుడు ఇలా కుర్రవేషాలువేస్తే మన పరువేం కావాలి. అసలే మనది జమీందార్ల వంశం" అంటూ లోపలికి వెళ్ళి ఏడుగజాల చీరె ఒకటి తెచ్చి ఇచ్చింది.

"ఇది కాసె పోసి కట్టుకో" అంది.

నాకు చేతకాక వెర్రిమొహం వేశాను. రంగనాయకమ్మ సహాయం చేస్తానంటూ ముందుకి వచ్చింది.

"ఆ చేత్తోనే జుట్టు కూడా ముడివెయ్" అంటూ మరో ఆజ్ఞ జారీ చేసింది.

కాసె పోసి చీరెకట్టి జడ విప్పింది రంగనాయకమ్మ.

"ఎంత చక్కటి జుట్టు" అంది.

నాదీ నా చెల్లెళ్ళదీ బారెడు జుట్టు. చచ్చి ఏలోకాన వుందో మా నాయనమ్మ.

"ఏం జుట్టే తల్లీ ఎక్కడి కొబ్బరినూనే చాలదు. ఎన్ని కుంకుళ్ళూ చాలవు" అని సణుక్కునేది.

జుట్టు దువ్వి ముడివేసింది రంగనాయకమ్మ.

"ఇప్పుడు బాగున్నావు పెద్ద తరహాగా. రేపట్నించి ఇలాగే వుండు" అంది మా అత్తగారు.

అప్పటికి నా వయసు పధ్నాలుగేళ్ళు బండిలో మా చిన్నకూతురి ఊరుకెళ్ళాం, నేనూ నా పెద్దకూతురూ.

"మా పిన్ని" అంటూ పరిచయం చేసింది పెద్దకూతురు. సూడిదలు ఇచ్చి చిన్నకూతుర్ని తీసుకొచ్చేం.

ఆవిధంగా సంసారసాగరంలో ప్రవేశించాను. ఈదడమే నా పని. పొద్దున్న లేచిన దగ్గరనుండి రాత్రి ఝాము పొద్దుపోయే దాకా ఒకటే పని. పుట్టింట్లో తిండీ వుండేది కాదు, ఇంత పనీ వుండేది కాదు. అత్తవారింట్లో రెండు పూటలా పీకలదాకా తిండి. దినం అస్తమానం చాకిరి.

మరో రెండు సంవత్సరాలకు అంటే నా పదహారవ ఏట నాకు నెల తప్పింది.

అంతా ముందు తెల్లబోయారు. తర్వాత మొహమొహాలు చూసుకుని నవ్వుకున్నారు.

మా అత్త సణుక్కుని వూరుకుంది.

అమ్మావాళ్ళకి జాబు రాశారు. 'సంతోషించాం. ఆరోగ్యం జాగర్త. ఏమాత్రం అవకాశం వున్నా పురిటికి వస్తాను' అని రాయించింది అమ్మ.

ఆవేళ పెళ్ళిచేసి పంపించడం, మళ్ళీ మేము కలుసుకోలేదు. నాన్న మంచానపడ్డాడు. పెద్ద చెల్లికి పెళ్ళి అయింది. అతనికీ రెండోపెళ్ళే. ఇద్దరు పిల్లలున్నారు. కాకపోతే చిన్నపిల్లలు.

బజార్లో బండిమీద బజ్జీలు వేసి అమ్మటం అతని వ్యాపారమట. అది బాగానే వున్నట్లు తెలియవచ్చింది.

పురిటికి సాయం వస్తానన్న అమ్మ రానే లేదు. నాన్నకి బాగా సీరియస్‌గా వుందిట.

నాకు ఇంట్లోనే తేలికగా పురుడు వచ్చింది. మగపిల్లవాడు పుట్టాడు. అంతా ఆనందించారు.

పోన్లే దానికి సాయంగా వుంటాడు అనుకున్నారు.

పురుడు వెళ్ళగానే కబురు, నాన్న పోయాడని!

ఆ తర్వాత పదిరోజులకే మా ఆయన మేనత్త పోయింది.

"వీడు పుట్టిన వేళ ఎటువంటిదో అంతా తాటిపళ్ళలా రాలిపోతున్నారు" అంది మా అత్తగారు.

నాకు గతంలో వుండే పనికి అదనంగా పసిపిల్లాడి పని. ఆ ముసలమ్మ పని. ఆవిడకి మతి సరిగ్గా వుండదని బయటికి వచ్చేదే కాదు. ఓ గదిలో పడి వుండేది. ఆ రెండేళ్ళలో నేనావిడని చూడనేలేదు. ఒక వేళ ఆ గదిపక్కకి వెళ్ళినా పరిగెట్టుకు వచ్చేసేదాన్ని.

అటువంటిది ఇక తప్పనిసరి పరిస్థితిలో గుండె అరచేత పట్టుకుని తొలిసారి ఆ గదిలో అడుగు పెట్టాను.

తలుపు తెరవగానే "ఎవరూ" అంది ఓ





గొంతు.

"నేనేనండీ పాలుపట్టుకొచ్చాను" అన్నాను వణుకుతూ.

ఓరగా తెరిచి వుంచిన చిన్న కిటికీలోంచి పడుతున్న వెలుగు తప్పించి గది చీకటిగా వుంది.

మంచంమీద పడుకున్న ఆకారం లేచి కూర్చుంది.

ఎనభై ఏళ్ళపైనే వుంటుంది వయసు. ఆ వయసులోనూ మిలమిల మెరిసిపోతున్న వంటి రంగు. ముగ్గుబుట్టలాటి తల, ముడు తలుపడ్డ మొహం.

"ఎవర్నువ్వు? నా మనవడి పెళ్ళానివా?" అంది కళ్ళు నులుముకుంటూ.

"అవునండీ" అన్నాను భయంగా.

"రా! ఇట్టా" అంటూ పిలిచింది.

వణుక్కుంటూనే వెళ్ళాను.

చెయ్యి పట్టుకుని దగ్గర కూర్చోబెట్టు కుంది. తేరిపార చూసింది.

"లేవే తల్లీ! ఆ దేవుడికి కళ్ళు లేవు. కాకి ముక్కుకి దొండపండు" అంది.

నాకు ఆశ్చర్యం వేసింది.

ఆవిడ మామూలుగానే వుంది. పిచ్చి లక్ష ణాలు లేవు. లక్షణంగా వుంది. ఏమో నాకంతా అయోమయంగా వుంది.

నాకెందుకొచ్చిన గొడవ అనుకుని "పాలు తాగండి" అన్నాను.

"కాటికి కాలుజాచుకుని కూర్చున్నదాన్ని నాకెందుకే. పసిబిడ్డ తల్లివి నువ్వు తాగు" అంటూ తాగించింది.

"పాపాయి పనిచూసుకో. ఆ ముసిలిది వున్నన్నాళ్ళూ అది చూసింది. ఇప్పుడు నువ్వు ఫో" అనేసి పక్కకి తిరిగి పడు కుంది. మెల్లిగా లేచివచ్చేశాను నేను.

అది మొదలు ఆవిడ పరిచర్య నా దినచ ర్యగా మారింది. ఏ అర్ధరాత్రో కాలకృత్యాలు తీర్చుకుని బావిదగ్గర స్నానంచేసి వచ్చి ఆ గదిలో పడుకుంటుంది. పొద్దునపూట పాలు తాగుతుంది. పన్నెండు గంటలకి భోజనం. తిరిగి రాత్రికి పండూ, పాలు. ఆ గదిలోనే ఓ మూల మంచినీళ్ళకుండ. తూము దగ్గర ఒక నీళ్ళ బక్కెటూ వుంటాయి. ఏంటో తనలోతనే మాట్లాడు కుంటూనే వుంటుంది.

"లేవు... వాడికి కళ్ళులేవు. అంతా మోసం అన్యాయం. నోరున్నవాడిదే రాజ్యం" అంటూ ఏవిటేవిటో గొణుక్కుంటూ వుంటుంది. వుండుండి ఏడుస్తుంది. అంత లోనే నవ్వుకుంటుంది.

ఆవిడ ధోరణినిబట్టి నడుచుకునే దాన్ని నేను.

ఆరోజుల్లోనే ఒక సంఘటన జరిగింది. నా పెళ్ళిలో లేతాకుపచ్చ పట్టుచీరె, రెండు పేటల గొలుసు పెట్టింది మా అత్తగారు. ఎప్పుడైనా పండుగలకీ పేరంటాలకీ ఆ చీర కట్టుకుని గొలుసు వేసుకునేదాన్ని. ఆరోజు ఎక్కడో పేరంటం అంటే తయారవుదామని తీసి చూస్తే చీరే గొలుసూ రెండూ లేవు.

కంగారుగా పెట్టంతా వెతికాను. అందర్నీ అడిగాను. అందరూ మాకు తెలియదంటే మాకు తెలియదన్నారు.

నా అనుమానం రంగనాయకమ్మ మీదికి పోయింది. వెంటనే వెళ్ళి నిలదీసి అడి గాను.

అంతే తాడెత్తున లేచింది. "నా కూతురి లాటి దానివని ఆదరంగా చూసుకుంటుంటే నన్ను పట్టుకుని అంత మాటంటావా? ఏదో ఇంట్లో గడవక ఉప్పు, పప్పూ తీసుకు పోతానని నాకు దొంగతనం అంటగడ తావా? నీ గొలుసు, చీర ఏమయ్యాయో నన్నడుగు నేను చెప్తాను.

"చెరువుగట్టున వుండే శేషారత్నం ఇంట్లో వుంటాయి అవి... పో...! పోయి

వెతుక్కుని తెచ్చుకో దమ్ముంటే" అంది ఇంత గొంతేసుకుని.

ఒక్కముక్క అర్థంకాలేదు నాకు. "ఎవరా శేషారత్నం? నా నగ అక్కడికి ఎలా వెళ్ళింది" అన్నాను.

"ఎట్లా వెళ్ళాయా? కాళ్ళొచ్చి నడుచుకుపోయాయి. ఇక శేషారత్నం ఎవరని అడిగావు కదూ! నీ మొగుడు వుంచుకున్న ముండ. ఎన్నాళ్ళబట్టో నడుస్తోంది ఆ వ్యవహారం. నామీద ఎగరడం కాదు దమ్ముంటే దానిదగ్గరకు పోయి తెచ్చుకో లేదా నీఖర్మ ఇంతే అని సరిపెట్టుకొని వూరుకో" అని ఝాడించేసింది.

నోట మాట రాలేదు నాకు. అప్పటిదాకా అక్కడ చేరి గొడవంతా చూస్తున్న నా కోడళ్ళు ఏదో పనున్నట్లు జారుకున్నారు. మా అత్త మాత్రం అక్కడే నిలబడిపోయింది.

"ఏం... సరిపోయిందా? చివరికి పనివాళ్ళముందు కూడా చులకన అయిపోయింది నీ బతుకు. మగాడన్నాక సవాలక్ష వ్యవహారాలుంటాయి. ఆడది తెలివిగా కమ్ముకుపోవాలి. అంతేగానీ ఇలా బజార్నపడతారా. లేకిబుద్ధులు" అంటూ వెళ్ళిపోయింది.

ఎందుకో చెప్పలేనంత దుఃఖం వచ్చింది నాకు. లోపలికి వెళ్ళి వెక్కెక్కి ఏడిచాను. అంతలోనే వచ్చాడు నా భర్త.

కోపంతో నిలదీశాను. నవ్వేశాడు. "అదా! అవసరం వచ్చి తీసికెళ్ళాను. పేరంటానికి వెళ్ళాలంటే అమ్మనో, కోడళ్ళనో అడిగి గొలుసు తీసుకోకపోయావా? దానికింత యాగీ ఎందుకు? " అన్నాడు.

"వాళ్ళనీ వీళ్ళనీ అడగాల్సిన అవసరం నాకేవిటి? అసలైనా నా గొలుసు ఏది? ఎవరా శేషారత్నం? " అన్నాను నిలదీస్తూ.

అంతే లేచి నిలబడ్డాడు. నిప్పులు కక్కుతూ, గుడ్లు ఇంతింత చేసుకుని అరుస్తూ నామీద పడ్డాడు లెంపలు వాయించాడు తల గోడకేసి కొట్టాడు.

"నా ఇష్టమే! నా ఇష్టం. ఒకర్తినికాదు వందమందిని వుంచుకుంటాను. నీ బాబుగాడి సొత్తు నాకేమైనా తెచ్చి ఇచ్చావా నామీద అథార్టీ చెలాయించడానికి? " అంటూ బండబూతులు తిట్టి చరచర వెళ్ళిపోయాడు.

ఇదంతా చూస్తూనే వున్న మా అత్తగారు "వెధవ పీడాకారం? " అని విసుక్కుంది. "నన్నో మరి కొడుకునో? "

అంతలో రంగనాయకమ్మ లోపలికి వచ్చింది. నన్ను దగ్గరికి తీసుకుని తల నిమిరింది.

"పిచ్చిపిల్లా అసుద్ధంమీద రాయివేస్తే ఎవరికి నష్టం? వ్యసనపరుడి జోలికి వెళ్తే కందిరీగల తుట్టె కదిలించినట్లే? " అంది ఆదరంగా.

ఆవిడని కావిలించుకుని ఏడిచాను. "ఏడవకమ్మా. ఏడిచి ఏం ప్రయోజనం. దిక్కుమాలిన ఆడపుటక పుట్టాక ఎన్ని అనుభవించాలో! ఏడిస్తే ఏమౌతుంది. లే... లేచి మొహం కడుక్కుని భోజనం చెయ్యి. బాలింతవి. ఒట్టికడుపుతో వుండకూడదు" అంటూ లేవదీసి బలవంతాన అన్నం తినిపించింది. పసివాడిని పక్కన వేసుకుని పడుకున్నాను. చాలాసేపు అయ్యాక గుర్తుకి వచ్చింది. ముసలావిడకి పాలు, పళ్ళు ఇవ్వలేదని. అదిరిపడి లేచి పిల్లాడిని ఎత్తుకుని పాలు, పళ్ళు తీసుకుని గదిలోకి వెళ్లాను.

ఆవిడ పడుకుని వుంది. లేపాను. నీరసంగా లేచి కూర్చుంది. ఆత్రంగా అరటి పళ్ళు తిని పాలు తాగింది. నాకు జాలి వేసింది. ఆవిడని ఆకలితో పడుకోబెట్టినందుకు బాధవేసింది. మా అత్తగారిమీద పీకల్దాకా కోపం వచ్చింది. సందర్భాన్నిబట్టి ఒక్కపూట తల్లిని చూసుకోలేదా?

పాలు తాగి గ్లాసు అందిస్తూ అడిగింది. "ఏమిటి? ఏదో గొడవ పడ్డట్లున్నారు?" ఆవిడ అడగకపోయినా చెప్పేదాన్నే నేను. ఒక్క ఆవిడకే కాదు ఊరూ వాడా అంతా చాటింపువేసి చెప్పాలన్నంత ఉక్రోషంగా వుంది నాకు. అంతా చెప్పేశాను.

"దిక్కుమాలిన బతుకు. ఎందుకొచ్చిన జన్మిది. చద్దామంటే వీడిమీద మమకారం పట్టిపీకుతోంది" అన్నాను ఏడుస్తూ.

దీర్ఘంగా నిట్టూర్చింది ఆవిడ. చేతిమీద లెక్కలు వేసింది. పేలవంగా నవ్వింది. "ఏమి విచిత్రం. అవడానికి మనవడి పెళ్ళా నివే అయినా న్యాయంగా మునిమనవడి భార్య వయసుదానివి. అంటే నా తర్వాత మూడోతరం దానివి. నేను నీ వయసులో వున్నపుడు నువ్వు ఇప్పుడు ఏడుస్తున్నట్లే ఏడిచాను. ఆ తర్వాత నీ అత్తగారూ ఇదే ఏడుపు ఏడిచింది. అనంతరం నీ సవితీ ఏడిచింది. ఇప్పుడు నువ్వేడుస్తున్నావ్. ఇంకా ఎన్నాళ్ళు ఎన్నేళ్ళు ఎన్ని తరాలు ఇట్లా ఏడుస్తాం?" అంది విరక్తిగా.

ఆవిడవంక ఆశ్చర్యంగా చూశాను. ఆవిడని మతిలేనిదని చెప్పింది మా అత్తగారు. కానీ ఈవిడ మతిలేనిది కాదు సరికదా మంచి జ్ఞానం కలిగినవ్యక్తి. మరి ఎందుకలా చెప్పింది. ఈవిడ అందరిలా ఎందుకు తిని తిరగదు. అందరికీ దూరంగా ఈ మూల గదిలో ఎందుకు పడుంది? ఆవిడనే అడిగేశాను. చిన్నగా నవ్వింది.

"ఇట్రా నా దగ్గర పడుకో" అంటూ పక్కకి జరిగి చోటిచ్చింది. పిల్లాడిని పక్కలో వేసుకుని పడుకున్నాను. నా పక్కనే పడుకుని నామీద చెయ్యివేసింది.

"నాకూ చిన్నతనంలోనే పెళ్ళయింది. అప్పటికి నాకింకా ఊహ తెలియదు. పెద్దమనిషినయ్యాక కాపురానికి వచ్చాను. నా భర్తకి అప్పటికి ఎక్కువ ఆస్థిపాస్తులు లేవు. అంతా ఆయన కష్టార్జితమే. మహా తెలివిగలవాడు. కష్టపడేవాడు, సంపాదించేవాడు, అనుభవించేవాడు. ఎక్కడికైనా వెళ్ళాలంటే గుర్రం, పెట్టె బండి, పల్లకి హంగులన్నీ వుండాల్సిందే. ముప్పూటలా తనకు కావలసినది వండించుకుని సుష్టుగా తినేవాడు. కావలసిన బట్ట కట్టుకునేవాడు. ఆయనదంతా మహారాజ భోగం. ఎకరాలకొద్దీ భూమి. వడ్డీవ్యాపారం. పాడి, ఇళ్ళు, నగలు, నాణ్యాలు. దేనికీ లోటు లేదు.

"జనం అంతా ఆయన తెలివితేటలు చూసి వేనోళ్ళ పొగిడేవారు. జేజేలు కొట్టేవారు. వంగి సలాములు చేసేవాళ్ళు.

"దాదాపు నలభై ఏళ్ళు కాపురం చేశాను. ఏనాడూ ఆదరంగా ఒక మాటమాట్లాడి ఎరగడు. ఆప్యాయంగా పలకరించిన పాపాన పోలేదు. అంత జమీందారు భార్యని, చేతికి గాజులు చిట్లిపోతే దొంగతనంగా నెయ్యి అమ్మి ఆ డబ్బుతో గాజులు వేయించుకునే దాన్ని. ఏనాడూ ఒక్క దమ్మిడీ నా చేతులో పెట్టి వాడుకోమని అనలేదు. ఏనాడూ నాకు నచ్చిన గుడ్డ కొనిపెట్టలేదు. ఏ పని మీదో పట్నం వెళ్ళినపుడు నాలుగు నేతచీరెలు, రవిక గుడ్డలూ కొనుక్కొచ్చి పడేసేవాడు. పెళ్ళికి పెట్టిన పెద్దాపురం పట్టుచీర ఒక్కదానితోనే జీవితం వెళ్ళదీసేశాను. పెళ్ళికెళ్ళినా అదే చీర. పేరంటానికెళ్ళినా అదే చీర. అలాటి సందర్భం వస్తే కాసులపేరూ, వడ్డాణం తీసి ఇచ్చేవాడు. వేసుకుని వెళ్ళి తిరిగిరాగానే తీసుకుని ఇనప్పెట్లో పెట్టేసుకునేవాడు.

ఎర్రటి ఎరుపు చీరెకట్టుకుని నగలు పెట్టుకుని దేవీ నవరాత్రిళ్ళలో పూజ చేసుకోవాలని ఎంతో ఆశపడేదాన్ని. తీరనేలేదు. నోరు తెరిచి ఏదైనా అడిగినా పెడచెవిన పెట్టేవాడు. ఒకటికి రెండుసార్లు చెప్తే ఆడదానివి నీకేం తెలుసు. ఎప్పుడేం చెయ్యాలో నాకు తెలుసు" అని కసురుకునేవాడు.

నాకు కూతురు పుట్టినందుకు చాలా

నిరాశపడ్డాడు. కొడుకు కావాలని చాలా ఆరాటపడ్డాడు. రెండోసారి కాన్పు కష్టం అయింది. బండిలో వేసుకుని తీసికెళ్ళారు. ఆస్పత్రికెళ్ళేసరికే కడుపులో పిండం చచ్చిపోయింది. ఇక నాకు పిల్లలు పుట్టరని చెప్పారు. బాగా కోపం వచ్చింది ఆయనకి.

ఇంకో పెళ్ళి చేసుకుంటానని కొన్నాళ్ళు, ఎవరినైనా పిల్లాడిని తెచ్చి పెంచుకుంటానని ఇంకొన్నాళ్ళు హడావిడి చేశాడు. తీరా ఆయన జాతకం చూసి నీకు కొడుకు పుట్టే యోగం లేదన్నారుట. అందుకని నెత్తిన చేతులు పెట్టుకుని కూర్చున్నాడు.

ధైర్యం చేసి ఆయనకు ధైర్యం చెప్పాను. "కూతురైతేనేం. ఆ వ్యవహారాలను దానికే నేర్పండి. మన చుట్టాలలో తెలివిగల పిల్లవాడిని తెచ్చుకుని పిల్లనిచ్చి పెళ్ళిచేస్తే ఇద్దరూకలిసి ఆస్తిపాస్తులు చూసుకుంటారు" అన్నాను. వినలేదు. పైగా నామీద తాడెత్తున లేచాడు. "బోడి సలహాలు చెప్పకు" అన్నాడు.

అయినా వెర్రికాకపోతే ఆ లెక్కలూ డొక్కలూ దానికి నేర్పితే నేర్చుకోదా! ఆకళింపు చేసుకోదా! సుమర్థించుకోదా! అందులోనూ నా కూతురు మహా తెలివిగలది. కానీ ఏం లాభం? సరైనదారిలో పెడితే కదా తెలివితేటలు రాణించేది.

నా మేనల్లుడు ఒకడు వుండేవాడు. చాకులాంటివాడు. తెలివితేటలేకాదు బుద్ధిమంతుడు కూడా. అతడికి పిల్లనిచ్చి చెయ్యమని మా అన్నయ్య అడిగాడు. నాకూ మనసులో వుండేది.

సమయం చూసుకుని ధైర్యం సమకూర్చుకుని ఆయనతో చెప్పాను.

సభ్యతగలవారు మాట్లాడడానికి వెనుకాడే భాషలో తిట్టిపోశాడు. "ఈ ఇంట తిని ఆ ఇంటికి కాపలాకాసే కుక్కలాంటి దానివి" అని నిందించాడు.

గతిలేని కుటుంబంలోనుండి వచ్చి అంతా పుట్టింటికి దోచిపెట్టాలని దురాలోచన చేస్తున్నావు అన్నాడు.

ఒక మాట కాదు, ఒక తిట్టుకాదు అనరాని మాటలన్నీ అన్నాడు.

"ఏం చెయ్యాలో ఎట్లా చెయ్యాలో నాకు తెలుసు. ఇక ఎప్పుడూ బోడిసలహాలు ఇవ్వకు" అని హెచ్చరించాడు.

పోనీ అంత తెలివిగలవాడు తెలివిగా వ్యవహరించాడా అంటే అదీ లేదు. ఎత్తెత్తి కాలు ఎంగిలాకులో వేసినట్లు వెతికి వెతికి ఓ వెర్రివెంగళప్పను పట్టుకొచ్చి పెళ్ళి చేశాడు.

అయిదు జతల గాజులు, అయిదు పేటల గొలుసు, వడ్డాణం, వంకీ, కాసులపేరు పెట్టి బంగారం లాంటి పిల్లను కన్యాదానం చేశాం.

మా అల్లుడివైపు బంధువులంతా రాబందులూ, గుంటనక్కలూ. ఇతడు ఏమీ తెలియని అమాయకుడు. నా కూతురికి అమిత గర్వం. నీ పాటిది ఈ భూమిమీద లేదు అని పొగిడితే బోర్లాపడి పోయేది. దానికి సాయం ఇద్దరికీ చిన్నతనం. లోకజ్ఞానం బొత్తిగా లేదు. ఎదుటివాడి గుండాగి చచ్చేలా అరవడం తప్పించి ఇది మంచి, ఇది చెడు అని వివరించి చెప్పే ఓరిమి నా భర్తకి లేదు.

ఫలితం పరిస్థితి చేజారిపోసాగింది. దానితో అంతటి మనిషీ బెంగపెట్టుకుని మంచంపట్టాడు.

పోనీ ఆ స్థితిలోనైనా తెలివి తెచ్చుకుని జాగర్తపడవచ్చా అదీ చెయ్యలేదు. ఆస్తిలో సగం అల్లుడిపేరా, మిగిలిన సగం కూతురికి పుట్టబోయే మనవడి పేరా పెట్టి, క్రయవిక్రయాదుల సందర్భంలో విధిగా నా కూతురి ఆమోదం వుండాలని షరతుపెట్టి తెలివిగా వ్యవహరించానని మీసాలు మెలేసుకున్నాడు.

ఆ మానవుడి మీద జాలివేసింది నాకు.

# పలినముత్యాలు

★ జనసమ్మర్ధంలో నివసిస్తూ కూడా ఏకాంతంలోని స్వేచ్ఛను, మాధుర్యాన్ని అనుభవించేవాడే ఉన్నతమైన వ్యక్తి.

-ఎమర్సన్

★ మానవుడు కలకాలం జీవించటం సంభవిస్తే తన సంతానాన్ని గురించి లక్ష్యపెట్టడు.

-హాథోర్న్

★ శ్రమలోనే ఆరోగ్యం వుంది. కష్టించి పనిచేయటం మినహా దానికి మరో రాజమార్గంలేదు.

-ఫిలిప్స్

★ కనికరం అలవరచుకోవటం జీవితవ్యాపారంలో ఒక విలువైన భాగం.

-జాన్సన్

★ సులభమైన పనులను సక్రమంగా చేసే నేర్పుగల వారు మాత్రమే కఠినమైన కార్యాలను తేలికగా నెరవేర్చగలిగే నేర్పును కలిగివుంటారు.

-స్కిల్లార్

★ గొప్పనాయకులు సాధారణ మనుషుల మనసులలో అసాధారణమైన పనులను చేయగలమన్న భావనను కలుగజేస్తారు.

-అరిస్టాటిల్

★ మనం ఇష్టపడినది దక్కనప్పుడు మనకు దక్కినదాన్నే ఇష్టపడాలి.

-శ్రీరామకృష్ణ పరమహంస

★ స్నేహం ఎప్పుడూ మనకు ఉపయోగపడుతుంది. ప్రేమ మాత్రం అపుడపుడు గాయపరుస్తుంది.

- సెనేకా

★ నీ బాధకు కారణం ఏదైనా కావచ్చు కానీ ఆ కారణంతో ఇతరులకు మాత్రం హానిచేయకు.

-బుద్ధుడు

★ ధర్మాత్ముడైన మనిషి ఒక మంచి గంధపుచెట్టులాంటివాడు. దానిని నరికే గొడ్డలికి కూడా అది సువాసననిస్తుంది.

-తులసీదాసు

★ హాని జరిగిన తర్వాత సలహా ఇవ్వటం, మరణానంతరం మందు ..... ఇవ్వటంవంటిది.

-డానిష్

సేకరణ : పట్నం శేషంశెట్టి

# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలుబడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాదు-500 082 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ.100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**జూన్ చతుర నవల అబలాయానం**

సమీక్షకుని పేరు : ____________________

చిరునామా ____________________

ఆడవాళ్ళపట్ల చులకన, మగవాడేదో తప్పు తలకెత్తుతాడనే వెర్రి తాపత్రయం కాకపోతే కట్టుకున్న దాన్ని నేనున్నాను. నాకు ఓ దమ్మిడీ ఆస్థి రాయలేదు. కడుపున పుట్టిన కూతురి పేరా ఏమీ పెట్టలేదు. అస్థ వ్యస్థం మనిషి అల్లుడి పేరా, ఎప్పుడో పుట్ట బోయే మనవడి పేరా కష్టార్జితం అంతా రాసిన వాడిని మూర్ఖుడని అనాల్సిందే

ఏదయితేనే, ఆ ఘటం వెళ్ళిపోయింది.



మూడవ నెల నా పుట్టింటివారు వచ్చి తీసుకువెళ్ళారు. ఆ వెళ్ళడం ఏడాదిదాకా తిరిగిరాలేదు. వచ్చేసరికి ఈ ఇంటి పరిస్థితి పూర్తిగా మారిపోయింది.

ఇంటినిండా జనం. అందరూ అల్లుడి ఆత్మీయులే పైకి తీయగా మాట్లాడుతూ వెనక గోతులు తీసేవారే.

వారిదే పెత్తనం అంతా! వారి అజమాయిషీలో సంవత్సరీకాలు వైభవంగా నభూతో నభవిష్యతి అన్నట్లు జరిపించారు. ఏడు ఊళ్ళ జనాన్ని పిలిచి సమారాధనచేసి భోజనాలు పెట్టారు.

గోదానాలేనా భూదానాలేనా భూరి సంభావనలేనా అంతా ఘనంగా జరిగిపోయింది.

ఆ రాత్రి అమ్మాయిని పిలిచి "ఏమిటే అమ్మాయ్ ఇదంతా" అని అడిగాను. నేనడిగిన ఆ ప్రశ్నకు పెద్ద సమాధానం చెప్పింది నా కూతురు. వాళ్ళవాళ్ళంతా చాలా తెలివి గలవాళ్ళట. "ఇట్లా భూమి రూపంలో వుంటే ఆస్తికి ఎదుగూ బొదుగూ వుండదు. ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వున్నట్టు వుంటుంది. దానికి బదులుగా భూములు అమ్మి వ్యాపారంలో పెడితే డబ్బు దినదినాభివృద్ధి చెందుతుంది. అందుకని భూము లమ్మి ఏకంగా ఒకేసారి అయిదారు వ్యాపారాలు మొదలుపెట్టారు" అంది.

వింటూ వున్న నాకు మతిపోయినట్లు అనిపించింది. "అన్నీ సవ్యంగా నడిచి అదృష్టం కలిసివస్తే వ్యాపారం లాభదాయకమే. కానీ నష్టం వస్తే మొదటికే మోసం కదుటే అమ్మాయ్" అన్నాను.

"వెనకటికి నీబోటిదే శుభం పలకరా మంకెన్నా అంటే ఏదో అందిట. పెద్దదానివి మేము వృద్ధిలోకి వస్తుంటే సంతోషించక అపశకునాలు పలుకుతావేం" అని రుసరుసలాడింది.

"కడుపున పుట్టిన బిడ్డవి నీ వృద్ధికాక నేను కోరుకునేది ఏముందే? కానీ కాస్త ముందూ వెనకా చూసుకోవాలా వద్దా? అయినా ఒకేసారి అన్ని వ్యాపారాలు మొదలు పెట్టడం నేనెక్కడా కనీవినీ ఎరగను. ఒకే వ్యాపారం ప్రారంభించి అది లాభసాటిగా వుంటే దాన్నే వృద్ధిచేసుకున్న వాళ్ళను చూశానుగానీ ఇట్లా అందులో ఒక కాలు, ఇందులో ఒక కాలు ఎక్కడా చూడలేదు. ఇంతకీ ఏం వ్యాపారాలు చేస్తున్నారు? " అని అడిగాను.

"ఏమిటో అవన్నీ నీకూ నాకూ అర్థం అవుతాయా? అన్నీ వాళ్ళే చూస్తున్నారు" అనేసింది తీరిగ్గా.

"పోనీ మీ ఆయనకైనా తెలుసా? " అంటే, "ఆయనకేం ఖర్మ? కాలిమీద కాలేసుకుని

"కూర్చుని లాభాలు అనుభవించడమే శ్రమంతా వాళ్ళదే" అంది.

వాళ్ళ వెర్రి బాగులతనానికి తలబాదుకో వాలనిపించింది నాకు.

నేను వాళ్ళని అనుమానిస్తున్నానని పసి గట్టి నా కూతుర్ని నామాట వినకుండా ఏదో నూరిపోశారు. దాంతో దానికి నేను విషమైపోయాను.

చూస్తూ వుండగానే పరిస్థితులు మారిపో యాయి.

సంపాదించాలంటే సంవత్సరాల తరబడి కష్టపడాలి గానీ ఖర్చు పెట్టడం ఎంతలో పని? కళ్ళు మూసి తెరిచేలోగా కొండల్ని కరిగించవచ్చు

ఇక్కడా అదే జరిగింది. అందినంత దొరకబుచ్చుకుని, తెలివిగా దోచుకోగలిగి నంత దోచుకుని చల్లగా జారుకోసాగారు అల్లుడి బంధువర్గం.

క్రమంగా నాకూతురి కళ్ళు తెరుచుకు న్నాయి. నా దగ్గిరకి వచ్చి భోరుమని ఏడి చింది. "అయినదానికి ఏడిచి ఏం ప్రయో జనం. ఇకనైనా కళ్ళు తెరిచి వున్నది నిల బెట్టుకో. అతడికి ఎదురు తిరిగైనా సరే వ్యవహారం చక్కదిద్దుకో" అని సలహా చెప్పాను.

అప్పటినుండి వ్యవహారం తన చేతుల్లోకి తీసుకుని భర్తని కట్టడిచేసింది. ఏమైనా అంటే తాడెత్తున లేచేది. చాదస్థం మొగుడు చెప్తే వినడు, కొడితే ఏడుస్తాడు అన్నట్లు మా అల్లుడితో గట్టి చిక్కు వచ్చిపడింది. అప్పటివరకు నీ అంతటివాడు లేడని పొగిడే జనాభా అంతా తరలిపోయారు. చీటికీ మాటికీ ఎదురు తిరిగే భార్య. ఈ పరిస్థితులను ఎదుర్కోలేక ఒకనాడు ఎవరికీ చెప్పాపెట్టకుండా ఇల్లొదిలి పోయాడు. ఏదో కోపంలో పోయాడు. తనే తిరిగొస్తాడు అని నాల్రోజులు వూరుకున్నాం. ఆ తరువాత బంధువుల ఇళ్ళలో వెతికించాం. ఏమైపో యాడో మనిషి జాడలేదు. ఓ ఏడాదిపాటు నానా తంటాలూ పడ్డాం.

అడుగో అక్కడ హాస్పిటల్లో పడి వున్నాడు.

ఇడుగో ఇక్కడ సన్యాసుల్లో కనిపించాడు.

అనే గాలి కబుర్లు విని అటూ ఇటూ పరుగులు పెట్టాం!

అంజనాలు వేయించాం.

ప్రశ్నలు అడిగించాం.

ఇక ఆ తరువాత విసుగేసి వూరు కున్నాం.

"అన్నీ సవ్యంగా వుంటేనే వూరుకోదు లోకం. ఇక ఏవైనా లోసుగులు వుంటే వూరుకుంటుందా!

అందరి నోళ్ళల్లోనూ ఇదేమాట.

పిలవకపోయినా వచ్చి సానుభూతి చూపించి పోవడం.

అవమానం తట్టుకోలేక నామీద విరుచు కుపడింది నా కూతురు.

"దీనికంతటికీ నువ్వేకారణం. 'ఎదురు తిరుగు, ఎదురు తిరుగు' అని చంపుకుతి న్నావ్! ఎదురుతిరిగితే ఏమైంది నా శార్ధం? నోరు మూసుకుని వూరుకుని వుంటే ఆస్థి పోయినా ఆయన ఇంట్లో వుండేవాడు. ఇప్పుడేమైంది? మొగుడు వుండీ లేని దాన్నైపోయాను. నలుగురిచేతా గయ్యాళీ, గడుసుపిండం అని నింద మోస్తున్నాను. అయినా నాకు తెలియక అడుగుతాను. ఎదుటివారికి సలహా చెప్పడం తేలిక కాబట్టి సలహాలిచ్చి నా కొంపకొసరు పెట్టావు. నువ్వేం తెలివిగా వ్యవహరించావు. బతికు న్నంతకాలం నాన్నకేనాడైనా ఎదురుచె ప్పావా? ఆయన మాటే చెల్లింది కానీ నీకేనాడైనా దమ్మిడీ విలువిచ్చారా? జీవితం అంతా భర్త కాలికింద చెప్పులా బతికి నలు గురిచేతా పరమ పతివ్రత, మహాసాధ్వి

అనిపించుకున్న దానివి నా విషయంలోనూ చూసీ చూడనట్లు వూరుకుంటే నా చావు నేను చచ్చి నా ఏడుపేదో నేనేడిచేదాన్నికదా! తగుదునమ్మా అని సలహాలిచ్చి నన్నీస్థితికి తెచ్చావు. ఇప్పుడు జీవితాంతం నీ జీవానికి పడి ఏడుస్తాను. చచ్చే ధైర్యంలేదు బతికే తీరూ తెలియదు. రెంటికీ చెడ్డ రేవడినైపోయాను. నా ఉసురు నీకు తగలకపోదు" అంటూ తిట్టిపోసింది.

"క్రమంగా నాతో మాట్లాడ్డం మానేసింది.

"దాని మాటల్లోనూ నిజం లేకపోలేదు. ఒక్కగానొక్క బిడ్డ. కళ్ళెదురుగా మోడులా తిరుగుతుంటే కడుపు మండిపోయేది. పశ్చాత్తాపం కలిగేది. అందుకే ఎవరినీ ఏమీ అనకూడదని, ఎవరికీ ఏ సలహా ఇవ్వకూడదని నాకు నేనే శిక్ష విధించుకుని ఇట్లా ఏకాంతవాసం చేస్తున్నాను. ఎందులోనూ జోక్యం కలిగించుకోకుండా ఒక మూలపడి వుండడం అలవాటు చేసుకున్నాను. నా అల్లుడి సవితి అక్కగారు అందరూ వెళ్ళిపోయినా వెళ్ళకుండా మా కొంపనే పట్టుకుని వేళ్ళాడింది. ఇంకే దిక్కూలేదు. ఇంత ముద్ద పడేయండి చాలు అని ఏడిచింది. ఆవిడే నా ఆలనా పాలనా చూసింది ఇంతకాలం. ఇప్పుడు నువ్వు. ఎన్నేళ్ళు గడిచిపోయాయో, ఇంకెంతకాలం గడవాలో? ఈ ఘటం దాటిపోయేలోగా ఇంకా ఏమేం చూడాలో? "

అంటూ తన జీవితానుభవాలను నాకు వివరించింది ఆ ముసలమ్మ. అంతా విన్న తరువాత మా అత్తగారిమీద జాలి కలిగింది. అయ్యోపాపం అనిపించింది. పాపం ఆడది. ఆవిడ కష్టాలు ఆవిడవి.

నిజానికి పై బట్టతోవచ్చి కష్టపడి బాగా సంపాదించి దర్జాగా అనుభవిస్తున్న వాళ్ళు ఎంతమంది లేరు?

ఆవిడకున్న ఆస్థికి ఏ సమర్ధుడైనా భర్తగా లభించివుంటే ఎంత వైభోగంగా వుండేదో ఆవిడ జీవితం. మేధకుడి పాల పడేసరికి అంతా అస్తవ్యస్థం అయిపోయింది.

నిజం తెలిసిన తరువాత మా అత్తగారి పట్ల సానుభూతిగా వ్యవహరించేదాన్ని నేను. ఆవిడ ఏం అన్నా పట్టించుకునేదాన్ని కాదు. మా ఆయనతో అంటీముట్టనట్లు వుండేదాన్ని. ఆయన ఏమైనా అడిగితే సమాధానం చెప్పేదాన్ని. లేదంటే లేదు.

అలా కొంతకాలం గడిచిపోయింది.

నాకు కూతురు పుట్టింది.

ఎంతో సంతోషం కలిగింది నాకు. నా కూతురిని కళ్ళల్లో పెట్టి పెంచుకుంటాను. ఆడ పీనుగ అని ఏనాడూ తిట్టను. దాని ఇష్టానుసారం పెంచి పెద్దచేసి మంచివాడికిచ్చి పెళ్ళిచేస్తాను. అనుకుని ఆనందపడిపోయాను.

మా అత్తగారు మాత్రం నానా రగడ చేసింది.

"ఉన్నవన్నీ చాలక ఇప్పుడిదొహర్తి పుట్టుకొచ్చింది. అసలే అప్పుల్లో పడి ఏడుస్తుంటే మెడకు ఇదో గుదిబండ. ఇదెప్పటికి పెరిగేను" అంటూ తిట్టిపోసింది.

మా ఆయన సరే దున్నపోతుమీద వర్షం కురిసినట్లు వూరుకున్నాడు.

నా సవితి కూతురికి పెళ్ళి సంబంధాలు చూడడం మొదలుపెట్టారు. ఒక సంబంధం కుదిరిపోయిందనే అనుకున్నాం గానీ వాళ్ళు అడిగినంత ఇవ్వలేను అని పుల్లపెట్టాడు నా భర్త.

కొడుకులిద్దరూ ఎదురుతిరిగారు.

"ఆ సంబంధానికి ఆ మాత్రం ఇవ్వలేమా? " అని అడిగారు.

నా దగ్గర అంతలేదు అంటాడు ఆయన.

పోనీ ఎంతుందో చెప్పమంటారు వాళ్ళు.

అది మీకనవసరం అంటాడు ఆయన.

"నాన్నా మీ అంతటివాళ్ళం మేమూ అయ్యాం. ఆస్థి ఎంత వుందో అప్పు ఎంత

వుందో ఒక్కసారి వివరంగా మాకు చెప్పండి. ఎంతవుందో, ఎంతపోయిందో అసలు మనం ఎక్కడ వున్నామో మాకూ తెలుస్తుంది. దానిని బట్టి నడుచుకుందాం" అంటారు వాళ్ళు.

"నేను బతికుండగా ఆస్థి వివరాలు ఇంకొకరితో చెప్పను" అంటాడు తండ్రి.

ఇద్దరికీ పెద్ద ఎత్తున ఘర్షణ జరిగింది.

ఎలాగో పీకల మీద కూర్చుని పెళ్ళికి ఒప్పించారు.

పెళ్ళి జరిగింది. తెల్లవారితే పదహార్రోజుల పండగ.

నా కూతురికి పదోనెల నడుస్తోంది. అన్నప్రాసన చెయ్యమని ఎన్నాళ్ళబట్టో పోరుతున్నా ఎవరూ పట్టించుకోలేదు. మరి ఏ కళన వుందో మా అత్తగారు అంగీకరించింది. రేపు పదహార్రోజుల పండగ. పరవాణ్ణం ఎలాగూ వండుతాం పనిలోపని కానిచ్చేద్దాం అంది. సరే అన్నాను. అంత కంటే ఆర్భాటంగా చెయ్యడానికి అవకాశం ఏది?

తెల్లవారింది. పురోహితుడు వస్తాడు అని నేను స్నానం చేసి, పిల్లకి తలంటి పోస్తుండగా ఇంట్లోంచి పెద్దగా కేకలు వినిపించాయి.

తండ్రీ కొడుకులు మళ్ళీ గొడవ పడుతున్నారేమో అనుకున్నాను.

పిల్లకి నీళ్ళుపోసి, భుజాన వేసుకుని లోపలికి వచ్చేసరికి అంతా హడావిడిగా వుంది.

నట్టింట్లో అడ్డంగా పడిఉన్నాడు నా భర్త. నీళ్ళల్లో ముంచి తీసినట్లు చమటలు.

అందరూ పరుగులు పెడుతున్నారు. ఊళ్ళోని ఆయుర్వేద వైద్యుడు వచ్చాడు. నాడిచూసి పెదవి విరిచాడు. అంతా ఘొల్లుమన్నారు. మధ్యాహ్నానికల్లా రావలసిన బంధువులంతా వచ్చి చేరారు. సాయంత్రానికి అంతా ముగించేశారు.

నేను ఒకమూల గదిలో కూర్చున్నాను.

జరిగినదానికి ఏడవాలో అఖ్ఖర్లేదో అర్థం కాలేదు నాకు.

ఎవరెవరో వస్తున్నారు. మా అత్తగారు శోకాలు పెట్టి ఏడుస్తోంది. శని మొహంది అంటూ నన్నూ, నా కూతుర్ని దుమ్మెత్తి పోస్తోంది. కొంతమంది నా దగ్గరికీ వచ్చి పరామర్శ చేసిపోతున్నారు. గదిలో తల కింద చెయ్యి పెట్టుకుని పడుకున్నాను. ఎవరైనా వస్తే లేచి కూర్చుని వెళ్ళగానే మళ్ళీ పడుకుంటున్నాను. బాగా చీకటి పడిన తరువాత ఎవరో ఒకావిడ లోపలికి వచ్చింది.

ఎవరో వచ్చారని లేచి కూర్చున్నాను. దగ్గరికి వచ్చాక గానీ గుర్తుపట్టలేకపోయాను.

మా అమ్మ!

నా పెళ్ళయ్యాక ఆవిడని అదే చూడడం. బాగా పాడైపోయి డొక్కులా తయారైంది. నన్ను కావిలించుకుని బావురుమని ఏడిచింది.

నాకు మాత్రం ఏడుపురాలేదు.

ఆ రాత్రంతా ఏవో కబుర్లు చెప్తూనే వుంది. ఇంకో చెల్లెలికి పెళ్ళి చేసిందిట. అతను దాన్ని వదిలేశాడుట. నా తర్వాత వాళ్ళిద్దరికీ పెళ్ళిళ్ళు కాలేదట. ఆఖరుదానికి సినిమాల పిచ్చి ఎక్కువట. ఆర్నెల్లక్రితం ఎక్కడికో పోయిందట. తిరిగి రాలేదుట. తను ఎవరింట్లోనో వంట చేస్తోందిట.

ఏమిటేమిటో చెప్తూనే వుంది. అవన్నీ సగంసగం నిద్రపోతూ విన్నాను.

"ఏమిటోనే అమ్మాయ్ అందరూ సలహా చెప్పేవారు, 'నీకేం చెట్టంత కూతురుంది. పెద్ద జమీందారు భార్య. దాన్ని ఆశ్రయించరాదా' అనేవారు. నాకే మొహమాటం వేసి పూరుకున్నాను. మొహమాటం మాట అలా వుంచి అక్కడినించి ఇక్కడికి రావాలంటే మాటలా? చార్జీలు పెట్టుకోవద్దూ.

అదుంటే ఓ పూటగ్రాసం. ఉత్తరం రాయాలంటే నాకు రాయటమూ రాదు. నీకు చదవడమూ రాదు. రావాలి... రావాలి అనుకుంటూనే వుండగా చివరికి ఇదుగో ఇలా రావాల్సి వచ్చింది" అంటూ ఏడిచింది.

కళ్ళు తుడుచుకుని "అమ్మాయ్ ఆయన పోయాడాయెను. ఇక వాటాలు పంచుతారుగా. నీ వాటా నువ్వు తీసుకుని నాతో వచ్చెయ్. అందరం ఒకేచోట పడుందాం. ఇంకా ఇక్కడవుండి వాళ్ళకీ వీళ్ళకీ చాకిరీ చేస్తూ నలిగిపోయేకంటే ఆ పిల్లవెధవల్ని చేత బుచ్చుకుని పోవడం ఉత్తమం. పెద్దదాన్ని ముందుగానే చెప్తున్నాను. నీ మనసులో పెట్టుకో. ఆనక అందర్లో చెప్తే బాగుండదు" అంది గుసగుసగా.

విని వూరుకున్నాను.

అమ్మ మాత్రమే కాదు. ఆస్థికోసం ముందు జాగ్రత్తకోసం చాలామందే వచ్చారు.

నా కొడుకుల అత్తవారు, కూతుళ్ళ అత్తవారు, ఇంకా శేషారత్నం వంటివారి ఆప్తులు చాలామందే పోగయ్యారు. ఇదంతా నాతో రంగనాయకమ్మ చెప్పేది.

పదోరోజు దాటింది. కర్మకాండలు ముగిశాయి. తల వెంట్రుకల జోలికి పోలేదు గానీ జాకెట్టు మాత్రం వేసుకోవద్దని శాసించారు.

ఆ మర్నాటినుంచి మొదలయింది హడావుడి.

అప్పులవాళ్ళు చీమల పుట్టలోంచి చీమలు వచ్చినట్లు ప్రామిసరీ నోట్లు పట్టుకుని రాసాగారు. ఎక్కడ చూసినా అప్పులేనట.

చిన్నా చితకా కొన్ని, పెద్దవీ పీకలదాకా మునిగిపోయినవి కొన్ని.

ఇదంతా చూసి ఆడపిల్లలకి ఏమి పెడతారని కూతుళ్ళ అత్తవారి గొడవ.

వాటాలు ఖచ్చితంగా వెయ్యాలని కొడుకుల అత్తవారి గోల.

పెద్దభార్య పిల్లలకి సగం వాటా, రెండో భార్య పిల్లలకి సగం వాటా రావాలని శ్రేయోభిలాషుల తీర్పు.

అంతా తిరణాల లాగా తయారయింది.

అంతా అయోమయం, గందరగోళం.

ఆస్థి ఎంత వుందో మాత్రం ఎవరికీ తెలియదు.

అప్పులెన్ని వున్నాయో అంతకంటే తెలియదు.

పన్నెండో రోజున పెద్ద పంచాయితీ జరిగింది. అప్పులన్నీ తీరితే సంసారం రోడ్డున పడాల్సిన పరిస్థితి వస్తుందని తేల్చారు. మా అత్తగారు కొడుకుపోయిన నాటికంటే ఎక్కువగా దొర్లిదొర్లి ఏడ్చింది. కొంతమటుకు ఆస్థి తెగనమ్మి, కొన్ని అప్పులు తీర్చి మిగిలినవి నిదానంగా తీర్చేట్లు తీర్మానం అయింది.

అందరూ ఎవరి దారిన వాళ్ళు వెళ్ళారు. వెళ్ళేముందు ఒకటికి పదిసార్లు సలహాలు చెప్పి వెళ్ళారు.

ఆరోజు రాత్రి మజ్జిగ అన్నం కలిపి తీసుకొచ్చి ఏనాడూ లేనంత ఆప్యాయంగా తినిపించింది అమ్మ.

నన్ను పసిబిడ్డలా ఒళ్ళో పడుకోబెట్టుకుంది. "ఎవరో చెప్పినమాటలు నమ్మి నీ గొంతుకోశానే. తీరా చూస్తే 'ఈదబోతే తాగ నీళ్ళు లేవు' అన్నట్లు వుంది ఈ ఆస్థి వ్యవహారం. ఎట్లా వెళ్తుందో నీ జీవితం? నీకు సాయం ఆ పసిబిడ్డలు. ఆ భగవంతుడే దారి చూపించాలి" అంటూ కుళ్ళికుళ్ళి ఏడ్చింది. వెళ్ళలేక వెళ్ళలేక వదిలిపెట్టి వెళ్ళింది. బహుశా నా వాటా కొంతయినా ఇస్తే ఆవిడ తనతోపాటు నన్ను తీసుకెళ్ళేదేమో!

బయట వాళ్ళందరూ వెళ్ళిపోయాక ఇంట్లో వాళ్ళం మాత్రం మిగిలాం.



ఆడపిల్లలు నెలమాసికం వెళ్ళేదాకా వుండాలని వుండిపోయారు. మాసికంనాడు క్రతువు పూర్తయింది.

భోక్తలు భోజనం చేశాక ఇంట్లోని మగవా రంతా కూర్చున్నారు భోజనాలకి. రంగనా యకమ్మకి ఆరోగ్యం అంతగా బాగుండక పోవడంవల్ల పని చాలావరకూ నా నెత్తినే పడింది.

రోహిణీకార్తె.

సెగలు గక్కుతున్న అన్నం పళ్ళెం.

వంగి వడ్డించడం.

ఎంత జాగ్రత్తగా వున్నా పైట తొలగనే తొలిగింది.

ఇంకేముంది విరుచుకుపడింది మా అత్త గారు. వంటింట్లోకి తీసుకెళ్ళి నానాతిట్లూ తిట్టింది. సిగ్గూ ఎగ్గూ లేనిదానివని నిందిం చింది. మొగుడుపోయి నెల తిరక్కుండానే కొడుకులూ, అల్లుళ్ళూ అనే వావివరసలు మర్చిపోయి బోగంవేషాలు వేస్తున్నావని ఆడిపోసుకుంది.

భూమి చీలిపోయి అందులోకి కూరుకు పోతే బాగుండుననిపించింది నాకు.

తొలిసారి జీవితం మీద విరక్తి కలిగింది. చచ్చిపోవాలని గట్టి నిర్ణయం తీసుకున్నాను.

అప్పుడు నా వయసు ఇరవైఏళ్ళు.

రాత్రి అందరూ నిద్రపోయాక పిల్లకు కడుపునిండా పాలిచ్చి మెల్లిగా తలుపు తీసు కుని బయటికి వచ్చాను.

బావిగట్టున నిలబడి ప్రశాంతంగా ప్రాణాలు పోయేలా అనుగ్రహించమని భగ వంతుడిని వేడుకున్నాను.

ముందుకి అడుగెయ్యబోతుండగా చెయ్యి పట్టుకుని వెనక్కి గుంజారెవరో!

తల తిప్పి చూశాను.

నా పెద్దకొడుకు.

నిలువెల్లా వణికిపోయాను.

"ఏవిటీ పని?" అన్నాడు కర్కశంగా.

అతని కాళ్ళమీద పడిపోయాను.

నన్ను చచ్చిపోనివ్వమని ప్రార్థించాను.

నన్ను లేవనెత్తాడు. భుజం చుట్టూ చెయ్యివేసి ఇంట్లోకి తీసుకెళ్ళాడు.

హాల్లో నన్ను కూర్చోబెట్టి అందర్నీ పిల్చు కొచ్చాడు.

జరిగినది అందరికీ చెప్పాడు.

అందరూ నావంక చూస్తుంటే నిలువెల్లా వణికిపోతూ కూర్చున్నాను.

"ఇట్లా ఎందుకు జరిగింది? ఆవిడని ఎవరు ఏమన్నారు?" అని నిలదీశాడు.

"ఏమో ఎవరేం అంటారు? పోయేకాలం వచ్చి దూకబోయిందేమో. మొగుడు పోయా డుగా విరక్తి చెంది వుంటుంది" అంది మా అత్తగారు.

"కాదు. అలా అయితే నాన్నపోయిన రోజునే దూకేది. ఇన్నాళ్ళూ వూరుకుని ఇపు డెందుకు దూకుతుంది? ఏదో జరిగింది చెప్పండి" అన్నాడు.

అడగ్గా అడగ్గా చిన్నకూతురు జరిగింది చెప్పేసింది.

ఉగ్రరూపం దాల్చాడు అతను.

అత్తగార్ని తిట్టిపోశాడు.

"పన్లోపనిగా చెప్తున్నాను. ఈ ఇంట్లో పరి స్థితి అస్తవ్యస్తంగా తయారైంది. ఇంటి పరువు నిలబడి మనమూ మనుషుల్లా బత కాలంటే ఈ పరిస్థితిని సరిదిద్దవలసిన ఆవ శ్యకత ఎంతైనా వుంది. ఇకనుండి ఇంటి పెద్దకొడుకుగా ఈ ఇంటి బాధ్యతల్నీ, అధి కారాల్నీ నేను తీసుకుంటున్నాను. ఇహ నా మాటే వేదవాక్కు. నా మాటకి ఎదురు చెప్తే సహించను" అంటూ అందరికీ చెప్పే శాడు.

మరునాడు నుండి నేను జాకెట్టు వేసుకు నేందుకు అనుమతించారు.

ఆ తండ్రికి కొడుకుగా ఎట్లాపుట్టాడో గానీ, మా పెద్దబ్బాయి కడు సమర్థుడు. ముందు చూపు గలవాడు. అతని చేతికి పెత్తనం రాగానే మా ఇంట్లో చాలా మార్పులు వచ్చాయి. మా ఇల్లు అమ్మేశాడు. పొలంద గ్గర వున్న మరో చిన్న ఇంటికి మారాం.

చాలావరకు అప్పులు తీర్చేశాడు. అనవస రమైన హంగులన్నీ తీసి పారేశాడు.

రంగనాయకమ్మని మర్యాదగా పంపిం చేసి, ఆడవాళ్లని వంటింట్లో పనిచెయ్యమ న్నాడు.

తనూ, తమ్ముడూ ఉద్యోగాలు మానేసి స్వంతంగా వ్యవసాయం ప్రారంభించారు.

రెండేళ్ళు తిరిగేసరికి మా ఇంటి పరిస్థితి చాలా మెరుగుపడింది. అప్పులు అన్నీ తీర్చేసి మిగిలిన ఆస్తి వాటాలు పంచారు.

నా వాటా నాకొచ్చింది.

"మీ పుట్టింటికి వెళ్తావా పిన్నీ? వెళ్ళాలని వుంటే వెళ్ళు. పొలం అమ్మి డబ్బు చేతికి స్తాను" అన్నాడు.

నేనూ ఆలోచించాను. అక్కడికి వెళ్ళినా ఒరిగిపడేది ఏముంది? పైగా మగ దిక్కు లేని సంసారం. ఇక్కడే వుంటే ఈ కొడుకు చేతికింద వుండొచ్చు ఈలోగా నా కన్నకొ డుకు అందివస్తాడు.

ఆ మాటే చెప్పాను.

సరే అయితే అన్నాడు.

ఆ ఏడాదే మా అత్తగారి తల్లి పోయింది.

పోతూ పోతూ తన మెళ్ళోని రెండు పేటల గొలుసూ, రెండు జతల గాజులూ నాకిచ్చింది. వద్దని వారించినా విన్లేదు. పెళ్ళి కావలసిన ఆడపిల్ల వుంది. దానికి ఇద్దువుగాని వుండనీ అని చెప్పింది.

ఆవిడ పోయాక నాకు ఎంతో వెలితిగా అనిపించేది.

మా అత్తగారు కూడా స్తబ్దుగా తయార యింది. అదివరకటి అథార్టీ పూర్తిగా తగ్గి పోయింది.

ఆ ఏడాదే మా పెద్దబ్బాయి ఒక ఏర్పాటు చేశాడు. పిల్లలంతా చదువులకి వచ్చారు. అందరూ పక్కనున్న బస్తీకి వెళ్ళి చదువుకో వాలంటే మాటలు కాదు, అని అక్కడ ఒక ఇల్లు తీసుకుని పిల్లలని చదువుకి పెట్టాడు.

నన్ను వాళ్ళకి వండిపెడుతూ అక్కడ వుండమన్నాడు.

పాలు, పెరుగు తప్పించి సమస్తం పల్లె నుండి పంపించేవాడు.

పెద్దకొడుకు పిల్లలు ఇద్దరు, చిన్నకొడుకు పిల్లలు ముగ్గురు, నా పిల్లలు ఇద్దరు.

పనికి ఓ మనిషిని పెట్టుకుని కాలక్షేపం చెయ్యసాగాను.

నాయనమ్మా అని పిలిచే మనవలు, అమ్మా అని పిలిచే పిల్లల్తో గలగల్లాడుతూ నందగోకులంలా వుండేది ఇల్లు.

పెద్దవాళ్ళకు మల్లే కుళ్ళూ కుచ్చితం లేని పిల్లలకు ఎంత చేసినా బాధ అనిపించేది కాదు. బాగానే కాలక్షేపం అయిపోయేది.

వారంవారం ఎవరో ఒక కొడుకు వచ్చే వాడు. మంచీ చెడ్డా చూసి వెళ్ళేవాళ్ళు. పండగలకీ, పర్వదినాలకీ పల్లెటూరికి వెళ్ళే దాన్ని పిల్లల్ని వెంటబెట్టుకుని. అలా చాలా కాలం గడిచిపోయింది.

మా అత్తగారు పోయింది.

పోయేముందు ఆరేడునెలలు మంచంలో వుంది. నేనే వెళ్ళి సేవచేశాను. మాట కూడా పడిపోయింది. నావంక దీనంగా చూసి కళ్ళనీళ్ళు పెట్టుకునేది. ఏ మాటో చెప్పాలని వృథాప్రయాస పడేది.

ఆ స్థితిలో ఆవిడని చూస్తే జాలివేసేది. ఎన్ని అనుకున్నా సాటి ఆడది. పుట్టినదా దిగా నానా అగచాట్లూ పడింది.

కడుపులోని మంట ఎవరో ఒకరిమీద చూపించాలిగా. నేను లోకువగా వున్నాను

కాబట్టి నామీద చూపించింది ఆ కసి అంతా.

అలా కాకుండా ఆవిడ జీవితం సవ్యంగా సాగిపోయి వుంటే నన్ను ఆదరంగా చూసుకునేదేమో!

ఆవిడ పోయాక కర్మకాండలు ముగించాక మళ్ళీ బస్తీకి వచ్చేశాను.

పిల్లలూ... చదువులూ.

అదృష్టవశాత్తూ నా పిల్లలు ఇద్దరూ మెరికల్లాంటివాళ్ళు. ప్రతి ఏడూ మంచి మార్కులతో పాసయ్యేవాళ్ళు.

నా కూతురు మరీ తెలివిగలది. చదువుతోపాటు సంగీతం కూడా నేర్పించాను. చక్కగా పాడేది. పిల్ల కూడా చూడచక్కగా వుండేది. దాన్ని బాగా చదివించి పెద్ద ఉద్యోగస్థురాలిని చెయ్యాలనుకున్నాను.

పి.యు.సి. పాసయ్యింది.

హఠాత్తుగా "పెళ్ళి ప్రయత్నాలు మొదలుపెడదాం" అన్నాడు నా పెద్దకొడుకు.

గతుక్కుమన్నాను.

"అప్పుడే ఏం తొందర? ఇంకా చిన్నపిల్లేగా? మరి కొన్నాళ్ళు చదువుకోనీ. బి.ఏ. పాసయ్యాక చేద్దాం" అన్నాను.

"ఎందుకు పిన్నీ ఇంకా చదువులు. దీన్ని చదివించగానే అయిందా. బి.ఏ. చదివితే ఎమ్.ఏ. వాడిని తేవద్దూ? ఎక్కడినించి తెస్తాం? వయసెంత? పదిహేడు వెళ్ళాయిగా. అదీగాక ఈ ఏడాది పంటలు బాగా పండాయి. చేతిలో నాలుగు డబ్బులు ఆడుతున్నాయి. ఈమాత్రం డబ్బు కళ్ళచూసి మూడేళ్ళు అయింది. ఈ ఏడాదే ఆ శుభకార్యం కానిచ్చేస్తే మంచిదని నా అభిప్రాయం. నువ్వూ ఆలోచించి చూడు. నువ్వు సరేనంటే మంచి సంబంధం వుంది. వెళ్ళి మాట్లాడతాను" అన్నాడు.

ఎన్నో విధాలుగా ఆలోచించాను. నిజానికి అంత అర్థాంతరంగా పెళ్ళిచేసి పంపించడం నాకు ఎంతమాత్రమూ ఇష్టంలేదు. కానీ పరిస్థితులను బట్టి ఆలోచిస్తే చేసెయ్యడమే మంచిదేమో అనిపించింది.

ఇప్పుడు కాదంటే వాళ్ళు మనసు కష్టపెట్టుకుంటే రేపు నేను కావాలనుకున్నప్పుడు సంబంధాలు ఎవరు వెతుకుతారు?

ఆడదాన్ని వంటరిగా నేనేం చెయ్యగలను?

నా కొడుకున్నాడంటే ఇంకా లోకజ్ఞానం తెలియనివాడు.

సవితి కొడుకు అయినా తన పిల్లలూ, బాధ్యతలూ తనకు వున్నా పాపం చెల్లెలి కోసం ఆరాటపడుతున్నప్పుడు కాదనడం తెలివితక్కువ.

అన్నీ ఆలోచించి నా అంగీకారం తెలియచేశాను.

తనకు పెళ్లి ప్రయత్నాలు చేస్తున్నారని తెలిసి నా కూతురు ఏడ్చింది.

ఇప్పటినుంచే నాకా బాదరబందీ వద్దు. లక్షణంగా చదువుకుంటాను అని గొడవ పెట్టింది.

దానికి నచ్చచెప్పాను. "చదువుకేం? పెళ్లయ్యాక అయినా చదువుకోవచ్చు ఇది మంచి సంబంధం. వదులుకుంటే ఆనక పశ్చాత్తాపపడాలి" అన్నాను.

అంతా మేము తాపత్రయపడ్డాంగానీ తీరా వాళ్ళకు పిల్ల నచ్చలేదట.

హతాశురాలినయ్యాను.

నా కళ్ళకి బంగారం బొమ్మలా వున్న పిల్లలో వాళ్లకి మరేం వంక కనిపించిందో?!

"పోనీలే పిన్నీ, ఇది కాకపోతే ఇంకొకటి. మా వీరభద్రం మామయ్య ఏదో సంబంధం వుందని చెప్పాడు. అది కనుక్కుంటాను" అన్నాడు మా పెద్దకొడుకు.




అలా వీరభద్రం మామయ్య చెప్పిందీ, ఇంకా రామభద్రం బాబాయి చెప్పిందీ వర సన నాలుగైదు సంబంధాలు చూశారు.

ఏదీ కలిసిరాలేదు.

నాకు భయం వేసింది.

ఇప్పుడే పెళ్ళొద్దు అనుకున్న నేనే పెళ్ళ యితే చాలు భగవంతుడా అనే స్థితికి దిగ జారిపోయాను.

శనివారాలు, గురువారాలు ఉపవాసాలు మొదలుపెట్టాను. మొక్కులు మొక్కాను, ముడుపులు కట్టాను.

ఎలాగైతేనేం నా కూతురుకి సంబంధం కుదిరింది ఏడాది తర్వాత.

చేతిలో డబ్బులున్నాయికదా పెళ్ళి చేసేద్దాం అనుకుని రంగంలోకి దిగిన మా అబ్బాయికి తీరా పెళ్ళి కుదిరేసరికి పంటలు పండక చేతికి డబ్బు అందక కటకట అయింది.

అయినా అతను వెనక్కి తియ్యలేదు.

"అప్పో సప్పో చేసి శుభకార్యం జరిపిం చేద్దాం పిన్నీ" అన్నాడు.

ముహూర్తాలు పెట్టారు. అబ్బాయి హుందాగా అందంగా వున్నాడు.

దూరంగా ఒక ఊర్లో గవర్నమెంట్ ఉద్యోగం. ఇద్దరన్నదమ్ములు. ముగ్గురు ఆడపిల్లలు. అందరికీ పెళ్ళిళ్ళయ్యాయి. ఇతడే ఆఖరువాడు.

"స్వంత ఇల్లుంది. రాజాలాంటి సంబంధం" అన్నారు అందరూ.

అమ్మాయి పెళ్ళి అయింది. పెద్దకొడుకూ, కోడలూ పీటలమీద కూర్చున్నారు. దూరంగా ఒక మూల కూర్చుని చూశాను నేను. ఎంత వద్దనుకున్నా చేతులారా బిడ్డ పెళ్ళి చేసుకోలేని నా దురదృష్టానికి దుఃఖం వచ్చింది.

నా పెద్దకూతురు నన్ను ఓదార్చింది.

ఏవో చిన్నా చితకా పేచీలు అలకలు తప్పించి పెళ్ళి బాగానే అయింది.

"అబ్బాయి అక్కడ వంటరిగా వున్నాడు, భోజనానికి ఇబ్బంది. వెంటనే కాపురానికి తీసుకువెళ్తాడు" అన్నారు.

వున్నంతలో ఏలోటూ లేకుండా సారే, చీరా అమర్చాడు నా పెద్దకొడుకు.

అంతవరకూ ఒక్కపూట కూడా వదలని నా కూతుర్ని అంతదూరం పంపిస్తూ వుంటే నా గుండె చెరువయిపోయింది. లక్ష జాగ్ర త్తలు చెప్పి సాగనంపాను.

అక్కడికి వెళ్ళాక ఉత్తరం రాసింది. గవ ర్నమెంట్ వారే ఇల్లు ఇచ్చారనీ అన్నీ నేర్చు కుంటున్నాననీ రాసింది. సమాధానం రాద్దా మంటే నాకు చదువురాదు. నా కొడుకు చేత రాయించేదాన్ని.

కాపరానికి వెళ్ళిన దాదాపు ఆర్నెల్ల తర్వాత పండగకి వచ్చారు భార్యా భర్తా.

సమయం చూసుకొని, "ఎలా వుందే అమ్మాయ్ నీ సంసారం?" అని అడిగాను.

"బాగానే వుందిగానీ ఆయనకి కోపం ఎక్కువే. తను చెప్పింది కాదంటే వూరికే నోరు పారేసుకుంటారు" అంది మెల్లిగా.

"మగవాడన్నాక ఆమాత్రం కోపం చిరాకు సహజమేలే. బయట ఉద్యోగం. సవాలక్ష చిరాకులు. ఆ చిరాకంతా ఇంట్లో చూపించా ల్సిందే కదా! ఇంకా నయమేలే వంటరి సంసారం కాబట్టి బాదరబందీలేదు. ఓ మాట అనుకున్నా గుట్టుగానే వుంటుంది. మీ అత్తగారూ వాళ్ళెలా వుంటారు" అని అడిగాను.

"బాగానే వుంటారు. తరుచూ వాళ్ళు రావడమో మేం వెళ్ళటమో జరుగుతూనే వుంటుంది వాళ్ళిక్కడికి వచ్చినా, నేనక్కడికి వెళ్ళినా పనంతా నా నెత్తినే. వాళ్ళేం చెయ్యరు"

"అది సహజమేనే అమ్మాయ్. కోడలొచ్చాక అత్తగారు విశ్రాంతి తీసుకోవాలనుకుంటుంది. ఇక ఆడపడుచు అంటావా పుట్టింటికి వచ్చిన ఆడపిల్లలు. నీకు పని తప్పదు మరి" అన్నాను.

"వంటపనే అయితే ఎలాగో చేసేస్తాను. కానీ వాళ్ళు తిన్న కంచాలవీ ఎత్తి ఎంగిళ్ళు ముట్టుకోవాలంటే అసహ్యం వేస్తుందే అమ్మా. మామిడిపళ్ళ కాలం వచ్చిందంటే కంచాలచుట్టూ ఈ ఎత్తున పోసి లేచి చక్కాపోతారు. అవన్నీ ఎత్తి శుభ్రం చెయ్యాలంటే డోకొస్తుంది. అయినా ఇదేం పద్ధతే అమ్మా. మొగుడికి సేవ చెయ్యాలి సరే. ఆయన్తోపాటు వాళ్ళ వాళ్ళందరికీ చెయ్యాలా? ఇంతకాలం ముక్కూ, మొహం తెలియనివాళ్ళకి ఇటువంటి చీదరపన్లు చెయ్యాలంటే రోతగా వుండదూ!

"ఎవరు పెట్టారమ్మా ఈ పద్ధతి? " అంది ఉక్రోషంగా ముక్కులెగబీలుస్తూ

నవ్వొచ్చింది నాకు.

"అడక్క అడక్క నన్నే అడిగావా తల్లీ! నేనే దొరికానా నీకు సమాధానం చెప్పడానికి" అన్నాను.

అదీ నవ్వేసింది.

ఆ తర్వాత కూడా చాలాసేపు ఆలోచించాను.

నేనూ అత్తవారింటికి వచ్చినది మొదలు అందరికీ అన్ని రకాల చాకిరీలు చేశాను. అటు వృద్ధులు, ఇటు పసిపిల్లలు ఎన్ని ఉతుకుస్తాలు పడితే రోజులు వెళ్లాయి. కానీ ఏనాడూ వాళ్లందరికీ ఎందుకు చెయ్యాలి అని అనుకోలేదు. ఏమిటో గుడ్డెద్దు చేలో పడినట్లు చేసుకుపోయాను.

ఇంతకాలం గడిచాక నా కూతురు అట్లా మాట్లాడితే అప్పుడు బుర్ర పనిచేసింది నాకు. అయ్యో అందరికీ అటువంటి చాకిరీ చేశానే అని బాధ కలిగింది. రాత్రంతా నిద్ర పట్టనేలేదు.

కాలం గడిచిపోతూనే వుంది. నా కూతురు ఇద్దరు బిడ్డల తల్లి అయింది. కొడుకు బ్యాంకులో ఉద్యోగంలో చేరాడు. కొండెక్కినంత సంబరపడిపోయాడు నా పెద్ద కొడుకు.

"ఇక వాడి జీవితానికి ఢోకాలేదు పిన్నీ. నీకు మంచి రోజులు వచ్చాయి. కొడుకు చేతికందివచ్చాడు" అన్నాడు.

"ఏరా మంచి సంబంధం చూసి పెళ్లి కూడా చేసెయ్యమంటావా" అని తమ్ముడిని అడిగాడు.

"ఇప్పుడే అలాటిదేమీ వద్దు అన్నయ్యా. ట్రైనింగూ అవీ అయి ఉద్యోగంలో సెటిల్ అవడానికే కొంతకాలం పడుతుంది. ఆ తర్వాత పరీక్షలు రాసి ఆఫీసర్ని అవ్వాలని నా కోరిక. అవన్నీ అయేదాకా పెళ్లి మాట తలపెట్టను" అన్నాడు.

ట్రైనింగు అంటూ అటూఇటూ తిప్పి చివరికి ఒక ఊళ్లో వేశారు. అదో శుద్ధ పల్లెటూరు. భోజన వసతిలేదు. ఇల్లు చూసుకుని అమ్మని నాతో తీసికెళ్తాను అని ఉత్తరం రాశాడు.

వారం తిరక్కుండానే ఇల్లు దొరికిందనీ ఫలానా రోజున వస్తున్నాననీ తెలియజేశాడు.

నా పెద్దకోడలు ఇద్దరికీ సరిపడా పాత్ర సామాన్లు, పక్క బట్టలు వగైరాలు అన్నీ సర్దించింది. తెల్లవారితే పిల్లవాడు వస్తాడనగా పన్లన్నీ ముగించి వంటిల్లు చక్కబెట్టి మంచంమీద నడుం వాల్చాను.

"పడుకున్నావా పిన్నీ" అంటూ వచ్చాడు పెద్దకొడుకు.

వెంట కోడలు కూడా వుంది. వచ్చి




మంచం పక్కనే పెట్టెమీద కూర్చున్నాడు.

ఏదో అవసరం పడినప్పుడు మాట మాట్లాడుకోవడం తప్ప ఇలా దగ్గర కూర్చుని ఏనాడూ మాట్లాడలేదతను.

"పిన్నీ ఇంక రెండ్రోజుల్లో నువ్వు వెళ్లిపోతావు. నీతో కొంచెం మాట్లాడాలి. అవడానికి తల్లివరసే అయినా నా మూడో చెల్లెలి వయసు నీకు. అసలప్పుడు నాన్న నిన్ను పెళ్లి చేసుకోవడం ససేమిరా ఇష్టం లేదు మాకెవ్వరికీ. మేం చెప్తే ఎవరూ విన్లేదు. నిన్ను చూసినప్పుడు బాధ వేసేది నాకు. ఒక్కనాడూ సుఖపడిన పాపాన పోలేదు" అన్నాడు ఆప్యాయంగా.

పుట్టి బుద్ధి తెలిశాక ఆమాత్రం ఆదరణకి నోచుకోని నాకు బాధ, ఆనందం ఏకకాలంలో కలిగాయి.

"ఇంటి పరిస్థితులూ అలానే ఏడిశాయి. పెద్ద కొడుకుగా నేనూ ఏమీ చెయ్యలేకపోయాను" అన్నాడు.

"అదేం మాట నాయనా! చావబోతున్న నన్ను ఆపి బతికేలా చేశావు. నత్తానావాలా వున్న నా పిల్లలని తండ్రిలా పెంచి పెద్ద చేసి వాళ్ల మంచీ చెడ్డా చూశావు. సవితి కొడుకువి అయినా కన్న బిడ్డకంటే ఎక్కువగా ఆదరించావు. నీమాత్రం నా కన్నకొడుకు కనిపెట్టి వుంటే నా జన్మ ధన్యం. అయినా నేనేదో శాశ్వతంగా వెళ్లిపోతున్నట్లు అనుకోవద్దు. ఏదో అక్కడ పిల్లాడు అవస్థ పడుతున్నాడని వెళ్తున్నానుగానీ ఎల్లకాలం అక్కడే వుంటానా? వాడికి పెళ్లి కాగానే మళ్లీ వస్తాను. ఏదో ఈ జీవితం మీ నీడన వెళ్లిపోవాలి" అన్నాను.

ఆ మాటకి నవ్వాడు పెద్దబ్బాయి.

"నాకంటే చిన్నదానివి నా చేతుల్లో వెళ్లిపోతావా? నాకూ వయసు మీద పడుతోంది. నేనే పిల్లల మీద ఆధారపడే రోజులు వస్తున్నాయి. పిల్లలు పెద్దవాళ్లయ్యాక వాళ్ల అండన పడుండడం అన్ని విధాలా మంచిది. ఇక రాకపోకలంటావా నువ్వూ ఇక్కడికి రావచ్చు, నేనూ అక్కడికి రావచ్చు

"ఇకపోతే మనకున్న ఆస్తిపాస్తులేమిటో నీకూ తెలుసు. నీ వాటాకి చెల్లెలి పెళ్లి, పురుళ్లూ, తమ్ముడి చదువూ అన్నీ పోగా ఎకరం పొలం మిగిలింది. దాన్ని వాడి పిత్రార్జితంగా అట్లాగే వుండనీ. ఈ డబ్బులోనే అప్పుడో అయిదూ ఇప్పుడో మూడూ అన్నట్లు వెనకేసి వుంచాను. అదో మూడు వేలు వుంది. ఆ డబ్బు నీకిస్తాను. దాచుకో అవసరానికి వాడుకో" అన్నాడు.

తెల్లబోయాను నేను. "ఏనాడూ డబ్బు మొహం చూసి ఎరగని నేను ఏం చేసుకుంటాను నాయనా! నీ దగ్గరే వుండనీ అవసరం అయితే నిన్నే అడుగుతాను" అన్నాను.

"అట్లాకాదులే పిన్నీ! నీ దగ్గరే వుండనీ. ఏ రోజు ఎట్లా వుంటుందో నీకు రావలసింది నీకు ఇచ్చేస్తే నాకు నిశ్చింత" అన్నాడు.

కోడలు కల్పించుకుని సలహా చెప్పింది.

"డబ్బుగా వుంటే వూరికే ఖర్చయిపోతుంది. దాని బదులు బంగారంలా మారిస్తే అనుభవించినట్లూ అవుతుంది, అవసరం అయితే ఆ బంగారమే ఆదుకుంటుంది" అంది.

ఆ సలహా మా ఇద్దరికీ నచ్చింది.

మర్నాడు నా కొడుకు రాగానే వాడితోనూ ఓ ముక్క చెప్పి బంగారం కొనుక్కొచ్చారు.

పెళ్లిలో పెట్టిన బంగారం శేషారత్నం పాలైపోయిందిగదా! ఆ తరువాత మా అత్తగారి తల్లి ఇచ్చిన బంగారం భద్రంగా దాచి నా కూతురికి ఇచ్చాను. మళ్లీ అన్నేళ్ల తరువాత నాకు బంగారం అమిరింది.

కొత్త గొలుసూ, గాజులూ వేసుకుని

కొడుకు వెంట వాడి ఉద్యోగం ఉన్న వూరికి ప్రయాణం కట్టాను.

అప్పుడు నా వయసు నలభై ఏళ్లు.

ఆ ఊరు పల్లెటూరు. చిన్న పెంకుటింటిలో రెండు గదుల వాటాలో కాపురం.

పొద్దున తొమ్మిది గంటలకే భోజనం చేసి బ్యాంకుకి వెళ్లిపోయేవాడు అబ్బాయి. ఇక ఆ తర్వాత నేనూ గుప్పెడు తినేస్తే పనయిపోయేది. మళ్లీ మధ్యాహ్నం వంటిగంటకు వచ్చి కాస్త ఫలహారం చేసి కాఫీ తాగి వెళ్లేవాడు. సాయంత్రం పొద్దుగూకాక వచ్చేవాడు.

జీవితం అంతా భారీ ఎత్తున వండి వార్చిన నాకు లింగూలిటుకూ మంటూ ఇద్దరికి ఇంత పిసరు వండాలంటే లక్కపిడతలతో ఆడుకున్నట్లు వుండేది.

అంట్లు కడిగి, బట్టలుతికి, బావిలో నీళ్లు తోడి పెట్టడానికి ఒక పనిమనిషిని పెట్టాడు మా అబ్బాయి. దాంతో ఇంకా పని తగ్గిపోయింది. పనిలేక పిచ్చెత్తినట్లు వుండేది. పని కల్పించుకుని అప్పడాలొత్తి, వడియాలు పెట్టి కాలక్షేపం చేసేదాన్ని.

అబ్బాయి క్షణం వృథా చెయ్యకుండా రాత్రిపూట కూడా ఏదో చదువుకుంటూ వుండేవాడు.

నాకేమీ తోచేదికాదు. కాస్త ఆలోచించి,

"అబ్బాయ్ చెల్లాయిని తీసుకురారా! నెల్రోజులు నా దగ్గర వుంటుంది" అన్నాను.

"అలాగే అమ్మా!" అన్నాడు.

వీలు చూసుకుని పిల్లల్ని తీసుకు వచ్చింది కూతురు. మూడేళ్ల ఆడపిల్ల. ఏడాది నిండిన మగపిల్లవాడు. గుమ్మడి పళ్లల్లా వున్నారు పిల్లలు. నా కూతురు మాత్రం కళాకాంతీ లేకుండా వుంది. చిక్కిపోయి డొక్కులా తయారైంది.





"ఏమిటే ఈ అవతారం" అన్నాను.

"పిల్లలతో తిండీ నిద్రా లేక ఇలా తయారయ్యాను" అంది నవ్వుతూ.

నిజమేమరి... పాలు తాగే పసిపిల్లాడు. ఎడ పిల్ల.

పోన్లే తీసుకొచ్చి మంచి పనే చేశాం. నెల్రోజులు ఇంత వండి పెడితే తిని తేరుకుంటుంది అని తృప్తిపడ్డాను.

నా మనవరాలు వాగుడుకాయ. చిలకలా కబుర్లు చెప్తుంది. దానితో సమానంగా వాగే సరికి దవడలు పడిపోయేవి నాకు.

ఓ రోజు మధ్యాహ్నం భోజనాలు చేసి వసారాలో పడుకున్నాం నేనూ నా కూతురూ. పసివాడిని పక్కలో వేసుకుని అది నిద్రపోయింది.

రెండో వసపిట్టని పక్కలో పడుకోబెట్టుకుని దాని కబుర్లు వినసాగాను.

"మొన్న పండగకి ఏం గౌను కొనుక్కున్నావే పాపాయ్!" అన్నాను.

"ఏం కొనుక్కోలే. నాన్న కొనలేదు!" అంది.

"ఏడిశావులే ఆరిందా మాటలు. నాన్న కొనే వుంటాడు. నువ్వే మర్చిపోయి వుంటావ్" అన్నాను.

"నిజం అమ్మమ్మా! కొన్లేదు. అమ్మా నాన్న దెబ్బలాడుకున్నారు. నాన్న అమ్మని కొట్టేడు కానీ గౌను కొన్లే. అమ్మ ఏడిచింది, నేనూ ఏడిచాను. తమ్ముడికి కొత్త చొక్కా వుంది. అయినా వాడూ ఏడిచాడు" అంది.

నాపై ప్రాణం పైనే పోయింది. వెంటనే నా కూతుర్ని లేపాను.

"ఏమిటే అమ్మాయ్ ఇదిలా అంటుంది? " అన్నాను.

"పోనీ అమ్మా! నీదో చాదస్తం. దాని వాగుడు లెక్క చెయ్యకు పడుకో" అంది చిరాగ్గా.

నా మొహం నాకేం నిద్రపడుతుంది.

పిల్లని నిద్ర పుచ్చాను. నా కూతురూ నిద్ర పోవడం లేదని తెలిసిపోయింది. లేచి వెళ్లి దగ్గరే కూర్చుని తల మీద చెయ్యి వేశాను.

"పిల్లలు భగవత్ స్వరూపాలంటారు. వాళ్లకి అబద్ధం ఆడడం ఏం చాతనవు తుంది? నిజం చెప్పవే తల్లీ" అన్నాను.

అంతే నా ఒడిలో తలదాచుకుని బావురు మని ఏడిచింది.

మనసు తేలికపడ్డాక కళ్లు తుడుచుకుంది.

"ఏం చెప్పమంటావమ్మా అదో మాలోకం. వచ్చే జీతం జల్సాలకు పోకుండా పొదుపుగా వాడుకుంటే తిండికీ బట్టకూ సరిపోతుంది. కానీ ఆయనకు పేకాట అలవాటు. సగం జీతం దానికే పోతుంది. ఎంతసేపూ స్నేహితులూ పేకాటా తప్పించి, ఇల్లూ పిల్లలూ ఏమీ పట్టించుకోరు. ఏ రాత్రికో వచ్చి ఇంత తిని మంచం ఎక్కుతారు. అన్నీ నేను చూసుకో వాల్సిందే. ఏమైనా అంటే రోషం పొడుచుకు వస్తుంది. బండబూతులు తిట్టడం, చెయ్యి చేసుకోవడం. మొదట్నుంచీ ఇంతే.

"పిల్లలు పుడితే బాధ్యత తెలిసొచ్చి కాస్త మనిషి మారతాడేమో అని ఆశపడ్డానుగానీ ఇప్పుడు మరీ అధ్వాన్నంగా వుంది నా పరి స్థితి.

"నేనైతే గుట్టు చప్పుడు కాకుండా ఇంటిప ట్టున పడుండేదాన్ని. ఇప్పుడీ పిల్ల మూలాన నా బతుకు బజార్న పడుతోంది. ఇరుగూ పొరుగూ హేళనగా మాట్లాడుతూ వుంటే ప్రాణం చచ్చిపోతోంది. ఎదురింట్లో యజ మాని సాయంత్రాలు ఆఫీసునుంచి, వచ్చి భార్యా బిడ్డలతో సరదాగా కాలక్షేపం చేస్తూ వుంటే నా మొహాన ఆ అదృష్టం లేకపో యిందే అని ఏడుపొస్తుంది. ఎందుకే అమ్మా నాకీ ఖర్మ? చిన్నప్పుడు మంచి మొగుడు రావాలి అని నువ్వు చేయించిన పూజలన్నీ శ్రద్ధగానే చేశానుకదే! మరి నాకెందుకిలాంటి మొగుడు దొరికాడే అమ్మా!"

ఏం సమాధానం చెప్పను?

ప్రతి తల్లీ తన బిడ్డ సుఖపడాలనే కోరు కుంటుంది. అందుకోసం పూజలూ నోములూ చేయిస్తుంది. నేనూ అలాగే చేయించాను.

"మా అమ్మా నా చేత అలాగే చేయిం చింది. మరి దాని ఫలితం ఏది?" అని అది ఎవర్ని అడగాలి?

ఏ దేవుడు సమాధానం చెప్తాడు?

సమాధానం లేని ప్రశ్న అది.

ఎవరి ఖర్మ వాళ్లది. చేసుకున్నవాళ్లకి చేసు కున్నంత మహదేవా అని వేదాంతం చెప్పు కుని సరిపెట్టుకోవాలి.

"మరి ఇన్నాళ్లూ నాతో మాట మాత్ర మైనా చెప్పావు కాదేమే అమ్మాయ్?" అన్నాను.

అంత బాధలోనూ పేలవంగా నవ్వింది నా కూతురు "చెప్పి మాత్రం ప్రయోజనం ఏముందే అమ్మా. నువ్వేం చెయ్యగలవు? నాతోబాటు ఏడుస్తావు అంతేగా. పేకాట ఆడినా సంసారంలో నిప్పులు పోసినా ఆయనే నా మొగుడు. ఆయన్ని కాదని ఎక్కడికి పోను? నాకేం గొప్ప చదువా! ఉద్యో గమా? నీతో చెప్తే మాత్రం నువ్వు నన్ను తీసుకొచ్చి నీ దగ్గరుంచుకోగలవా? ఎన్నా ళ్లుంచుకుంటావు? నన్నూ నాతోబాటు నా పిల్లలనీ ఎన్నాళ్లు పోషిస్తావ్? ఇవన్నీ పరి ష్కారం లేని సమస్యలు. కాలమే వీటికి సమాధానం. ఏదో ఒకనాడు నా కష్టాలు తీరతాయనే ఆశతో నేను బతుకుతున్నాను. మా అమ్మకంటే నేను వెయ్యి విధాల నయం అని ఆనందపడుతున్నాను. నువ్వూ మనసు గట్టిచేసుకో. నా కూతురికేం రాజా లాంటి మొగుడు, రత్నాల్లాటి బిడ్డలు అని

తృప్తిపడు. నా కూతురికంటే కష్టాలు పడు తున్నవాళ్లు లోకంలో ఎంతమంది లేరు. వాళ్లతో పోలిస్తే దీనిది అదృష్టజాతకం అని ఆనందించు. ఇంతకంటే ఈ పరిస్థితుల్లో మనం చేసేది ఏముంది? " అంటూ నాకు ధైర్యం చెప్పింది.

నా కడుపున పుట్టిన బిడ్డ అంత ఆకళింపు చేసుకుని వేదాంతం మాట్లాడుతున్నందుకు గర్వపడాలో, దాని పరిస్థితికి బాధపడాలో తోచలేదు నాకు.

ఇంక తర్వాత మా ఇద్దరి మధ్యా ఆ ప్రస క్తిరాకుండా జాగ్రత్తపడ్డాం. వున్న నెల్లాళ్లూ తల్లీ పిల్లలని ఆదరంగా చూసుకున్నాం.

వెళ్లే రోజు దగ్గర పడింది.

"ఇంకా నెల్లాళ్లు వుండవే అమ్మాయ్" అన్నాను.

"ఎన్నాళ్లున్నా అక్కడికి వెళ్లాల్సిన దాన్నే కదా అమ్మా. నీ కొడుకూ ప్రయోజకుడ య్యాడు. నీ జీవితం ఒక గాడినపడింది. ఇకనైనా సుఖంగా వుండు. ఇంకా బాదరబం దీలు పెట్టుకోకు. నా సంగతి అంటావా నిన్ను చూశాక నాకూ ఆశ పుడుతోంది. ఆ మహా సముద్రాన్ని ఈది నువ్వే గట్టు చేరగా లేనిది నేను నదిని ఈదలేనా!

"అన్నయ్య ఆప్యాయంగా తీసుకొచ్చాడు. ఈ నెల్రోజులుగా ఖర్చుకి వెనకాడకుండా నన్నూ, నా పిల్లల్నీ ఆదరించాడు. వాడు వాడి మర్యాద నిలబెట్టుకున్నపుడు నేనూ నా మర్యాద నిలబెట్టుకోవాలి. ఇక వెళ్తాను. మళ్లీ అవకాశం వచ్చినపుడు వస్తాను. నాకు మాత్రం మీరు కాక ఎవరున్నారే! ఇప్పటికి వెళ్లనీ" అంది.

ఇంకేం చెప్పను. "సరే తల్లీ నీ ఇష్టం" అన్నాను.

"అమ్మా నువ్వు నాకో సహాయం చెయ్యాలే" అంది మెల్లిగా.

"ఏమిటమ్మా" అన్నాను.

"ఇప్పుడెలాగూ నాకోసం చీర కొంటావు కదా! అది కొనకు. ఆ డబ్బు నాకివ్వు. చీరె లేవో వున్నవి చాల్లే. చిన్న పిల్లలు చీటికీమా టికీ అనారోగ్యాలూ. ఆయనింట్లో వున్న వేళుంటుంది, లేని వేళుంటుంది. ఏదైనా అత్యవసరానికి చేతులో డబ్బుంటే అదో ధైర్యం" అంది.

నా కడుపు చెరువైపోయింది. ఏదో పని కల్పించుకుని అక్కడినుంచి తప్పుకున్నాను.

ఆ మాట నా కొడుకు చెవిన వేశాను. "చూద్దాంలే అమ్మా! రాక రాక ఇంటికొచ్చిన ఆడపిల్లకి పసుపు కుంకాలు పెట్టకపోతే ఎలా? " అన్నాడు.

అంతకుమించి ఇంకేం చెప్పడానికీ నాకు నోరురాలేదు. ఇదంతా ఇంకెవరికీ చెప్పనని నా చేత ఒట్టు వేయించుకుంది నా కూతురు.

మరి ఏం చేశాడో ఎలా చేశాడో తల్లీ పిల్ల లకి బట్టలు కొన్నాడు. అదిగాక చెల్లెలి చేతుల్లో ఓ వంద రూపాయలు పెట్టాడు. నెల్లాళ్లు నిశ్చింతగా వుండేమో కొంచెం తేరు కుని తేటపడింది.

"వెళ్లొస్తానే అమ్మా! నువ్వు మనసులో నా గురించి దిగులు పెట్టుకోకు" అని నాతో చెప్పి నవ్వుతూ వెళ్లిపోయింది.

అది వెళ్లాక నాల్రోజులు అనుక్షణం దాన్నే గుర్తు చేసుకుని బాధపడ్డాను.

ఆ తర్వాత క్రమంగా కూతురిని మర్చిపో గలిగినా మరో వ్యక్తి జ్ఞాపకాలు ముల్లులా గుచ్చుకోసాగాయి.

మా అమ్మ!

జీవిత గమనంలో పడి ఆవిడని పూర్తిగా మర్చిపోయిన నాకు నా కూతురు వచ్చివె ళ్లాక అమ్మ పదేపదే గుర్తు రాసాగింది.

నాకు రెండో పెళ్లి వాడైనా ఆస్తిపరుడైన మొగుడు వుండేవాడు.



సవితి పిల్లలకి చాకిరీ చేసినా తిండికి వెతుక్కోలేదు.

మొగుడు పోయినా సవితి కొడుకు ఆదుకున్నాడు.

పిల్లలు పెద్ద వాళ్లయ్యారు. కొడుకు సంపాదన పరుడు అయ్యాడు. ఏదో నిశ్చింతగా సాగిపోతోంది నా జీవితం.

కానీ మా అమ్మ! చిన్నతనంలో మా నాన్న కష్టపడి నాలుగు రూపాయలు ఖచ్చితంగా సంపాదించడం నేనెరగను. ఏదో బుద్ధిపుడితే పొలానికి వెళ్లేవాడు. లేకపోతే లేదు.

మేము గంపెడుమంది పిల్లలం. నికరమైన సంపాదన లేకపోయినా మరి ఆ సంసారాన్ని ఎలా ఈడ్చుకొచ్చిందో ఆ పిచ్చి తల్లి.

చిన్నతనంలో మేము కష్టపడి సంపాదించుకున్న కాణీ కాస్తా లాక్కుందని ఏడ్చుకునే వాళ్లం. ఎంత అవసరం వచ్చి ఆ డబ్బుకి ఆశపడిందో పాపం.

ఆ తర్వాత మాత్రం?

కొడుకు అర్థాంతరంగా పోయాడు. మొగుడూ పోయాడు. మరెలా బతుకుతోందో.

ఆలోచించిన కొద్దీ బాధకలిగింది. ఒక్కసారి వెళ్లి ఆవిడని చూసి రావాలని కోరిక కలిగింది.

అబ్బాయితో చెప్పాను. వీలు చూసుకుని తీసుకెళ్తాలే అన్నాడు. అన్నాడేగానీ వాడికెక్కడ తీరుతుంది?

అందుకని నేను ఒంటరిగానే ప్రయాణం కట్టాను.

అబ్బాయి అడ్డం చెప్తే నచ్చచెప్పాను.

"తెలిసిన ఊరే కదురా! ఆ మాత్రం వెళ్లలేనా! తెలిసిన వాళ్లు చాలామంది వున్నారు. నాకేం ఫర్వాలేదు. వెళ్లొస్తాను" అన్నాను.

బోలెడన్ని జాగ్రత్తలు చెప్పాడు. ఆ ఊళ్లో వాళ్ల బ్యాంక్ అడ్రస్ ఇచ్చాడు.

"ఎవరూ కనిపించకపోతే అక్కడికి వెళ్లి ఈ ఉత్తరం ఇవ్వు. వాళ్లు సహాయం చేస్తారు" అని చెప్పి బస్ ఎక్కించాడు.

గమ్యం చేరాను.

ఊరు స్వరూపమే మారిపోయింది. ఏనాడో చూసిన ఆ ప్రదేశాలన్నీ గుర్తుపెట్టుకుని అతికష్టం మీద మా ఇల్లు వుండే చోటికి చేరాను. అప్పటి పూరిపాక స్థానాన డాబా ఇల్లు వుంది.

ఆ ఇంటి వాళ్లని అడిగితే,

"పదేళ్ల క్రిందట ఈ స్థలం కొనుక్కుని ఇల్లు కట్టుకున్నాం. అంతకుముందు ఎవరుండేవారో మరి!" అన్నారు.

మరిన్ని వివరాలు అడిగితే "మాకేం తెలియదు. గానీ ఆ మూల ఇంటివారు గత యాభై అరవై ఏళ్లుగా వుంటున్నారుట. వెళ్లి అడిగి చూడండి" అన్నారు.

అటువైపు వెళ్లాను.

వాళ్లు నాకు తెలుసు. ఆ ఇంటావిడని మా అమ్మ వదినా అని పిలుస్తూ వుండేది.

అక్కడికి వెళ్లి నేనొచ్చిన పని చెప్పాను. నన్ను ఆ ముసలావిడ దగ్గిరికి తీసికెళ్లారు.

"బాగున్నావా అత్తయ్యా!" అని పలకరించి నన్ను పరిచయం చేసుకున్నాను.

ఓ పట్టాన జ్ఞాపకం రాలేదు ఆవిడకి. తీరా గుర్తు పట్టాక తిట్టిపోసింది. 'జమీందారుని పెళ్లి చేసుకుని గర్వం వచ్చింది నీకు' అన్నది. పుట్టింటివైపే తొంగి చూడలేదు. అందుకే అన్నారు లక్కవంటి తల్లి రాయి వంటి బిడ్డ అని. నీ వెనుక చెల్లెళ్లున్నారు. వాళ్ల మంచీ చెడ్డా చూడాల్సిన బాధ్యత నీది కాదా!' అని నిలదీసి అడిగింది. అనాల్సినవి అన్నీ అనేశాక అమ్మ ఆచూకి తెలియజేసింది.

ఊరి చివర కొత్తగా రామాలయం కట్టా




రుట. అక్కడ వుందిట అమ్మ. ఆవిడకి కృతజ్ఞతలు చెప్పుకుని రిక్షాలో ఆ గుడికి వెళ్లాను. ఊరి చివరిగా వుంది ఆ గుడి.

చిన్న ఆవరణ. ఓ మూలగా రెండు గుడిసెలు. లోపలంతా పూల మొక్కలు, గేటు. చిన్న గుడే అయినా ఎంతో బాగుంది.

మెల్లిగా లోపలికి వెళ్లాను. అప్పుడు సాయంత్రం నాలుగు గంటలు అయింది. గుడి మూసేసి వుంది. తోట మాలి కాబోలు మొక్కలకి నీళ్లు పోస్తున్నాడు.

నన్ను చూసి ఎవరు అని అడిగాడు. నేనొచ్చిన పని చెప్పాను.

"ఆ ముసలమ్మ నీకేం అవుతుంది" అని అడిగాడు. చెప్పాను.

ఎగాదిగా ఓసారి చూసి "అదుగో అక్కడ పడుకుంది" అన్నాడు.

నీడపడే చోట గోడవారగా గచ్చు నేల మీదే తలకింద చెయ్యి పెట్టుకుని పడుకుని నిద్రపోతోంది అమ్మ. బాగా వడిలిపోయి వరుగులా తయారైంది. గుర్తు పట్టడమే కష్టంగా వుంది. నిద్రలేపుదామా అనుకుని కూడా వద్దనుకుని ఆ పక్కనే గోడకి జేరబడి కూర్చున్నాను.

మరి కాసేపటికి తనే లేచింది. వెళ్లి పంపుదగ్గర మొహం కడుక్కు వచ్చింది. అప్పుడు పలకరించాను.

"అమ్మా బాగున్నావా? "

ఎన్నో మాట్లాడాలని వున్నా గొంతుకేదో అడ్డం పడినట్లు అయింది.

"ఎవరూ? ఎవరమ్మా నువ్వు? " ఎండకి చెయ్యి అడ్డం పెట్టుకుని పరీక్షగా చూసింది.

"నేనేనమ్మా" అంటూ చెప్పుకున్నాను.

ఆ వడిలిపోయిన మొహంలోకి ఆనందం ఉప్పెనలా వచ్చేసింది.

"మా అమ్మే. నువ్వుటే! గుర్తే పట్టలేదు" అంటూ రెండంగల్లో వచ్చి కావలించుకుంది. చెంపలు తడిమి ముద్దు పెట్టుకుంది. ఒళ్లంతా తడుముతూ సంబరపడిపోయింది. కళ్ల వెంట నీళ్లు తప్పించి నోటి వెంట మాట రాలేదు కాసేపటిదాకా.

నెమ్మదిగా తేరుకుంది.

ఇక కబుర్లు చెప్పుకోడం మొదలైంది. ఇంచుమించు ఇరవై ఏళ్ల తర్వాత కలుసుకున్న తల్లీ బిడ్డలం ఎంత చెప్పుకుంటే తనివి తీరేను?

ఇల్లు కాస్తా అప్పుల వాళ్లు తీసేసుకున్నాక దగ్గర వున్న ఒక్క కూతుర్నీ వెంట బెట్టుకుని వేరే ఇంటికి మారిందిట. రెండిళ్లల్లో వంటలు చేసేదిట.

చెల్లెలిని ఓ రెండో పెళ్లి వాడికే ఇచ్చి పెళ్లి చేసిందిట. అతనూ వంటలు చేసుకుంటాడుట. కొంతకాలం తర్వాత వాళ్లూ వేరే ఊరు వెళ్లిపోయారుట.

మొగుడొదిలేసిన రెండో చెల్లెలు ఎవరింట్లోనో పనికి కుదురుకుని వాళ్లు ట్రాన్స్‌ఫరు మీద వెళ్తూ దీన్నీ వెంట తీసికెళ్లారుట.

ఇంట్లోంచి పారిపోయిన ఆఖరు చెల్లెలు సినిమాల్లో చిన్నాచితకా వేషాలు వేస్తోందిట.

"ఫలాని సినిమాలో హీరోయిన్ స్నేహితురాళ్లలో ఎడం పక్కనుంచి మూడోదాన్ని నేనే వెళ్లిచూడు" అంటూ ఆమధ్య ఎప్పుడో ఉత్తరం రాసిందిట. మా అమ్మ వెళ్లి చూసొచ్చిందిట.

వంటలు చేసే ఓపిక తగ్గిపోయాక ఎవరో ధర్మాత్ముడు దయదల్చి గుళ్లో పని ఇప్పించాడుట. రెండు పూట్లా చిమ్మి నీళ్లు జల్లి ముగ్గు వెయ్యడం. పూజ సామాగ్రి తోమి పెట్టడం. నెలకి ఇరవై రూపాయలు ఇస్తారుట. పొద్దునపూట ప్రసాదం పెడతారుట. రాత్రికి రెండరటిపళ్లు తిని పడుకుంటుందిట.



"ఏదో లేవే అమ్మాయ్. ఈనాటికి ఇట్లా గడిచిపోతోంది" అంది ఆఖరుగా.

నా గురించి కూడా అన్నీ వివరంగా చెప్పాను.

"పోనీలేవే తల్లీ పడ్డన్నాళ్లూ పడినా ఈనాటికి నీ జీవితం చక్కబడింది. కొడుకు ప్రయోజకుడయ్యాడు. వాడి నీడన నిశ్చింతగా వుండచ్చు" అని సంతోషించింది.

"నాతో వచ్చెయ్! నేను తీసుకు వెళ్తాను" అన్నాను.

"ఆ మాట అన్నావు. అదే పదివేలు. నేనెక్కడికీ రాలేనమ్మా! కనడం తప్ప మీకెవ్వరికీ ఏమీ చెయ్యలేదు. ఆ రోజుల్లో ఇప్పటిలా సాధనాలూ లేవు. మాకా తెలివితేటలూ లేవు. ఇంకో మగపిల్లాడు కావాలని కూర్చుంటే మీరందరూ పుట్టుకొచ్చారు. కన్నబిడ్డలకి కడుపునిండా అన్నం పెట్టలేని దుస్థితి నన్ను రాక్షసిని చేసేసింది. మీ బతుకులు మీరే బతుకుతున్నారు. ఆమధ్య నీ పెద్ద చెల్లెలు కూడా తనతో రమ్మంది. నేనే వెళ్లలేదు. నా బాధ్యత నేను సక్రమంగా నెరవేర్చకపోయినా మీకు భారంగా మారడానికి మాత్రం మనసు అంగీకరించడంలేదు. ఏదో ఆ భగవంతుడి దయవల్ల వాడి పంచనే ఆశ్రయం దొరికింది.

అయినా ఇంకెన్నాళ్లు. ఈ మాత్రం తిరుగుతూ తిరుగుతూ ఈ ఘటం వెళ్లిపోతే చాలు" అంది.

బలవంతం చేసినా విన్లేదు. పైగా అట్లా బలవంతం చేసి తన భారాన్ని నెత్తినేసుకోవద్దని మందలించింది.

"నువ్వేదో సర్వ స్వతంత్రురాలివైనట్లు నన్ను రమ్మని బలవంతం చేస్తున్నావు. ఇల్లలకగానే పండగ అవుతుందా? రేపీపాటికి నీకూ కోడలొస్తుంది. ఆవిడ రాగానే ఆ ఇంటికి నువ్వే పరాయి దానివి అవుతావు. నీకు సాయం గుదిబండలా నేను కూడానా! ఈ ఆలోచనలన్నీ మానేసి నీ జీవితం సవ్యంగా వెళ్లమారేలా చూసుకో" అంది.

ఇంక నేనేం మాట్లాడతాను. ఆవిడ చెప్పింది అక్షర సత్యం. ఆ రాత్రికి అక్కడే పడుకున్నాను. ఒక మనిషి పడుకోడానికి సరిపడే జాగాలోనే ఇద్దరం సర్దుకున్నాం. మర్నాడు ప్రయాణం అయ్యాను నేను. చేతుల్లో కాస్త డబ్బు పెట్టబోతే వద్దంది.

"రాత్రి పూట చలిగా వుంటోందే అమ్మాయ్! నీకు వీలైతే ఒక దుప్పటి కొని పెట్టు" అంది.

గతుక్కుమన్నాను. ఏనాడూ బజారు ముఖం చూసి ఎరగనిదాన్ని. బేరసారాలు నాకేం తెలుస్తాయి. అసలు నా దగ్గరున్న డబ్బుకి దుప్పటి వస్తుందో రాదో కూడా తెలియదు నాకు. అలా అని ఆ మాట చెప్పడానికీ మనసు రాలేదు.

మా అమ్మని వెంటబెట్టుకుని బజారుకి వెళ్లాను.

అక్షరం ముక్క రాకపోయినా బయట వేలాడదీసిన బట్టలని చూసి ఒక కొట్లోకి వెళ్లాం. ధర అడిగి తెలుసుకున్నాక ధైర్యం వచ్చింది. దుక్కలా వున్న దుప్పటి ఎంచి బేరం చేసి డబ్బు చెల్లించాను. నా దగ్గర మిగిలిన డబ్బులో నా చార్జీకి మాత్రం వుంచుకుని మిగిలిన దానితో అమ్మకోసం పళ్లుకొన్నాను. అమ్మని పంపించి నేను బస్టాండుకు వచ్చి బస్సెక్కాను.

నాకెంతో సంతోషం అనిపించింది. అమ్మను చూడడం ఒక కారణం అయితే నా అంతట నేను ఒంటరిగా ప్రయాణం చేసి అమ్మ ఆచూకి కనుక్కుని అంతటితో ఆగక బజారు పని కూడా చేసేసరికి ఏదో సాధించినంత గర్వం కలిగింది. నామీద నాకే ఏదో నమ్మకం ఏర్పడింది. నాలో ధైర్యం కలిగింది.

ఇంటికి వచ్చి నా అనుభవం చెప్తే మా అబ్బాయీ ఆనందించాడు.

"ముందు భయపడ్డానుగానీ పంపించడం మంచిదే అయింది. ఈమాత్రం ఒంటరి ప్రయాణం అలవాటు అయితే నీ స్వతంత్రం నీకుంటుంది" అన్నాడు.

అమ్మమ్మ గురించి తెలుసుకున్నాడు.

"వెంట తీసుకు రాలేకపోయావా" అన్నాడు.

"రానంది" అని చెప్తే,

"పోనీలే వీలు చూసుకుని నెలకు పదో పరకో పంపిస్తాను. వాడుకుంటుంది పెద్ద వయసులో" అన్నాడు.

అన్నమాట ప్రకారం ప్రతి నెలా పంపుతూనే వుండేవాడు. ముట్టినట్టూ అమ్మ పూజారిగారి చేత కార్డుముక్క రాయిస్తూనే వుండేది.

అలా ఓ ఏడాది గడిచిందేమో. అమ్మకు ఆ అవసరం లేకపోయింది. ఏ డబ్బూ అవసరం లేని చోటికి వెళ్లిపోయింది. పూజారిగారే ఉత్తరం రాశారు.

నిద్రలోనే ప్రాణం పోయిందిట.

గుడి ఆవరణకాబట్టి ఎక్కువసేపు వుంచకుండా వెంటనే అన్నీ ముగించేశారుట. ఆ ఘట్టం అలా ముగిసిపోయింది.



మా అబ్బాయి పడిన శ్రమకు ఫలితం దక్కింది.

వాడు ఆఫీసరు పరీక్షలు పాసై ఆఫీసరు అయ్యాడు. వేరే ఊరికి బదిలీ చేశారు.

పరీక్షలు నెగ్గితే కొండకి వస్తానని మొక్కుకున్నాడుట. తిరుపతి ప్రయాణం కట్టాడు. నన్నూ బయలుదేర దీశాడు.

రాత్రంతా బస్సులో ప్రయాణం.

తెల్లారి తిరుపతిలో దిగి బస్సులో కొండ మీదికి వెళ్లాం. రెండ్రోజులు వున్నాం.

అబ్బాయి తలనీలాలు ఇచ్చాడు. రెండుసార్లు క్యూలో వెళ్లి దైవదర్శనం చేసుకున్నాం. అక్కడ చూడవలసినవి అన్నీ చూసి కిందకి దిగి అక్కడ ఒక రోజు వుండి గుడులకి వెళ్లాం. యాత్ర ముగించుకుని ఇంటికి చేరుకున్నాం.

ఆ నాలుగు రోజులూ నా జీవితంలో మరపురానివి.

ఎంతమంది జనం.

ఎంత అందమైన ప్రదేశం.

కనులకి పండుగ చేసే ప్రకృతి సౌందర్యం.

బల్లముందు కుర్చీలో కూర్చుంటే వేడివేడిగా ఫలహారాలు, భోజనాలు.

నేను ఏనాడూ విని ఎరుగని వింత ప్రపంచం.

అదంతా చూస్తూ వింత అనుభూతిని పొందాను.

ఆ తర్వాత కూడా ఆ అనుభవాలన్నీ పదే పదే గుర్తు చేసుకుంటూ వుండేదాన్ని.

కొత్త ఊరు వెళ్ళాం.

పల్లెటూరునుండి బస్తీకి వచ్చిపడ్డాం. ఇల్లు సౌకర్యంగానే వుంది. పనిమనిషి దొరికింది. కానీ ఇవ్వాల్సిన జీతం చెప్తే కళ్ళు తిరిగాయి.

"ఎందుకురా! ఏమంత పని వుంది? నేనే



చేసేస్తాను. పనిమనిషి వద్దు" అంటే అబ్బాయి కోప్పడ్డాడు. "జరుగుబాటు వున్నపుడు కూడా శ్రమపడడం ఎందుకూ" అన్నాడు.

కొత్త ఊళ్ళో స్థిరపడ్డాం.

ఒకరోజు మధ్యాహ్నం మా ఇంటికి ఎవరో ఇద్దరు పెద్దమనుషులు వచ్చారు. తమను పరిచయం చేసుకున్నారు. వాళ్ళకి పెళ్ళికావలసిన పిల్ల వుందిట. మా అబ్బాయికోసం వచ్చారు. ఎంతో గౌరవంగా మాట్లాడారు. "మాకు మగదిక్కు మా పెద్దబ్బాయి. ఆయన దగ్గరికి వెళ్ళి మాట్లాడండి" అని చెప్పి పంపించాను.

మర్నాడే వచ్చాడు మా పెద్దబ్బాయి. వాళ్ళ వివరాలన్నీ చెప్పాడు.

అంతా విని వద్దన్నాడు అబ్బాయి.

"నాకు ఉద్యోగం చేసే అమ్మాయిని చూడు అన్నయ్యా" అన్నాడు.

చెప్పొద్దూ నాకు చాలా ఆశ్చర్యం వేసింది.

"ఉద్యోగం చేసే పిల్ల నీకెందుకురా? నీ సంపాదన బాగానే వుందిగా. అయినా నీ భార్య ఉద్యోగం చేస్తే ఇల్లు, వాకిలీ ఎవరు చూస్తారు? " అన్నాను.

"ఇది మరీ బాగుంది. ఉద్యోగాలు చేసే ఆడవాళ్ళందరికీ ఇళ్ళూ సంసారాలూ లేవా! ఇద్దరం సంపాదించుకుంటే ఆ తీరే వేరు" అన్నాడు.

"వాడి పెళ్ళి. వాడి ఇష్టప్రకారమే కానిద్దాం పిన్నీ!" అన్నాడు మా పెద్దబ్బాయి.

ఆ సంబంధం వద్దని కబురు పెట్టాడు. అది వద్దంటే మాత్రం సంబంధాలకి కొదవా?

అన్నీ సానుకూలపడిన సంబంధం చూసుకుని పెళ్ళిచూపులకి వెళ్ళాం. అమ్మాయి చక్కగా వుంది. మా అందరికీ నచ్చింది. బ్యాంక్‌లోనే పనిచేస్తోంది.

అమ్మాయి చదువుకున్నా, ఉద్యోగం చేస్తూ వున్నా, కట్నం ఇస్తామని వాళ్ళే ముందుకొచ్చారు. పుచ్చుకునేందుకు మేమూ సిద్ధపడ్డాం. అన్ని మాటలూ అయ్యాయి. ముహూర్తాలు పెట్టుకున్నారు.

పెళ్ళికి నెల్రోజులముందే వచ్చింది నా కూతురు.

మనవరాలు స్కూల్లో జేరింది. మనవడు ఇంటి దగ్గరే అక్షరాలు దిద్దుతున్నాడు. అల్లుడు పెళ్ళివేళకి వస్తాడుట.

"అమ్మాయ్, మీ ఆయనలో ఏమైనా మార్పువచ్చిందిటే!" అని అడిగాను.

"నీ చాదస్థంకాకపోతే ఇటువంటి మనుషులు మారతారుటే! నేనే మారిపోయాను. పరిస్థితులతో పూర్తిగా రాజీపడిపోయాను. అవసరం అయితే ఎదురు తిరగటం అలవాటు చేసుకున్నాను నవ్వుతూ బతికేస్తున్నాను." అంది నవ్వేస్తూ.

అది వచ్చాక నాకు ప్రాణం లేచివచ్చినట్లు అయింది. అన్ని పనుల్లూ అదే చక్కబెట్టింది.

ఆమాటే అంటే మా అబ్బాయి దెబ్బలాడాడు. "వూరికే చేస్తుందా! వచ్చి పడుతున్నాయిగా ఆడపడుచు లాంఛనాలు. అందు కోసం హైరానాపడిపోతోంది" అన్నాడు.

"నా ఆడపడుచు లాంఛనాలు నాకు రాక అవి కూడా నీకే వస్తాయా! జాగర్త. నా హోదా పెరిగింది. నిన్నూ మీ ఆవిడనీ కాల్చుకుని తినేస్తాను" అని దెబ్బలాడింది చెల్లెలు.

ఇద్దరూ సరదాగా చిన్నపిల్లల్లా పోట్లాడుకున్నారు.

పెళ్ళి దగ్గరపడేసరికి నా మిగిలిన పిల్లలందరూ కూడా వచ్చేశారు.

మనవలూ, మనవరాళ్ళూ, వాళ్ళ పిల్లలూ! ఇల్లంతా సందడే సందడి. ఇల్లు చాలక ఇరుగూ పొరుగువారిని అడిగి వాళ్ళ ఇళ్ళూ వాడుకున్నాం. అందరం పెళ్ళికి తరలి వెళ్ళాం.

పెళ్లి బాగానే చేశారు వాళ్ళు. కొత్త కోడలు గృహప్రవేశం చేసింది. మనుగుడుపులు అయ్యాక కొత్త దంపతులు బయలుదేరి తిరుపతి వెళ్ళారు. అక్కడినించి మెద్రాసూ, మైసూరు అన్నీ తిరిగి వారంరోజుల తరువాత వచ్చారు.

మరోవారం రోజులుండి కోడలు ప్రయాణం కట్టింది. శెలవు అయిపోయిందిట. వెళ్ళి ఉద్యోగంలో జేరాలి.

మొగుడిని వదిలి వెళ్ళలేక కోడలూ, భార్యని వదల్లేక కొడుకూ నీరసించి నీరుగారిపోయారు.

కానీ తప్పదు. వెళ్ళి తీరాలి.

వాళ్ళ వాళ్ళెవరికో బోలెడంత పలుకుబడి వుందిట. వాళ్ళద్వారా ప్రయత్నించి పదహేన్రోజుల పండగ వెళ్ళేలోగా ట్రాన్స్‌ఫర్ చేయించేస్తాం అన్నారు పెళ్ళికి ముందు.

కానీ, అంత త్వరగా వ్యవహారం జరిగేలా కనిపించలేదు. దానికేనా సవాలక్ష అడ్డంకులు వున్నాయిట.

వారం వారం అదైనా ఇక్కడికి వచ్చేదీ, వీడైనా అక్కడికి వెళ్ళేవాడు.

"బస్సులకే బోలెడంత డబ్బు పోస్తున్నాం. త్వరగా ట్రాన్స్‌ఫర్ అయిపోతే బాగుండును" అనేవాడు మా అబ్బాయి.

"ఇదుగో ఫలాన వారిద్వారా చెప్పించేశా రుట. బహుశా ఈ వారంలో అయిపో తుంది" అని ఆనందపడేవాడు. తీరా చూస్తే అది కాస్తా బెడిసికొట్టేది. దాంతో గాలితీసిన బూరలా నీరసపడిపోయి చిరాకుపడేవాడు.

అలా దాదాపు ఒక సంవత్సరం తంటాలు పడ్డాక ట్రాన్స్‌ఫర్ అయింది. కోడలు కాపు రానికి వచ్చింది.



ప్రతి ఆడదాని జీవితంలోనూ అదో విచి త్రమైన ఘట్టం. అంతవరకూ తన ఇల్లు అనుకున్నది వేరొక వ్యక్తి సొంతం అయిపో తుంది.

అంతకాలం అమ్మా అమ్మా అంటూ తిరి గిన కొడుకు పరాయివాడు అయిపోతాడు. అత్తగారి స్థానం మారిపోతుంది. అధికారం కోడలి హస్తగతం అవుతుంది.

మహామహావాళ్ళకే ఇబ్బంది కలిగించే ఆ మార్పుకి తట్టుకోవడం నాబోటి సామాన్యు రాలిని మరింత తికమక పెట్టిందంటే అందులో ఆశ్చర్యం ఏముంది?

ఎంత వద్దనుకున్నా నేను పెళ్ళి చేసుకుని కాపురానికి వచ్చినప్పటి పరిస్థితులు పదేపదే గుర్తువచ్చేవి.

బ్యాంకునుండి రాగానే చిలకలా ముస్తాబై ఝూమ్మంటూ భర్తతో సినిమాకో, షికారుకో చెక్కేసే కోడలిని చూస్తుంటే ఈర్ష్యతో నా మనసు భగ్గుమనేది.

జీవితంలో ఒక్కరోజుకూడా అటువంటి సరదాలకు నేను నోచుకోలేదు కదా అని బాధకలిగేది.

కానీ నా బతుకేమిటో నాకు తెలుసు కాబట్టి నా మనసులోని అలజడి బయటప డకుండా జాగర్తపడేదాన్ని.

నేనేమైనా మాట జారితే దాని పర్యవ సానం ఎలా వుంటుందో నాకు తెలుసు స్వంత ఇల్లుగానీ, భర్త అండగానీ చేతికి సమృద్ధిగా డబ్బుగానీ వుంటే ఆ దారే వేరు. అవేమీ లేని నేను తెలివితక్కువగా ప్రవర్తిస్తే నా గతి అధోగతే!

నన్ను ఆదుకుంటున్న కొడుకు అండ పోగొట్టుకుంటే నా జీవితం బజారుపాలవు తుందని పైకి ఆనందం నటిస్తూ కాలక్షేపం చేయడం అలవాటు చేసుకున్నాను.

క్రమంగా ఆ వాతావరణానికి అలవాటుప డిపోయాను. కోడలనే భావన పక్కనపెట్టి సాటి ఆడదానిగా చూస్తే దానిమీద జాలివే సేది. ఇంటా బయటా రెండు విధాలా సమర్థించుకోవాలి.

రోజుకోరకం చీరకట్టుకుని బ్యాంకుకు వెళ్ళి వస్తూ నెలతిరిగే సరికి మగవాడితో సమా నంగా సంపాదిస్తూ పైకి అందంగా, ఆనం దంగా కనిపించినా దాని బాధలు దానికు న్నాయి. ఎంత చదువుకున్నా ఎంత ఉద్యోగం వెలగబెడుతున్నా ఆడది ఆడదే. పనిమనిషి రాకపోతే ఇంటిపని ఆడదే చెయ్యాలి. ఇంటికెవరైనా బంధువులొస్తే ఆడదే శెలవు పెట్టాలి. అవన్నీ అటుంచి శారీరకంగా ప్రకృతి విధించిన ఆంక్షలు



భరిస్తూ ఆఫీసుకి వెళ్తున్న కోడల్ని చూస్తుంటే జాలివేసేది.

మారోజుల్లో ఆచారం పేరిట ఆ మూడ్రో జులూ విశ్రాంతి లభించేది. ఇప్పటి వాళ్ళకి అదీ లేదు. మా కోడలికి నెల తప్పింది. ఓ పక్క వేవిళ్ళు, ఇంకోపక్క సంవత్సరం ఆఖ రుట బ్యాంకిలో పని వత్తిడి. శెలవు దొరి కేది కాదు. సతమతం అయిపోయేది. ఇంత కడుపు వేసుకుని వెళ్తూ వుంటే నా ఆడమనసు విలవిలలాడింది. తొమ్మిదోనెల రాగానే శెలవు పెట్టి పురిటికి పుట్టింటికి వెళ్ళి పోయింది. ఊపిరి పీల్చుకున్నాను నేను.

నెలలు నిండాక పండంటి బిడ్డను ప్రస వించింది. కబురు తెలియగానే నేనూ అబ్బాయీ బయలుదేరి వెళ్ళాం.

పసిబిడ్డ చందమామలా ఉంది. కోడలూ ఆరోగ్యంగానే వుంది. నామకరణ ముహూర్తం నిర్ణయించుకుని తిరిగి వచ్చేశాం.

ఇరవైఒకటవ రోజునే నామకరణం, ఊయల పేరంటం. ఒక రోజు ముందుగానే వెళ్ళాం. మిగిలిన బంధువులు కూడా వేడుక నాటికి వచ్చారు.

మా అబ్బాయి కూతురికి గొలుసు చేయిం చాడు. వియ్యంకుడు గాజులు చేయించాడు. చంటి దానికి భారతీ లావణ్య అని పేరు పెట్టారు. నామకరణం బాగా జరిగింది.

నేనూ అబ్బాయీ తిరిగి వచ్చేశాం. అబ్బాయి అప్పుడప్పుడు వెళ్ళి చూసివస్తూ వుండేవాడు. పొద్దస్తమానం ఆ పసిదాని కబుర్లే.

మూడవనెల రాగానే కోడలు వచ్చేసింది. ఒళ్ళు చేసి గుమ్మడిపండులా వుంది భారతి. పలకరిస్తే నవ్వటం, ఊ కొట్టడం నేర్చు కుంది. ఇల్లంతా సందడేసందడి. ఊరినుండి వచ్చిన వారంరోజులకే కోడలు డ్యూటీకి వెళ్ళాలి. శెలవు అయిపోయింది. పాలు తాగే పసిబిడ్డని వదిలి వెళ్ళాలంటే మాటలా? కన్నతల్లికి అంతకంటే బాధాకర మైన విషయం ఏముంటుంది? ఇటు పిల్లకి డబ్బా పాలు అలవాటు చేస్తూ అటు అది పాలు తగ్గేందుకు మందులు మింగుతూ వుంటే నా ప్రాణం వుసూరుమంది.

బ్యాంకుకి వెళ్ళేరోజున దాని బాధ వర్ణనా తీతం. లక్ష జాగర్తలు చెప్పి వెళ్ళలేక వెళ్ళ లేక వదిలి వెళ్ళింది.

నాకు ఊపిరి సలపనంత పని. పొద్దున్న వంట పని. కోడలు వెళ్ళాక పసిదాని సంర క్షణ.

పసిబిడ్డా పాడికుండా వుంటే ఎంతకీ పని తెమలదు అని సామెత చెప్పినట్టూ రోజంతా దానితోనే సరిపోయేది. సాయంత్రం కోడలు వచ్చాక పిల్లని తల్లికి అప్పగించి నేను వంటపనీ వగైరాలు చూసు కునేదాన్ని. మొదట్లో కొంచెం శ్రమ అనిపిం చినా క్రమంగా అలవాటు అయిపోయింది.

భారతిని చూడడానికి ఇంట్లో పెద్దదాన్ని నేనున్నాను. ఆ సదుపాయం లేనివాళ్ళు ఏం చేస్తారు? అనే అనుమానం వచ్చి కోడల్ని అడిగాను. పెద్దపెద్ద పట్టణాలలో చిన్న పిల్ల లని చూసుకునేందుకు బేబీకేర్ సెంటర్లు వుంటాయి. ఇలాటి చిన్న బస్తీల్లో ఆ సదు పాయం ఇంకా రాలేదు. ఏ పనిమనిషిమీదో ఆధారపడాలి. వాళ్ళు సరిగ్గా చూసీ చూడకా. మాతో పనిచేస్తున్న ఒకావిడ పిల్లల్ని ఇంట్లో పనిపిల్లకి అప్పజెప్పి వచ్చేది. అది కాస్తా పిల్లలకోసం వుంచిన పాలూ, బిస్కెట్లూ ఆరగించి పిల్లలని మాడ్చి పెట్టే దిట. విషయం తెలిసిన వెంటనే దాన్ని మాన్పించి మరోదాన్ని పెడితే అది దాని తాతలాటిదిట. నమ్మకమైన మనిషి దొరి కితే డబ్బు ఎంతైనా ఇచ్చేందుకు సిద్ధమే కానీ అలాటి వాళ్ళు దొరకొద్దూ.

ఒక్కమాటలో చెప్పాలంటే ఉద్యోగం చేస్తున్న ఆడవాళ్ళ పాట్లు కుక్కపాట్లే" అంది

కోడలు.

ఏం చెప్పాలో తోచలేదు నాకు.

కోడలు ఉద్యోగస్తురాలు. నెల తిరిగేసరికి బిళ్ళకుడుముల్లా బోలెడంత జీతం. మహారాణిలా వుంటుంది జీవితం అనుకున్నాను పెళ్ళికుదిరినప్పుడు.

అట్లాటిది కోడలు తన సమస్యలు సవాలక్ష అని చెప్పుకుంటూ వుంటే యదార్థం తెలిసివచ్చింది.

చంటిపిల్లకు చీటికీ మాటికీ చిన్నాచితకా అనారోగ్యాలు. మా రోజుల్లోలాగా గచ్చాకు పుచ్చాకు వైద్యంతో కాలక్షేపం చెయ్యటం కాదుకదా! డాక్టరు దగ్గరికి తీసుకువెళ్ళాలి. మందులు కొని తెచ్చి వాళ్ళు వాడమన్న ప్రకారం వాడాలి.

ఏదో ఆకలేస్తే పాలు పట్టగలను. ఆడించగలను. అంతేగానీ పొట్టపొడిస్తే అక్షరం ముక్క రాని నేను ఆ ఇంగ్లీషు మందులు వేళప్రకారం వెయ్యాలంటే నాకేం చాతనవుతుంది. వాళ్ళు వివరించి చెప్పినా ఎక్కడ తేడావస్తుందో అని భయంవేసి ఆ బాధ్యత నెత్తిన వేసుకోడానికి వెనక్కి తగ్గేదాన్ని.

ఎవరో ఒకరు శెలవుపెట్టి ఇంట్లో వుండాలి. "నే నుండి మాత్రం ఏం చేస్తాను? శెలవు దండగ. నువ్వే శెలవు పెట్టు" అనేవాడు అబ్బాయి.

కోడలికీ ఒకపట్టాన శెలవు దొరకదు. ఇట్లా చీటికీ మాటికీ శెలవు కావాలంటే విరుచుకుపడతాడుట వాళ్ళ అధికారి.

ఒకరోజు పిల్లకి జ్వరం. ఒళ్ళు పేలిపోతోంది. "అక్కడ ఏదో అర్జెంటు పని వుందిట. వెళ్ళి ఓ గంటలో వస్తాను" అని చెప్పి వెళ్ళింది.

వెళ్ళిన మనిషి పత్తాలేదు. ఇవతల పిల్లకి జ్వరం తగ్గదు. ఏదో ఉపశమనానికి చిట్కాలు ఉపయోగిస్తూ కూర్చున్నాను నేను. మధ్యాహ్నం ఒంటిగంట దాటాక పరుగులు పెడుతూ వచ్చింది కోడలు. పిల్లను తీసుకుని ఆ రిక్షాలోనే డాక్టరు దగ్గరికి వెళ్ళింది. తీరా ఇది వెళ్ళేసరికి ఆ డాక్టరు క్లినిక్ మూసేసి ఇంటికి వెళ్ళిపోయాడుట.

అక్కడినుంచి ఆయన ఇంటికి వెళ్ళి అక్కడ ఆయన్ని బతిమాలి పాపాయికి ఇంజక్షను ఇప్పించి ఇంటికి వచ్చేసరికి రెండున్నర దాటింది. పొద్దున్న అన్నం కూడా తిన్లేదు పిల్లతోనే సరిపోయింది. మొహం నీరసంతో పీక్కుపోయింది.

ఇదీ సంగతి. ఇంటికి వెళ్ళాలి అంటే ఆ అధికారి నానా చీవాట్లూ వేశాడుట. "ఇంట్లోనైనా కూర్చోవాలి. లేదా ఉద్యోగమైనా చెయ్యాలి. అవ్వా కావాలి బువ్వా కావాలి. అంటే ఎట్లా? మీ లేడీస్‌తో వ్యవహారం తల నెప్పిగా తయారవుతోంది. ఎప్పుడూ ఏదో అవసరాలు. ఏదో సాకులు చెప్పి చెక్కేస్తూనే వుంటారు. ఇట్లా అయితే పనెట్లా జరుగుతుంది? నేను మాత్రం ఏం చెయ్యగలను. అయినా మగవాళ్ళతో సరిసమానంగా జీతాలు తీసుకుంటున్నపుడు పని కూడా వాళ్ళతో సమానంగానే చెయ్యాలి. అందుకు సిద్ధపడితేనే ఉద్యోగాల్లో జేరాలి. ఏమైనా అంటే పౌరుషాలు పొడుచుకొస్తాయి" అంటూ నానా మాటలూ అన్నాడట్టయ్యా.

"నేనేం చెయ్యను? నేనేమైనా సరదాకి శెలవు పెడుతున్నానా? ప్రాణావసరం వచ్చింది కాబట్టి అడిగాను. ఇవతల దీనికి ఇట్లావుంటే నాకు ప్రాణం నిలుస్తుందా? పోనీ పని త్వరగా ముగించి బయటపడదాం అనుకుంటే అదేమి ఖర్మమో మనసు తిన్నగా లేక అన్నీ పొరబాట్లు చేసి అవి సర్దుకుని బయటపడేసరికి ఈవేళ అయింది"

అంటూ పసిదాన్ని ఒళ్ళో పడుకోబెట్టుకుని దీనంగా కళ్లొత్తుకుంటూ వుంటే నా మనసు కరిగిపోయింది.

ఓదార్చి బలవంతాన లేపి అన్నం పెట్టాను. నాలుగు ముద్దలు తిని మళ్ళీ పరి గెట్టుకొని వెళ్ళిపోయింది.

ఆ సాయంత్రానికి పాపాయికి జ్వరం తగ్గింది.

ఆ సాయంత్రం కోడలు సమస్య గురించిన ప్రసక్తి వచ్చింది ఇంట్లో. తన అధికారిని తూర్పార పట్టింది కోడలు.

అంతా విని నవ్వేశాడు అబ్బాయి.

"ఎందుకంత కోపం? ఆయన అన్నాడంటే వూరికే అన్నాడా? ఆయన పరిస్థితి కూడా అర్థంచేసుకోవాలిగా!" అన్నాడు.

కట్టుకున్న భార్యని పరాయి మగవాడు అన్ని మాటలన్నాడని తెలిసి కోపగించుకోకుండా చిద్విలాసంగా నవ్వుతూవుంటే నాకు ఒళ్ళు మండిపోయింది.

"అదేమిట్రా అబ్బాయ్ అలా అంటావ్, నువ్వు కూడా! ఆడపిల్ల, పసిబిడ్డతల్లి అనే కనికరమైనా వుండొద్దూ ఆ మనిషికి? " అన్నాను.

"చాల్లే అమ్మా నువ్వుకూడా దానికి వత్తాసు పలుకుతున్నావ్! అట్లా జాలిపడుతూ వుంటే పన్లు జరగొద్దా! అదేమైనా అతడి స్వంత వ్యాపారమా కనికరించి నిర్ణయాలు తీసుకోడానికి. ఆయనా భుక్తికోసం ఉద్యోగం చేస్తున్న వాడే. ఆయనకీ అధికార్లు వుంటారు. పని సక్రమంగా జరక్కపోతే ఆయన సంజాయిషీ ఇచ్చుకోవద్దా.

"అంతెందుకు ఆయన స్థానంలో వుంటే నేను కూడా అలాగే ప్రవర్తిస్తాను. నా బ్రాంచిలోనూ నలుగురు ఆడవాళ్లు వున్నారు. నాకూ ఇలాంటి సమస్యలే వస్తూ వుంటాయి. వాళ్ళొచ్చి శెలవు కావాలంటారు. ఇచ్చి పంపిస్తే ఆ సీట్లో పనాగిపోతుంది. ఏం చేస్తాను. కాదు పొమ్మంటాను. అంత మాత్రాన నేను కర్కోటకుడినా! నా డ్యూటీ నేను చేస్తున్నాను. అట్లా చెయ్యకపోతే నా పైవాళ్ళు నన్ను చెరిగేస్తారు. ఎంతైనా ఈ ఆడవాళ్ళకి మగవాళ్ళకంటే శెలవులు ఎక్కువే అవసరం అవుతాయి. అలా అని వాళ్ళకోసం పని తగ్గించి ఇవ్వరుగా!

అయినా నాణానికి రెండోవైపులాగా ప్రతీ వారికీ సమస్యలుంటూనేవుంటాయి. ఉద్యోగం చేసుకునే ఆడవాళ్ళ సమస్యలు ఇవి.

ఇవన్నీ తాత్కాలికం. పాపాయి కాస్త పెద్దదైపోతే ఇంకేం సమస్య వుండదు. ఒక్క నాలుగేళ్ళు కళ్ళు మూసుకుంటే అది స్కూలుకి వెళ్ళిపోతుంది" అన్నాడు అబ్బాయి.

నిజమే మరి. వాడు చెప్పిందీ కరెక్టే. కాకపోతే ఆ నాలుగేళ్ళూ కళ్ళు మూసుకుని తెరిచేలోగా గడిచిపోలేదు. చాలా గడ్డుగానే గడిచాయి.

★ ★ ★

భారతికి ఏడాది నిండింది. తెలిసిన వారిని, సహోద్యోగులనూ, స్నేహితులనూ పిల్చి బ్రహ్మాండంగా పార్టీ ఇచ్చారు. చిట్టి చిట్టి అడుగులు వేస్తూ కనువిందుచేసింది భారతి.

ఆ మరుసటి రోజే సమస్య వచ్చి పడింది.

అబ్బాయిని వేరే ఊరు ట్రాన్స్‌ఫర్ చేశారు. తలపట్టుకుని కూర్చున్నారు దంపతులు ఇద్దరూ.

ట్రాన్స్‌ఫర్ వద్దనడానికి అవకాశంలేదు. అట్లా చేస్తే ఉద్యోగంలో ప్రమోషన్లు రావుట. వెళ్ళి తీరాలి. పోనీ అందరం తట్టా బుట్టా కట్టుకుని వెళ్ళడానికీ అవకాశంలేదు. కోడలి ఉద్యోగం. అబ్బాయి ఒక్కడే వెళ్ళి అక్కడ ఇల్లు తీసుకుని వంటరిగా వుండాలి. ఇంట్లో వండుకోవాలి. లేదా హోటల్లో తినాలి. వెంట నేను వెళ్దామంటే ఇక్కడ కోడలు, మనవరాలు వంటరిగా వుండాలి.

పసిపిల్లనెవరు చూస్తారు?

అక్కడ వాడు. ఇక్కడ మేము. రెండు కాపరాలు. దగ్గరా దాపూ కాదు. బస్సెక్కితే పది గంటల ప్రయాణం.

"పోనీ అబ్బాయ్ కోడల్ని కూడా ఆ ఊరే వేస్తారేమో. ప్రయత్నం చేసి చూడరాదూ! లక్షణంగా అందరం కలిసివుండొచ్చు" అన్నాను సలహాగా.

"ప్రతీసారి మనం అడిగిన చోటికి వెయ్యడానికి అక్కడ నా తాత ఎవడున్నాడు? కిందామీదా పడితే కిందటిసారి అయింది. ఇవన్నీ జరిగేవి కావులే. నేనొక్కడినే వెళ్తాను. ముందు జాయినై నేనే నెమ్మదిగా ట్రాన్స్‌ఫర్ కోసం ప్రయత్నం చేస్తాను" అన్నాడు.

మంచిరోజు చూసుకుని సామాన్లు సర్దుకుని వెళ్ళిపోయాడు అబ్బాయి. మనసులో దిగులుగా వున్నా పైకి బింకంగా సాగనంపాం నేనూ కోడలూ.

అబ్బాయి దగ్గర లేనిలోటు కొట్టొచ్చినట్లు కనిపించేది మా ఇద్దరికీ. నోటితో చెప్పలేకపోయినా భారతి కూడా తండ్రిమీద దిగులుపడి వూరికే ఏడిచి గొడవచేసేది.

అబ్బాయి దగ్గరనుండి ఉత్తరం వచ్చింది. ఆ ఊరేం బాగాలేదుట. చిన్న భాగం అద్దెకు తీసుకున్నాడుట. హోటలు భోజనం పరమ ఛండాలంగా వుంది. ఆ తిండి తింటే పది రోజుల్లో పడక పెట్టడం ఖాయం. వేరే మార్గం ఏదైనా చూడాలి అంటూ రాశాడు.

నాకు చాలా బాధకలిగింది.

కోడలి ఉద్యోగం లేకపోతే హాయిగా వాడి వెంట వెళ్ళేవాళ్ళం. పెళ్ళైన తర్వాత కూడా హోటలు భోజనం తినవలసి వస్తోందే వాడికి అనిపించింది.

మరో వారం రోజుల తర్వాత ఇంకో ఉత్తరం వచ్చింది. బ్యాంక్ వాచ్‌మెన్ కూతురు పనికి కుదిరిందిట. వంట కూడా చేసి పెడుతోంది. ప్రస్తుతానికి ఇక్కడి ఇంటి వాళ్ళే పాత్ర సామాన్లు ఇచ్చారు. ఈసారి వచ్చినప్పుడు అన్నీ తెచ్చుకుంటాను అని రాశాడు.

ఆ తర్వాత ఎవర్నో పంపిస్తే వాళ్ళద్వారా కావలసిన పాత్ర సామాన్లన్నీ పంపించాం.

నెలరోజుల తర్వాత రెండ్రోజులు శెలవు పెట్టి వచ్చాడు. ఆ రెండ్రోజులూ క్షణంలో గడిచిపోయాయి. వాడిదోవన వాడు వెళ్ళిపోయాడు.

ఆ మరుసటి నెలలో పండగలకి శెలవులు వచ్చాయి. మరో నాల్రోజులు శెలవు పెట్టింది కోడలు. భారతిని తీసుకుని ముగ్గురం ఆ ఊరు వెళ్ళాం. ఊరు వెలవెలపోతున్నట్లువుంది. పాతగా పేదగా వుంది. కళాకాంతీ లేవు. రెండు సినిమా హాళ్ళున్నాయి. గది, వంటిల్లు, ముందు చిన్నవరండా. ఇల్లు మాత్రం అద్దంలా సర్ది వుంది. వంటరిగా మగవాడు అంత శుభ్రంగా వుంచడం చాలా గొప్ప విషయం. మా అబ్బాయి వట్టి బద్ధకస్తుడు. ఇవతల పుల్లతీసి అవతల పెట్టడు. మరి ఇల్లు ఎట్లా సర్దుకుంటున్నాడా అని ఆశ్చర్యం వేసింది.

కానీ ఇల్లు సర్దడంలో వాడి ప్రమేయం కాస్తంతైనా లేదని కాస్సేపటిలోనే తెలిసివచ్చింది. చెంగుచెంగున వచ్చింది పనిపిల్ల. పేరు సీతాలు. ఇరవై ఏళ్ళుంటాయి. పెళ్ళయిందిట. పిల్లలు పుట్టలేదని మొగుడొదిలేశాడుట. అందుకే తండ్రిదగ్గరకు వచ్చేసిందిట. నల్లగా నిగనిగలాడుతూ రాతి విగ్రహంలా వుంది. మహా చురుకు. ఏ పనైనా క్షణంలో చేసేస్తుంది. వంట కూడా బాగా చేస్తుంది.

"రాత్రంతా బస్సులో పడి ప్రయాణం చేసొచ్చారు. నడుములు పడిపోయి వుంటాయి. నీళ్ళు పోసుకుని పడుకోండి" అంటూ మమ్మల్నేపనీ చెయ్యనివ్వకుండా

కూర్చోబెట్టి పనంతా క్షణాలమీద చేసేసింది. భారతిని ఎత్తుకుని ఆడించింది. వసపిట్టలా వాగుతూనే వుంది.

"సారుసారు" అంటూ అబ్బాయికి కావల సినవన్నీ చిటికెలో అందిస్తూ వుంది.

దాని వ్యవహారం మా కోడలికి ఎంతమా త్రమూ నచ్చలేదు. వెళ్ళిన మర్నాటినుండి రుసరుసలాడుతూనే వుంది. "ఇంత ఊళ్ళోనూ ఈ గజ్జెల గుర్రం తప్ప ఇంకె వరూ దొరకలేదా మీకు? అయినా వయ సులో వున్న పిల్లని ఇట్లా ఆడవాళ్ళు లేని ఇంట్లో పనికి పెట్టడానికి వాళ్ళవాళ్ళకైనా బుద్ధివుండద్దూ" అంటూ ధ్వజం ఎత్తింది.

"వెధవ ఆలోచన్లూ నువ్వూనూ! ఏదో వండిపెట్టడానికి ఈ మాత్రం మనిషి దొరి కింది కదా అని నేను ఆనందపడుతూ వుంటే అది వయసులో వుంది, వంకాయ అని పేర్లు పెడుతూ కుర్చుంటావేం? ఇది దొరక్కముందు వారం రోజులు నానా చావూ అయింది. ఆ హోటల్ గడ్డితిని జబ్బు పడ్డంత పని అయింది. ఆమాత్రం ఆలోచన నాకూ వుంది.

కుర్రాడెవడైనా దొరుకుతాడేమో అని చూశాను. ఎవరూ దొరక్కపోతే దీన్ని పెట్టాను. అయినా అదేం చేసింది? పని శుభ్రంగా చేస్తుంది. నాగాలు పెట్టదు. దొంగ బుద్ధిలేదు. ఇంకేం కావాలి? " అన్నాడు అబ్బాయి.

"పని బాగానే చేస్తోంది లెండి. దాని వ్యవహారమే నాకు బొత్తిగా నచ్చలేదు. సారూ సారూ అంటూ మీ వెంటే తిరుగు తుంది. అదేం మాయరోగం. పని చేసుకుని దాని మానాన అదిపోవచ్చు కదా! మరీ కబుర్లెందుకు? " అంది కోడలు విసురుగా!

"అదా! దానిమొహంలే. అదో వెర్రిబా గుల్ది. మొగుడొదిలేశాడుగా బ్యాంకు ద్వారా లోను దొరికితే టీ కొట్టు పెట్టుకుందామని దాని ప్లాను. అందుకే పదేపదే నన్నడు గుతూ వుంటుంది. నాతో మంచిగా వుంటే లోను ఇప్పిస్తానని ఆశ అంతే" అన్నాడు అబ్బాయి నవ్వుతూ.

అప్పటికి వూరుకున్నా మర్నాడు మళ్ళీ గొడవ అయింది. భార్యా భర్తలు కీచులాడు కున్నారు. వెంటనే సీతాల్ని తీసేయమం టుంది కోడలు.

"ఇప్పటికిప్పుడు దానికి ఉద్వాసన చెప్తే నాకిబ్బంది కదూ! నువ్వు చెప్పావు. ఆ మాట మనసులో వుంచుకుంటాను. వేరే మనిషికోసం ప్రయత్నిస్తాను దొరగ్గానే సీతాల్ని తీసేస్తాను" అంటాడు వాడు.

"ఇప్పుడు నేనింత గొడవ పెడుతుంటేనే లెక్కచెయ్యని వారు నేను వెళ్ళాక అసలు పట్టించుకోరు. నేనుండగానే దాన్ని తీసె య్యండి నిదానంగా మరోమనిషిని చూడండి. అందాకా నాల్రోజులు ఎలాగో అవస్థపడండి" అంటుంది కోడలు.

"నీ పంతం నీదేగానీ నా బాధ అర్థం కాదేం. నాకు హోటల్ తిండి పడడంలేదు. మొర్రోమంటే వినవేం! నీకంత మంటగా వుంటే ఓ పని చెయ్. ఇప్పుడే పనిమనిషిని పీకిపారేస్తాను. ఉద్యోగం మానేసి నువ్వు ఇక్కడే వుండిపో. అది వీలుగాకపోతే అమ్మని ఇక్కడ వదిలేసి వెళ్ళు" అన్నాడు అబ్బాయి.

ఇంకేమీ చెప్పలేక మండిపడింది కోడలు. ఏదో సరదాగా గడుపుదాం అని వెళ్ళిన శెల వులు చిరాకులతో గడిచిపోయాయి. తిరుగు ప్రయాణం అయ్యాం. అప్పటిదాకా కీచులా డుకున్నా ఒకర్ని వదిలి మరొకరు వుండలేక బిక్కమొహాలు వేశారు ఇద్దరూ. భార్య భర్తకీ భర్త భార్యకీ లక్ష జాగర్తలు చెప్పుకు న్నారు. కూతుర్ని ముద్దులాడాడు. ఈ వయసులోనే పిల్లల ముద్దుచేష్టలన్నీ. దగ్గ రుండి ముద్దూ ముచ్చటా చూసుకునే అదృ ష్టంలేకుండా అయిపోయింది నాకు. అను




కుని కళ్ళనీళ్ళ పర్యంతం అయ్యాడు.

ఆ ఊర్నుండి వచ్చేశాం. ఆ ప్రయాణం తర్వాత ప్రశాంతంగా సాగుతూన్న జీవితంలో అలజడి రేగిందనే చెప్పాలి. ఎంత ప్రయత్నం చేసినా అబ్బాయికి ట్రాన్స్‌ఫర్ కాలేదు. వీలు చూసుకుని నెలకోసారి వచ్చి వెళ్ళేవాడు. నాల్రోజులుండి వెళ్ళేవాడు.

వెళ్ళిన మర్నాటినుండి మళ్ళీ ఎప్పుడొస్తాడో ఈయన అని రోజులు లెక్క పెట్టుకొనేది కోడలు. వయసులో వున్న వాళ్ళు. గత్యంతరం లేక దూరంగా వుండాల్సి వచ్చింది. బాధ పడడం మినహా ఏం చెయ్యగలదు?

వాడు వస్తానన్న రోజుకి రాకపోతే మండిపడిపోయేది కోడలు.

"ఎందుకొస్తారు? పెళ్ళాం బిడ్డలమీద కాస్తంతైనా ప్రేమ వుంటేగా. ఇక్కడ మా ఖర్మానికి మమ్మల్నొదిలేసి రింగురంగామంటూ అక్కడ కూర్చున్నారు. అక్కడేం వ్యవహారం వెలగబెడుతున్నారో? వుందిగా ఆ వన్నెల విశనకర్ర. ఇక భార్య ఎందుకూ సంసారం ఎందుకూ? " అంటూ ఏవేవో వూహించుకుని హైరాన పడిపోయేది.

నా ప్రాణానికి నువ్వొకతివి అని కూతుర్ని రెండు వాయించేది. అంతటితో ఆగక ఉరుము వురిమి మంగలంమీద పడినట్లు నామీద విరుచుకుపడేది.

"మా మామగారికి కూడా ఇలాటి వ్యవహారాలేవో వుండేవట కదా! మరింకేం? ఆ తండ్రి బుద్ధులే ఈ కొడుక్కీ వచ్చాయి. మాకు ఇవన్నీ తెలీవు పెళ్ళికి ముందు. తెలిస్తే మా నాన్నగారు ఎంతమాత్రం ఈ సంబంధం చేసేవారు కాదు" అని వాపోయేది.

"ఈ ఉద్యోగం ఒకటి నా ప్రాణానికి. ఇదే లేకపోతే నేనూ వెంటే వెళ్ళేదాన్ని. సంసారం ఎప్పుడు చెట్టెక్కుతుందా అని భయం వుండేది కాదు. పోనీ ఉద్యోగం చేసి సంపాదించి సుఖపడిపోతున్నానా అంటే అదీ లేదు. లంక మేతకీ గోదావరి ఈతకీ సరి అన్నట్లు వుంది నాపని" అని ఏడిచినంత పని చేసింది.

ఆశ్చర్యం వేసింది నాకు. నాకూతురు, మొగుడిని ఎదిరించి బతకాలంటే నాకేం ఉద్యోగమా సద్యోగమా! అంటూ బాధపడి ఉద్యోగం వుంటే తన జీవితం బాగుండేది అని చెప్తే విని నిజమేకాబోలు అనుకున్నాను.

ఇప్పుడు కోడలు తన జీవితం ఉద్యోగం వల్ల చీకాకుల్లో పడిందని బాధపడుతూ వుంది. ఏమిటీవిచిత్రం అనిపించింది.

ఒకసారి అబ్బాయి వచ్చినప్పుడు కోడలు ఇలా హైరానపడి పోతోంది. దానికి కాస్త నచ్చచెప్పు. కాకపోతే జీతం నష్టంమీద అయినా శెలవు పెట్టించి నీతో తీసుకువెళ్ళు అని చెప్పాను చాటుగా.

అదేమీ చెయ్యలేదు. సరికదా భార్యని కేకలేశాడు.

దానితో నేనేదో కొడుకుకి నూరిపోస్తున్నానని అపార్థం చేసుకుని నామీద కత్తిగట్టింది కోడలు.

చీటికీ మాటికీ ఏదో పుల్లవిరుపు మాట అనడంతో నాకూ అరికాలి మంట నెత్తికి ఎక్కేది. నేను మాత్రం ఎంతకని వూరుకుంటాను. ధైర్యం తెచ్చుకుని నేనూ ఓ మాట ఎదురు చెప్పేదాన్ని.

ఫలితం. ఇంట్లో అశాంతి.

ఒకే ఇంట్లో వుండవలసిన ఇద్దరు వ్యక్తుల మధ్య పరస్పర అవగాహన లేకపోతే దానంత నరకం మరొకటిలేదు.

అలాగే రోజులు గడిచిపోతూ వున్నాయి. భారతికి రెండో ఏడు నిండింది.

ఆర్భాటాలు లేకుండా ఆడవాళ్ళని పిలిచి పేరంటం చేయించింది కోడలు.

బంగారు బొమ్మలా తయారైంది భారతి. మాటలేనా... పాటలేనా... పద్యాలేనా! కబుర్లపోగు. మా ఇద్దరినీ తన ఆటపాటలతో ఆనందపరుస్తూనే వుండేది. ఆ రోజుల్లోనే మా కోడలికి నెలతప్పింది. వేవిళ్ళు. ఇంట్లో చిన్నపిల్ల. అత్తగార్ని నేను సహాయం చేస్తున్నా అటు ఉద్యోగం, ఇటు భర్త దగ్గర లేని వంటరితనం. బాగా డీలాపడిపోయింది.

పురిటికి పుట్టింటికే రమ్మని వాళ్ళు అన్నారు. కానీ కోడలు పురుటికి వెళ్తే ఇక్కడ నేను వంటరినైపోతాను. పోనీ నేను అబ్బాయి దగ్గరకు వెళ్దామంటే ఇక్కడ ఇల్లు అన్నిరోజులు తాళంపెట్టి వుంచాలి. దొంగల భయాలు. ఇవన్నీ ఆలోచించి పురిటికి ఇక్కడే వుండిపోవాలని నిర్ణయించారు. ఆ సమయానికి ఎవరో సహాయం వస్తారు. అబ్బాయి ఎలాగూ వస్తాడు. ఏమీ సమస్య వుండదు అనుకున్నారు.

మనస్పర్థలు పక్కనపెట్టి కోడలికి పళ్ళూ, పాలు అమరుస్తూ జాగ్రత్తగా చూసుకునే దాన్ని నేను. నేను కన్నతల్లిలా చూసుకుంటున్నానని ఆనందపడేది కోడలు. నెలలు నిండాయి.

కాన్పు కొంచెం కష్టం అయింది. మగపిల్లవాడు పుట్టాడు. పన్లోపనిగా మళ్ళీ పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ కూడా చేయించుకుంది కోడలు. తల్లీ, పిల్లవాడు ఆరోగ్యంగానే వున్నారు.

ఇంటికి వచ్చాక నెలకి ఒకరోజు తక్కువ చేసి నామకరణం చేశారు. బంధువులు అందరూ వచ్చారు. వేడుకగా జరిగింది అంతా.

ఆ మర్నాడే అబ్బాయి బయలుదేరి వెళ్ళిపోయాడు. మళ్ళీ నేనూ కోడలు, పిల్లలు.

కోడలు ఇంట్లో వున్నంతసేపూ ఫర్వాలేదు గానీ అది బాంక్‌కి వెళ్ళడం ప్రారంభించాక నాపని బాగా ఎక్కువ అయింది. ఇద్దరు పిల్లలతో సతమతం అయ్యేదాన్ని. అంతచేసినా కాస్త అటూ ఇటూ అయ్యేసరికి కోడలు చిరాకుపడిపోయేది.

అటువంటి సమయాల్లో నాకు చివుక్కుమనేది. ఏమిటి నా దురదృష్టం. ఆనాడు అత్తగారి చేత మాటలు పడ్డాను. చాకిరీ చేస్తూనే ఈనాడు కోడలిచేతా మాటలు పడుతున్నాను అని బాధపడేదాన్ని. ఎలాగో రోజులు గడిపేదాన్ని.

మనవడికి ఆరో నెల నడుస్తూవుండగా అబ్బాయికి ట్రాన్స్‌ఫర్ అయింది. నా ప్రాణం లేచి వచ్చింది.

అబ్బాయి వచ్చేశాడు. మళ్ళీ ఇంట్లో మామూలు వాతావరణం ఏర్పడింది. అబ్బాయికి పిల్లలతో ఆడుకునే అవకాశం, పిల్లలకి తండ్రితో గడిపే అవకాశం కలిగాయి.

కోడలు కూడా నిశ్చింతగా వుందేమో మనిషి కాస్త కోలుకుంది. మనవడు తప్పటడుగులు వేస్తున్నాడు.

అరిసెలు చేద్దాం అనుకున్నాను, "బియ్యం నీళ్ళల్లో పొయ్యండి. సాయంత్రం నేను వచ్చాక పిల్లల్ని ఆయనకి అప్పగించి మనిద్దరం కలిసిచేద్దాం" అంది కోడలు. వీలైతే మధ్యాహ్నం లంచ్ టైంలోనే వచ్చేస్తాను అని చెప్పింది.

తీరాచూస్తే పదకొండింటికి భార్యాభర్తా హడావిడిగా వచ్చేశారు. అబ్బాయి మొహం జేవురించి వుంది. నాకు భయం వేసింది. ఏమిట్రా అని అడిగాను.

'పెద్దన్నయ్యకి సీరియస్‌గా వుందిట ట్రంకాల్ చేశారు' అన్నాడు కళ్ళనీళ్ళ పర్యంతం అవుతూ.

కాళ్ళూచేతులూ ఆడలేదు నాకు "అదేమిట్రా మొన్ననేగా పిల్లాడి నామకరణానికి వచ్చి వెళ్ళాడు. ఇంతలోనే ఏం ముంచుకొచ్చిందిః" అని అడిగాను.

"ఆ వివరాలేమీ తెలియలేదు. హాస్పిటల్లో వున్నారుట. వెంటనే బయలుదేరి వెళ్ళాలి మీరు" అంటూ బట్టలవీ సర్దింది కోడలు.

హుటాహుటీన బయలుదేరివెళ్ళాం.

మేం వెళ్ళేసరికి ప్రమాదంగానే వుంది పరిస్థితి. స్పృహలేదు. ఏదో ఇంగ్లీషు జబ్బు పేరు చెప్పారు డాక్టరు. గంటల్లో వుంది అన్నారు.

కబురు అందుకుని అక్కచెల్లెళ్ళు వచ్చేశారు. తమ్ముడూ, కొడుకూ ఊళ్ళోనే వున్నారు.

హాస్పిటల్ వాళ్ళు పో... పో అంటున్నా వినకుండా అందరం అక్కడే పడిగాపులు పడుతూ కూర్చున్నాం. అర్ధరాత్రికి స్పృహ వచ్చింది. అందర్నీ గుర్తుపట్టి ఆదరంగా పలకరించాడు. ఇక తిప్పుకున్నాడేమో అనుకున్నాను. కానీ ఆ తెల్లవారుజామునే ప్రశాంతంగా కళ్ళు మూశాడు.

మా నాన్న చచ్చిపోయినప్పుడు ఏడవలేదు. నా భర్త పోయి వైధవ్యం ప్రాప్తించినప్పుడూ ఏడవలేదు. అమ్మపోయినపుడూ ఏడవలేదు. కానీ సవితి కొడుకు పోయినపుడు మాత్రం వెల్లువలా పొంగుకొచ్చింది దుఃఖం

అబ్బాయి కుళ్ళికుళ్ళి ఏడిచాడు. "దిక్కులేని వాడిని అయిపోయానే అమ్మా" అంటూ నన్ను కావిలించేసుకున్నాడు.

వాడి మంచీచెడ్డా అన్నీ చూసింది పెద్దబ్బాయే. తండ్రిని ఎరగనే ఎరగడు. అన్నింటికీ అండగావున్న మనిషి పోతే ఆ బాధ భగవంతుడికి ఎరుక.

తెల్లవారేసరికి వచ్చింది నా కూతురు. ఒకటే ఏడుపు.

తెల్లవారాక ఇంటికి తీసుకువచ్చారు.

ఇంట్లోవారే కాక అతడి మరణానికి ఊళ్ళో వాళ్ళు కూడా బాధపడ్డారు. పుట్టిపెరిగిన ఊరు. అందరూ పరిచయస్తులే. బోలెడంత మంది వచ్చారు పరామర్శకి. తండ్రి అంతా అస్తవ్యస్థం వ్యవహారంగా చేసిపోయినా పరిస్థితులను ధైర్యంగా ఎదుర్కొని అంతా సమర్థించి సంసారాన్ని గట్టున చేర్చాడని పొగిడారు.

వాళ్ళమాటల్లో ఏమాత్రం అతిశయోక్తి లేదు. "తన చేతికి పెత్తనం వచ్చేనాటికి ఎంత అగమ్యగోచరంగా వుండేదో అందరికీ తెలుసు. తాతమ్మని, నాయనమ్మని, సవితి తల్లిని, సవితి తమ్ముడిని, చెల్లెలిని, తన పిల్లలని ఇంతమందినీ ఆదరించిన మహానుభావుడు" అని పొగిడారు.

మధ్యాహ్నానికి అంతా ముగిసిపోయింది. ఉద్యోగాలు చేస్తున్నవారంతా మళ్ళీ పదోరోజుకి వస్తాం అని చెప్పి ఆ సాయంత్రం ప్రయాణం కట్టారు. వీలైన వాళ్ళు వుండిపోయారు.

పదోరోజుకి మళ్ళీ అందరూ వచ్చారు.

అర్హత పొందినదాన్ని కాబట్టి ఆ తెల్లవారుజామున తతంగానికి చాకలిదానికి సాయంగా నేనే నిలబడ్డాను. క్రతువులన్నీ ముగిసి మొహం చూసేసరికి అపరాహ్నం అయింది. అందాకా కోడలికి మజ్జిగా, మంచినీళ్ళూ నేనే అందించాను.

"అత్తయ్యా నాకేవిటో దిగులుగా వుంది. మరో పదిరోజులు వుండి వెళ్ళరాదూ" అంది కోడలు దీనంగా.

"వుండడానికైనా, వెళ్ళడానికైనా స్వతంత్రురాలిని కాదు కదా! అబ్బాయినీ, కోడల్నీ అడిగి చెప్తాను" అన్నాను.

అబ్బాయినీ, కోడల్నీ అడిగితే, "మేము ఏదోవిధంగా సర్దుకుంటాం. వదినకి సాయంగా వుండు కొన్నాళ్ళు" అన్నాడు అబ్బాయి.

కోడలూ ఆ మాటే అంది. "అవసరానికి కాకపోతే ఇంకెప్పుడుంటారు? నెల




మానికం దాటేదాకా వుండండి" అని చెప్పింది.

పదమూడోరోజు ఆశీర్వచనం అయ్యాక అందరూ ఎవరిదారిన వాళ్ళు వెళ్ళారు.

కోడలూ, పెద్దబ్బాయి కొడుకూ, కోడలూ, పిల్లలూ, నేను మాత్రం వున్నాం ఇంట్లో.

నేనూ, కోడలూ ఒక గదిలో పడుకునే వాళ్ళం. ఆవిడకీ ఆరోగ్యం పాడైపోయింది. మోకాళ్ళనెప్పులు. డాక్టరుకి చూపిస్తే మందులిచ్చాడుట. వాడినా అంత గుణం కనిపించలేదుట. "శారీరక బాధలైతే మందో, మాకో వేసుకుంటే అంతా కాకపోతే కొంత యినా తగ్గుతాయి. కానీ మానసికంగా వుండే బాధలు దేనికి లొంగుతాయి చెప్పండి? " అంది.

"అంత కుంగదీసే బాధలేమున్నాయి మీకు? " అని అడిగాను.

"చెప్పుకుంటే సవాలక్ష వున్నాయి. ఏముంది ప్రతీ ఇంట్లోనూ వుండే సమస్యలే మాకూనూ" అంటూ మొదలుపెట్టి చెప్పుకొచ్చింది.

కొడుకుది సుమారైన ఉద్యోగం. సంపాదన బాగానే వుంటుంది. స్వంత ఇల్లు. ఏదోకాస్త పొలం వుంది. అతడికి ముగ్గురు పిల్లలు.

కూతురికి పెళ్ళి అయింది. దాని మొగుడిదీ ఉద్యోగమే. దానికి పొలాలవీ బాగానే వున్నాయి. దానికి ఇద్దరు కొడుకులు. ఏదో పుట్టింటికి వస్తే పసుపూ, కుంకం తప్ప ఇంకేమీ ఆశించే స్థితిలో లేదు.

కొడుక్కీ, కోడలికీ అసంతృప్తిట. అందరికీ అన్నీచేసి తమకేమీ మిగల్చలేదు తండ్రి అని కోపంట. వున్నదానిలో మిగులుస్తారు గానీ లేనిది ఎక్కడ తెస్తారు?

"ఇల్లన్న తర్వాత తోబుట్టువులు రారా? ఊళ్ళోనే బాబాయి కూడా వున్నాడుగా. వాళ్ళింటికి పోకూడదా అని సణిగేవాడు. మరి ఆడపిల్లలకి ఈయనంటే అభిమానం ఎక్కువ. ఇక్కడే దిగేవారు. రెండ్రోజులుండి వాళ్ళదారిన వాళ్ళు వెళ్ళేవాళ్ళు. మాకు కలిగితే చీర పెట్టేవాళ్ళం. చేతులో లేకపోతే జాకెట్టు గుడ్డతో సరిపెట్టేవాళ్ళం. వాళ్ళూ ఏమీ అనుకునేవాళ్ళు కాదు.

అయినా ప్రేమతో వస్తారుగానీ పెట్టు కోసం వస్తారా ఎవరైనా? వాళ్ల పిల్లలు కూడా పెద్దమామయ్య అంటూ వచ్చి తొంగి చూసి పోయేవారు. చుట్టాలతాకిడీ ఎక్కువై పోయిందని కోడలి సణుగుడు. డబ్బు ఖర్చు అయిపోతోందని కొడుకు బాధ.

"ఇప్పటికీ వంటపని నేనే చేస్తాను రెండు పూటలా. పై పని చెయ్యడానికే అంత ఆయాసపడిపోవాలా? ఇక ఖర్చంటారా ఇలాంటి పై ఖర్చులన్నీ ఆయనే చూసుకునే వారు. 'ఇదుగో చూడు. పొలంలో పండిన బియ్యం వున్నాయి. అన్నం వండి ఇంత పప్పుపులుసు పెట్టు. దొడ్లో అరటికాయలు కోసి కూరొండి అన్నం పెట్టు చాలు. వాళ్ళకేం తిండికి లేక మనింటికి రాలేదు. వూరికే అవి తే, ఇవి తే అని అబ్బాయిని సతాయించకు. బజార్లో అన్నీ ధరలు మండిపోతున్నాయి వాడికి భారం అవుతుంది' అనేవారు. ఇక ఆర్థికంగా వాడిమీద పడిన భారం మాత్రం ఏముంది? వూరికినే ఏదో ఊహించుకుని హైరానా పడిపోవడం తప్ప.

ఏదో అట్లాగే కాలం జరిపేస్తూ వుండే వాళ్ళం.

"మనవరాలు పెళ్ళీడుకి వచ్చింది. దాన్ని మేనత్త కొడుక్కి ఇద్దామని అనుకున్నారు. మీ అబ్బాయినే రాయబారం పంపించారు. ఈయన వెళ్ళి అడిగితే వాళ్ళు కాదన్నారుట. అమ్మాయికీ, అల్లుడికీ అభ్యంతరం లేదు గానీ అసలువాడే వద్దన్నాడుట. రక్తసంబంధీకులని పెళ్ళిచేసుకోకూడదు తాతయ్యా అంటూ చెప్పుకొచ్చాడుట. వాడికే ఇష్టం లేకపోతే ఈయనేం చేస్తారు. సరే మీ ఇష్టం అని తిరిగి వచ్చారు.



"అది వీళ్ళకు కోపం. నచ్చచెప్పి ఒప్పించాలిట. ఒకరికి చెప్పి ఒప్పించే రోజులా అత్తయ్యా ఇవి. మనం చెప్తే వాళ్ళు వింటారా? ఊళ్ళో అందరికీ అయితే నెత్తినేసుకుని వ్యవహారాలు జరిపిస్తారు. నా కూతురి పెళ్ళి కుదర్చలేకపోయారు. మీరు గట్టిగా చెప్తే వాళ్ళెందుకు కాదంటారు అని అబ్బాయి వాదన. వాళ్ళొద్దంటే తిట్టికొట్టి పెళ్ళిచేస్తారా? అప్పటికీ చెప్పేతీరున చెప్పారు. వాళ్ళు విన్లేదు.

"అయినా దీనికేం కన్నొంకరా? కాలొంకరా? బయట సంబంధం వెతకచ్చుకదా" అన్నాం.

"బయటివాళ్ళకైతే కట్నాలు పొయ్యద్దా! నాకేం ఆస్తులు కూడగట్టి ఇచ్చారా మీరు" అని అదో రభస.

"ఆస్తిలేని వాళ్ళు పెళ్ళిళ్ళు చెయ్యడం లేదుట్రా నీ పిచ్చిగానీ. నీకున్న ఒక్క కూతురికీ పెళ్ళి చెయ్యలేక పోతావా? ప్రయత్నం మొదలుపెట్టు" అన్నారు ఈయన.

"పెళ్ళి కుదిరింది. ఎకరం పొలం అమ్మాం.. పెళ్ళిచేసి పంపించాం. అంతటితో అవదు కదా! పండగలూ, పబ్బాలూ, పురుళ్ళూ, పుణ్యాలు. అప్పుడు కాస్తా ఇప్పుడు కాస్తా చేసిన అప్పు చాలా పేరుకుపోతోంది. బోలెడంత వడ్డీలు కట్టాల్సివస్తోంది అని బాధపడుతుంటే ఇంకో ఎకరం అమ్మేశారు.

"మిగిలింది రెండెకరాలు. దానిమీద వచ్చే ధాన్యం ఏడాది అంతా ఇంటిల్లిపాదికీ సరిపోతుంది. ఇంకా మిగిలిన ధాన్యం అమ్మి పైఖర్చులకు వాడుకునేవారు ఆయన.

"మనవడికి అదేవిటో చదువుట. దానిలో సీటు వచ్చిందట. అది చదవాలంటే బోలెడంత డబ్బు కావాలిట. వాళ్ళ దగ్గరలేదుట. అందుకని ఆ పొలంకాస్తా అమ్మేస్తే అటు పిల్లాడిని చదివిస్తూ పన్లోపనిగా పాతపడిపోయిన ఇల్లు బాగు చేయిస్తారుట.

ఆ ఆలోచనకి ఈయన ఎంతమాత్రమూ ఒప్పుకోలేదు.

"అసలే అంతంతమాత్రం సంసారం. ఆమాత్రం తిండిగింజలు వస్తూ వుంటేనే బొటాబొటీగా గడుస్తోంది. ఆ పొలం కూడా అమ్మేస్తే మరీ కటకటలాడిపోతాం అన్నారు. అదీగాక బతికుండగానే అంతా వాళ్ళచేతుల్లో పెడితే నా బతుకేం కావాలి? పైస పైసకీ వాడిదగ్గర చెయ్యి జాపవద్దా. ఇంత బతుకూ బతికి ఈ చివరిరోజుల్లో కొడుకు దగ్గర అర్థించలేను. నా బొందిలో ప్రాణం వున్నన్నాళ్ళూ ఆ పొలం అమ్మే మాట ఎత్తవద్దు. నా తర్వాత మీ ఇష్టం" అని ఖచ్చితంగా చెప్పేశారు.

"దాంతో వాళ్ళు బాగా మనసు కష్టపెట్టుకున్నారు. అంటీముట్టనట్లు వుండడం మొదలుపెట్టారు.

డబ్బుకోసం కన్నబిడ్డే పరాయివాడిలా ప్రవర్తిస్తుంటే మనసుకి కష్టం కలగదూ!

పోనీ ఆడపిల్ల తనైనా మనసువిప్పి మాట్లాడదాం అనుకుంటే వీళ్ళకి దానితోనూ విరోధమే. పిల్లని చేసుకోలేదని కోపం. ఒకటిరెండుసార్లు అది వచ్చినప్పుడు మొహాలు మొటమొటలాడించుకుంటూ తిరిగారు. దాంతో ఒళ్ళుమండి అదీ రాకపోకలు బాగా తగ్గించింది.

"ఏమిటోలెండి అత్తయ్యా! మన రోజుల్లో అన్నదమ్ములకీ అక్కచెల్లెళ్ళకీ సవాలక్ష గొడవలు వచ్చినా ఏదో అప్పటికి ఓ మాటా మాటా అనుకునేవాళ్ళం. తర్వాత మళ్ళీ కలిసిపోయేవాళ్ళం. ఈ వరసన పంతాలకి పోయి రక్తసంబంధాలు తెగ్గొట్టుకోవడం ఏమిటో ఎరగం. కరవమంటే కప్పకికోపం వదలమంటే పాముకి కోపం.

"ఇదంతా చూస్తూ బాగా కృంగిపోయారాయన. ఇక నాకు జీవితం మీద ఇచ్ఛ చచ్చి

పోయింది. నా స్టేషనేదో త్వరగా వచ్చేస్తే బావుండును. దిగి చక్కాపోతాను అనుకునే వారు. చూస్తుండగానే ఆయన స్టేషను రానే వచ్చింది. దిగి చక్కాపోనూపోయారు" అంటూ కొంగులో మొహం దాచుకుని ఏడిచింది పెద్దకోడలు.

నాకూ బాధవేసింది. "ఏమిటో ఎప్పుడూ ఇతరుల గురించి ఆలోచిస్తూ, అందరి మంచికోరే మనిషికి ఆ సమస్యలు ఏమిటో? ఏనాడూ పైకి కనిపించేవాడు కాదు. లోలోపల ఇంతబాధ పడ్డాడన్న మాట? " అన్నాను.

"ఆయన మహారాజు వెళ్ళిపోయారు. ఇక నేనేమవుతానో అనే దిగులుగా వుంది అత్తయ్యా! ఆ వున్న రెండెకరాలూ రేపీపాటికి అమ్మేస్తారు. నాకంటూ చిల్లిగవ్వలేదు కదా! ఉద్యోగాలు చేసేవాళ్ళకైతే వాళ్ళు పోయాక కూడా భార్యకి పింఛను ఇస్తారుట. మరి మన్లాటి వాళ్ళకు ఆ సదుపాయం లేదు.

"చేతులో రెండెకరాల పొలం వుండి, ఇంటి యజమాని అనే ముద్రవుండీ, అన్నీ తెలిసిన మగవాడు ఆయనకే జరగడం కష్టం అయిపోయింది కదా! మరి ఏ అధికారమూ, ఏ ఆస్థీలేని నా గతి ఏమిటా అని భయం వేస్తోంది. ఇంతకాలం భర్తచాటు భార్యగా గడిపేశాను. ఇకమీదట వంటరిజీవితం గడపాలి.

నా స్టేషనొచ్చేదాకా సీట్లో కూర్చునే అదృష్టం అయినా నాకుంటుందా ? లేక మధ్యలోనే కిందికి తోసేయబడతానో ఆ భగవంతుడే నిర్ణయించాలి" అంది దీనంగా.

అంతా వింటూ వుంటే నాకూ దిగులు వేసింది. నా భర్త పోయిన తరువాత ఆస్థి వాటాల విషయంలో చాలా తర్జనభర్జనలు పడ్డారు. ముందు రెండుభాగాలు చేసి పెద్దావిడ పిల్లలకి సగం, రెండోదాన్నైన నా పిల్లలకి సగం అన్నారు. అది కాదని మూడు వాటాలు వేసి ముగ్గురు కొడుకులకీ అన్నారు. పెళ్ళైన ఆడపిల్లలకి పసుపుకుంకాలకనికొంత ఇచ్చారు. పెళ్ళికాని నా కూతురుకీ కొంత ఇచ్చారు పెళ్ళి ఖర్చులకి. మరి నాకంటూ ఏమీ ఇవ్వనేలేదు. నేనూ అడగలేదు. అడగాలని ఆలోచనైనా రాలేదు.

అసలు నాకే కాదు ఏ ఆడదానికైనా వండి పెట్టే కార్యభారమే తప్ప ఆస్థిలో వాటా ఎక్కడుంది? ఎవరికి వుంది. బతికున్నంత కాలం భర్తచాటున, ఆ తర్వాత కొడుకు చాటున.

కొడుకూ, కోడలూ మంచివాళ్ళే నేనూ నాకు చాతయినంత పనిసాయం చేస్తాను. తిండీ, బట్టా జరిగిపోతోంది. కానీ ఖర్మకాలి పరిస్థితులు వికటిస్తే నాపని ఏం కావాలి? చేతిలో నయాపైసా లేదే? జీవితం ఎట్లా వెళ్ళమారుతుంది?

తల్చుకుంటే వెన్నులోంచి వణుకు పుట్టుకొచ్చింది. అంతలోనే మా అమ్మ గుర్తొచ్చింది. ఫర్వాలేదు. ఆవిడే బతుకు లాగేసింది. నేను లాగలేనా? ఆవిడకి ఒంటిమీద చిన్న మెత్తు బంగారంలేదు. నాకు రెండు పేటల గొలుసు వుంది. చేతులకి రెండుజతల గాజులున్నాయి. అవసరం అయితే అవి అమ్ముకుని వాడుకుంటాను. అని ధైర్యం తెచ్చుకున్నాను.

నెలమాసికం వెళ్ళేదాకా వుండి మా ఊరికి ప్రయాణం కట్టాను. నేను లేనప్పుడు మా వియ్యపురాలు వచ్చి వుండి మనవరాల్నీ, మనవడినీ చూసుకుంది. నన్ను చూడగానే ఆవిడ మొహం చింకి చేటంత అయింది. అమ్మయ్యా వచ్చేశారా? ఇక నేను వెళ్తాను. ఇంటిదగ్గర ఆయనేం ఇబ్బంది పడుతున్నారో అంటూ ఆ సాయంత్రమే బయలుదేరి వెళ్ళిపోయింది.

  

మరో రెండు నెలలు గడిచాయి. ఒక



రోజు అబ్బాయి ఒక ప్రస్తావన తెచ్చాడు. "ఇన్నాళ్ళూ పెద్దన్నయ్య వుండేవాడు. వాళ్ళ పొలంతోపాటు మన ఎకరం పొలమూ చూసేవాడు. ఇప్పుడు పరిస్థితులు మారాయి. కాబట్టి ఆ పొలం అమ్మేస్తే మంచిది అనిపిస్తోంది. ఈ ఊళ్ళోనే ఒక స్థలం చూశాను. నాకు లోన్ దొరుకుతుంది. అదీ ఇదీ కలిపితే ఇల్లుకట్టుకోవచ్చు స్వంత ఇల్లు అమరుతుంది. అద్దె ఇళ్ళకోసం వెదికే శ్రమ తప్పుతుంది" అన్నాడు. మంచి బేరం చూసి పొలం అమ్మమని ఉత్తరం రాశాడు. మరో రెండు నెలల్లో మంచి బేరం దొరికింది.

పొలం అమ్ముడయింది. నాలుగుతరాల కిందట వాళ్ళ ముత్తాతగారు సంపాదించిన ఆస్తి డబ్బురూపంలో మునిమనుమడి చేతికి వచ్చింది. ఆ మాటే అంటే అబ్బాయి నవ్వాడు.

"ఆ ఆస్తి ఇల్లుగా రూపాంతరం చెందుతోంది. ఈ ఇంటిని నా మునిమనవడు అమ్ముకుని ఇట్లాగే అనుకుంటాడేమో" అన్నాడు.

శంఖుస్థాపన జరిగింది. ఇల్లు కట్టి చూడు, పెళ్ళిచేసి చూడు అన్న సామెత వుండనే వుంది. ఇల్లుకట్టడం అంటే మాటలా ఎన్ని చూసుకోవాలి? భార్యా, భర్తా అమితోత్సాహంతో అన్నీ స్వయంగా చూసుకుంటూ తమ తమ ఆలోచనలూ, ఊహలూ కార్యరూపంలో పెట్టి ఇంటిని ర్మాణం పూర్తి చేయించారు.

ఇల్లు చూడముచ్చటగా తయారయింది. పొలం అమ్మిన డబ్బు, బాంకు వాళ్ళిచ్చిన అప్పు చాలక మరికొంత అదనంగా కావలసి వచ్చిందట. ఎలాగో సర్దుబాటు చేశారుట. మొత్తానికి ఇల్లుకట్టేసి మా అబ్బాయి నిజంగా ఓ ఇంటివాడయ్యాడు.

ఘనంగా గృహప్రవేశం జరిగింది. మేం కొత్త ఇంట్లో ప్రవేశించాం. అద్దె ఇల్లు ఖాళీ చేసి స్వంత ఇంటికి మారిపోయాం. మన ఇల్లు అనే భావనే ఎంతో తృప్తిని కలిగి స్తుంది మనసుకి. ఇంటిచుట్టూ ఖాళీ స్థలం వుంది. మొక్కలు తెప్పించి వేయించారు. ఇంటికి తగినట్లు కొత్తకొత్త సామాన్లు కొన్నారు. మెరిసిపోతోంది ఇల్లు.

స్వంతిల్లు ఊరికి చివరగా వుంది. కాబట్టి బాంకుకి బాగా దూరం అయింది. సిటీబ స్సులో వెళ్ళాలి. సిటీబస్సుల సౌకర్యం అంతగా వుండేదికాదు. కాబట్టి సౌకర్యార్ధం స్కూటరు కొనుక్కున్నారు. అన్నీ కొని అంతా చేసేసరికి ఆర్ధికంగా కాస్త ఇబ్బంది మొదలు అయింది.

అప్పుడు మనవరాల్ని కాన్వెంటులో చేర్పించారు. వేలెడు పిల్లకీ బోలెడంత ఖర్చు ·ఫీజులు, పుస్తకాలు, డ్రస్సులు, బూట్లు, రిక్షా ఒకటా చెప్తూపోతే ఎన్నెన్ని. జీతాల్లో సగానికి పైగా కోతలు పోతు న్నాయి. మిగిలినది కటాకటీ బొటాబొటీ అని బాధపడేవారు దంపతులిద్దరూ.

ఖర్చులు తగ్గించడం అసంభవం. ఎంతచె ట్టుకి అంత గాలి. హోదాకి తగినట్లు బత కాలి. మంచిబట్టలు కట్టుకోవాలి. సినిమా లకీ షికార్లకీ వెళ్ళాలి. క్లుప్తంగా వుండాలంటే కుదరదు. పీనాసి వాళ్లని నలుగురూ నవ్వి పోరూ!

ఆ పరిస్థితుల్లో పులిమీద పుట్రలాగా కోడ లికి మరో ఊరికి ట్రాన్స్ఫర్ అయింది. వెళ్ళకపోతే ప్రమోషన్లు వుండవట.

"అంతదూరం ఒక్కతివీ ఎలా వెళ్తావు? ఇక్కడ నాకూ ఇబ్బంది. అనవసరంగా కష్టా లపాలు అవుతాం. ప్రమోషన్ వద్దని రాసి ఇచ్చెయ్. ఇక్కడే వుంచుతారు" అన్నాడు అబ్బాయి. అలాగే అంది కోడలు.

ఆ ప్రకారమే చేసిందిట. ట్రాన్స్ఫర్ ఆగి పోయింది. తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాం అందరం.

భారతి కాన్వెంటుకి అందరిలోనూ ప్రప్రధమురాలిగా వుండేది. చదువులో, ఆటల్లో అన్నింటా అదే ఫస్టు. టీచర్లందరూ ఎంతో అభిమానించేవారు. బాబు కూడా స్కూల్లో చేరాడు. పిల్లలిద్దరూ స్కూళ్ళకి వెళ్ళిపోవడంతో నాకు బోలెడంత తీరిక.

అందరూ ఎవరిదారిన వాళ్ళు వెళ్ళాక పని మనిషి వస్తే పనిచేయించి, ఇల్లంతా సర్ది, కాసేపు విశ్రాంతి తీసుకుని తోటలో కాసేపు పనిచేసేదాన్ని. మొక్కలకి నీళ్ళు పెట్టడం, గొప్పులు తవ్వడం, ఓ గంటసేపు పని కల్పించుకుని కాలక్షేపం చేసేదాన్ని. ఎంతచే సినా ఏమిటో పొద్దుపోనట్లు ఖాళీగా వున్నట్లు అనిపించేది. ఏమిటో జీవితం శూన్యంగా, స్తబ్దంగా మారినట్లు అనిపిం చేది.

ఆ రోజు నా జీవితంలో మర్చిపోలేని రోజు. ఆవేళ స్కూళ్ళకి శలవు. మధ్యాహ్నం వూరికే పడుకుని వున్నాను.

"మామ్మా!" అంటూ వచ్చింది భారతి. చేతిలో పుస్తకం.

"మామ్మా! ఇదేమిటో నాకర్థం కావడం లేదు. కాస్త చదివి చెప్పు" అని అడిగింది.

చచ్చేంత నవ్వొచ్చింది నాకు. "నాకు చదువురాదే తల్లీ. నేనేం చెప్తాను. సాయంత్రం అమ్మ వచ్చాక అడుగు" అన్నాను.

కళ్ళింత చేసుకుని ఆశ్చర్యంగా చూసింది. "అదేమిటి మామ్మా! ఇంత పెద్దదానివి నీకు చదువురాదా? " అని అడిగింది.

"రాదే తల్లీ!" అని చెప్పాను.

"మరి నా అంత వున్నప్పుడు నువ్వు స్కూలుకి వెళ్ళలేదా? "అని అడిగింది మళ్ళీ.

"ఆ రోజుల్లో ఆడపిల్లలం స్కూలుకి వెళ్ళే వాళ్ళం కాదమ్మా" అని చెప్పాను.

"మరి స్కూలుకి వెళ్ళకపోతే ఏం చేసే వారు? " అని అడిగింది.

దగ్గర కూర్చోబెట్టి అన్నీ వివరంగా చెప్పాను. అంతా శ్రద్ధగా వింది.

"మరి చదువు లేకపోతే నువ్వెలా మేనేజ్ చేస్తున్నావు? " అని అడిగింది. తిండీ, నీళ్ళూ లేకపోతే నువ్వెలా బతుకుతున్నావ్ అనే ధోరణిలో.

"ఏమోనే తల్లీ. ఇన్నాళ్ళూ గడిచిపోయింది. నాకు చదువు రాకపోతేనేం. మీకందరికీ వచ్చుగా" అన్నాను.

"ఛా మామ్మా మేమందరం అన్నం తింటే నీకు అన్నం అక్కర్లేదా! అసలు చదువు రాకుండా ఎలా వున్నావు మామ్మా" అని బోలెడంత బాధపడిపోయింది. దీర్ఘంగా ఆలోచించింది.

"పోనీ ఓ పని చెయ్. ఇప్పుడు చదువుకో అంది హఠాత్తుగా.

తెల్లబోయాను. తర్వాత చచ్చేంత నవ్వొచ్చింది. "చాల్లే వూరుకో. అవ్వని పట్టుకుని వసంతం ఆడాడుట వెనకటికి ఎవడో. ఈ వయసులో నాకు చదువేమిటే" అన్నాను.

"ఏం వయసెంతైతే ఏమిటి చదువురాదు. కాబట్టి చదువుకోవాలి. అంతే" అంది మొండిగా.

"సరే అయితే మీ డాడీకి చెప్పి నాక్కూడా పుస్తకాలు కొనిపెట్టి, నీలాగే గౌను కుట్టించమను. నీతోబాటు రిక్షాలో స్కూలుకి వస్తాను" అన్నాను.

"స్కూలుకి వద్దులే. ఇంద పెద్ద అమ్మాయివి స్కూలుకి వెళ్తే అందరూ నవ్వుతారు. ఇంట్లోనే నేర్చుకో. నేను నీకు చదువు చెప్తా" అంది ఆరిందాలాగా నడుమున చెయ్యి పెట్టుకుని.

"సరే అలాగే నేర్పు" అన్నాను ఆటగా తీసేస్తూ. కానీ అది మాత్రం వెంటనే పలకా, బలపం పట్టుకుని తయారైపోయింది. "ఇదుగో రాయి, అ... ఆ..." అంటూ పలకమీద రాసి ఇచ్చింది.

ఇదెక్కడి గొడవే తల్లీ. నావల్లకాదు. నన్నొదిలి పెట్టవే అంటే విన్లేదు. "నేను నేర్పుతాను అంటూ వుంటే నేర్చుకోవడానికి నీకేం కష్టం. నాల్రోజులు చదువుకుని చూడు. రాకపోతే అప్పుడే మానెయ్" అంది పట్టుబట్టి. "సరేకానీ ఇటు తే" అని పలక అందుకున్నాను.

అందరూ అయిదవ ఏట అక్షరాభ్యాసం చేసుకుంటే నేను నా యాభై ఏళ్ళ వయసులో పలక పట్టుకున్నాను. మొదట్లో వేళ్ళు వంగలేదు. బలపం పట్టుకోవడమే కష్టం అయింది. రెండుసార్లు దిద్దేసరికి అలవాటు అయింది. మరో నాలుగైదుసార్లు దిద్దేసరికి వచ్చేశాయి. పలక వెనక్కి తిప్పి చూడకుండా రాసి చూపించాను.

బోలెడంత ఆనందపడిపోయింది నా గురువుగారు. "చూశావా మరి రాదన్నావుగా ఎలా వచ్చిందో చూడు. వెరీ గుడ్" అంటూ నన్ను ముద్దుపెట్టుకుంది. నేనూ మా మాస్టరమ్మని ముద్దు పెట్టుకున్నాను.



మా సరదా చూసి మనవడు పరిగెట్టుకొచ్చాడు. ఏవిటేవిటని అడిగాడు. విషయం తెలుసుకుని నేనూ నేర్పుతా మామ్మకి... నేనూ నేర్పుతా అని పేచీ పెట్టాడు. వీల్లేదంది నా మాస్టరమ్మ. దాంతో కోపం వచ్చి దొర్లి ఏడవడం మొదలుపెట్టాడు. ఏం చెయ్యాలో తోచలేదు నాకు. వాడిని బుజ్జగించి, బతిమాలి 'పోస్లే నువ్వూ నేర్పు నువ్వు ఏ బీ సీ డీలు నేర్పు అని సముదాయించాను.

దాంతో ఏడుపు ఆపి ఏ బి రాసి ఇచ్చాడు. వాడికోసం అవి కూడా దిద్దాను. తెలుగు అక్షరాలకన్నా మరింత సులభంగా వచ్చేశాయి అవి.

"నేనూ నేర్పేశా... నేనూ నేర్పేశా" అని గంతులు వేశాడు వాడు.

ఆ సాయంత్రం వాళ్ళ అమ్మానాన్నా రాగానే సంబరంగా చెప్పేశారు ఇద్దరూ వంతులు వేసుకుని.

"ఇద్దరూ కలిసి మామ్మని విసిగిస్తున్నారా? మధ్యాహ్నం పడుకోనీయకుండా అల్లరి చేస్తున్నారా?" అని కోప్పడ్డాడు అబ్బాయి.

"పోన్లేరా నాకూ కాలక్షేపం" అన్నాను నేను.

ఏదో నాల్రోజులు వెంటబడి ఆ తర్వాత అదే మానేస్తుంది అనుకున్నాను. కానీ నా చదువు నిరాటంకంగా సాగింది. మా ఇంగ్లీషు మాస్టారు బొత్తిగా చిన్నవారు. ఆట లెక్కువ. కాబట్టి ఇంగ్లీషు అంతంతమాత్రంగా వున్నా తెలుగు మాస్టరమ్మ మాత్రం గట్టి పట్టే పట్టింది. రాన్రాను నాకూ శ్రద్ధ కలిగింది. ఫలితం నెల తిరిగేసరికి గుణింతాలు దాటి అరటి... ఆవు వగైరా పదాల్లోకి వచ్చేశాను.

క్రమంగా చూసి రాయడం, చదవడం నేర్చుకొన్నాను. తర్వాత చూడకుండా రాయడం కూడా నేర్చుకున్నాను. ఆరు నెలల తర్వాత జీవితంలో మొదటిసారి నా కూతురికి నా స్వహస్తాలతో ఇన్లాండు కవరుమీద ఓ పది వాక్యాల ఉత్తరం రాశాను.

తిరుగు టపాకి సమాధానం వచ్చింది.

"నా కళ్ళని నేనే నమ్మలేకపోయానే అమ్మా. ఏమిటో మా అమ్మకు చదువురాదు అనుకోవడమే తప్ప అమ్మకు చదువు నేర్పించాలి అనే ఆలోచనే రాలేదు మాకు. మేము ఎవ్వరం చెయ్యలేని పని నా మేనకోడలు చేసి చూపించింది. దానికి ఎంతైనా కృతజ్ఞతలు చెప్పుకోవాలి. నీ ఉత్తరం చదువుతూ వుంటే నిన్ను చూస్తున్నట్లు అనిపించిందే అమ్మా! ఇకమీదట కూడా క్రమం తప్పకుండా ఉత్తరాలు రాస్తూ వుండు. నేనూ రాస్తాను" అంటూ నాలుగు పేజీలు రాసింది.

నాకు అది ఒక వింత అనుభవం. అంతవరకూ ఏదైనా ఉత్తరం వస్తే ఎవరైనా చదివి పెట్టేదాకా అందులో ఏముందో తెలిసేదికాదు. సమాధానం రాయాలంటే మళ్ళీ ఎవరినైనా బతిమాలుకోవలిసిందే. కానీ చదువొచ్చాక నేనే చదువుకోగలను రాసుకోగలను.

నేను చదవగలుగుతున్నానని తెలిసి అబ్బాయి తెలుగు పేపరు తెప్పించడం మొదలుపెట్టాడు.

కోడలు పనిచేసే బ్యాంకుదగ్గర ఒక లైబ్రరీ వుందిట. అక్కడినించి నాకోసం పుస్తకాలు తెచ్చిపెట్టేది.

అంతవరకూ చీకటిగదిలో తలుపులు మూసుకుని కూర్చున్న మనిషికి ఒక్కసారి తలుపు తెరుచుకుని వెలుగులోకి వస్తే ఎలాటి అనుభూతి కలుగుతుందో అటువంటి అనుభూతే కలిగింది నాకు.

మొదట్లో చదవడం శ్రమ అనిపించేది కానీ క్రమంగా అలవాటై వేగంగా చదివే స్థాయికి చేరుకున్నాను.





ఎన్నెన్ని సంగతులు. ఎన్ని వింతలు? ఎంత విజ్ఞానం. అదో మహాసముద్రం. నా వంటరితనం పారిపోయింది. పొద్దెలాపో తుందా అనే ఆలోచనలేదు సరికదా పొద్దు చాలకుండా అయిపోయింది. పుస్తకాలు నా నేస్తాలైపోయాయి. కాలం అమితవేగంగా జరిగి పోసాగింది.

మా ఇంగ్లీషు మాస్టారు కాస్త ఆకతాయి. ఒక పద్ధతి ప్రకారం నేర్పేవాడు కాదు. బుద్ధి కుదిరితే రెండు గంటలసేపు పీఠం వేసు కుని ఖచ్చితంగా నేర్పేవాడు. లేకపోతే పది రోజులు పత్తాలేకుండా పోయేవాడు. ఏదిఏ మైనా వాడు తీరినప్పుడు నేర్పినా ఇంగ్లీషు చదవడం నేర్చుకున్నాను. మాట్లాడలేక పోయినా ఎదుటివారు ఇంగ్లీషులో మాట్లా డితే అర్థం చేసుకునేపాటి పరిజ్ఞానం సంపా దించాను.

క్రమంగా బంధువులతో ఉత్తర ప్రత్యుత్త రాలు జరపడం ప్రారంభించాను. అదో కాలక్షేపం. ఉత్తరాలు రాయడం సమా ధానం కోసం ఎదురుచూడడం. అదీగాక అందరి యోగక్షేమాలూ తెలుస్తూ వుండేవి. ఎక్కడో దూరాన వున్న ఆత్మీయులు దగ్గరైన అనుభూతి కలిగేది.

అన్నింటినీ మించి నాలోని భయం పారిపోయింది. ఏదో ధైర్యం కలిగింది. మునుపటిలాగా ఎలా బతుకుతాను నా జీవితం ఎలా గడుస్తుంది అనే చింతదూ రమై ఫర్వాలేదు ఇంతమంది బతగ్గా లేనిది నేను బతకలేనా అనే ధీమా కలిగింది.

ఆ ధీమాతోనే ఒకటి రెండు సార్లు కోడ లికి ఎదురు సమాధానం చెప్పాను. ఓసారి చిరాగ్గావుండి ఆ విసుగంతా నామీద చూపించబోయింది అలవాటు ప్రకారం.

"చూడమ్మా! ఏదో ఇంట్లో ఎదురుగా వున్నానని అలుసు తీసుకుని నామీద అథార్టీ చెలాయించకు. నీకున్నంత అధి కారం లేక పోయినా ఈ ఇంట్లో కాస్తో కూస్తో నాకూ అధికారం వుంది. ఇది నీ భర్త ఇల్లు కాదనను. కానీ ఇది నా కొడుకు ఇల్లు కూడా. ఆ మాట కాస్త గుర్తుంచుకో.

"ఒకే వ్యక్తికి దగ్గరవాళ్ళమైన మనం కలి సివుండక తప్పదు. నాకివ్వాల్సిన గౌరవం నాకివ్వు. నువ్వు పొందవలసిన ప్రేమాభి మానాలు నువ్వు పొందు. అది మనందరికీ క్షేమం. ఏదో పనికిరాని మనిషిగా చూసి నన్ను ఆడిపోసుకుంటే మాత్రం నేను వూరు కోను" అని మెత్తగానే చెప్పేశాను.

ఏమనుకుందో ఏమో ఆతర్వాత తన ధోరణి మార్చుకుంది. ఏదైనా చిరాకువేసినా గదిలోకిపోయి తలుపేసుకుని పడుకునేది. నా జోలికి వచ్చేదికాదు.

ఆ మార్పు చూసి నాకెంతో సంతోషం వేసింది. అంతలోనే బోలెడంత బాధ కూడా కలిగింది. ఈ మాత్రం తెలివితేటలు ఆనాడే వుంటే అందరిచేత మాటలు పడేదాన్ని కాదుకదా అనిపించింది. చచ్చిపోయిన మా అత్తగార్నీ, నా మొగుడినీ కిందికి రప్పించి నాలుగూ అడిగి దులిపేయాలనే ఆవేశం కలిగింది. అంతలోనే నా ఆలోచనకు నాకే నవ్వొచ్చింది.



మా కోడలికి బ్యాంకులో అప్పటిదాకా

వున్న ఆఫీసరు మారిపోయి మరొకాయన వచ్చాడుట. మనిషి చాలామంచి వాడుట. ఎంతో బాగా మాట్లాడతాడుట. "ఉద్యోగంలో చేరాక ఇంతవరకూ పనిచేసిన బాస్ లందరూ కరోడా వాళ్ళే. ఇన్నాళ్టికి మంచి ఆఫీసరుగారు వచ్చారు. ఆ టెన్షను తీరిపోయి ప్రాణానికి హాయిగా వుంది" అని సరదాపడిపోయింది.

కోడలు చెప్పినట్లు అతను చాలామంచి వాడు. శెలవుల్లో రెండు మూడుసార్లు మా ఇంటికి భోజనానికి వచ్చాడు. ఆయన భార్య వేరే ఊర్లో వుద్యోగం చేస్తోంది. పిల్లలు చదువుకుంటున్నారుట. వంటరిగా వుంటూ వండుకుతింటున్నాడు. అందుకని ఇంట్లో నించి పచ్చళ్లూ, పిండివంటలూ, వగైరాలు పట్టుకువెళ్ళి ఇచ్చేది కోడలు. బదులుగా పిల్లలకి చాక్లెట్లూ, బిస్కెట్లు పంపించేవాడు ఆయన.

అంతా బాగానే వుందిగానీ కొన్నాళ్ళ తర్వాత మొహం ఇంత చేసుకుని తిరిగి వచ్చింది ఒకరోజు. "ఏంటమ్మా అలా వున్నావ్" అని అడిగాను.

"ఏం చెప్పమంటారు? అంతా నాఖర్మ" అంటూ ఏడిచింది. కాసేపు ఏడిచి కళ్ళు తుడుచుకుని చెప్పుకొచ్చింది.

కొత్త ఆఫీసరుగారితో చనువుగా వుండడం రాకపోకలు సాగించడం చూసిన వాళ్ళ తోటివాళ్ళు చెవులు కొరుక్కుంటున్నారుట. సూటీపోటీ మాటలు అంటున్నారుట.

నాకు చాలా ఆశ్చర్యం కలిగింది.

ఎప్పుడో చిన్నప్పుడు మా ఊళ్ళో ఇలాగే వాళ్ళమీదా వీళ్ళమీదా వున్నవీ లేవినీ చెప్పుకుని ఆనందించేవాళ్ళు

వాళ్ళకి చదువూ సంధ్యాలేవు సరికదా పనీ పాటా కూడా లేవు. కూపస్థమండూకాలు.



మరి ఇప్పుడు

వీరంతా చదువుకున్న వాళ్ళు.

బోలెడంత విజ్ఞానం వున్నవాళ్ళు.

అన్నిటినీ మించి క్షణం తీరిక లేకుండా రెండుచేతులా పని వున్నవాళ్ళు.

అన్నీ తెలిసిన వివేకవంతులు కూడా ఇట్లా వంకరగా ఆలోచిస్తారా?

అటు ఆయన ఉన్నతోద్యోగి. నడివయసు మనిషి.

ఇటు ఇది చూడబోతే లక్షణంగా పెళ్ళై కాపురం చేసుకుంటున్న ఇద్దరు పిల్లల తల్లి.

ఏదో కాస్త చనువుగా మాట్లాడినంతమాత్రాన అది తప్పా? రాకపోకలు జరపడం క్షమించరాని అపరాధమా?

ఇందులో ఎంత మాత్రం నిజం లేదని ఆ చెవులు కొరుక్కునే వారికి తెలియదా? అంత చిన్న విషయం గ్రహించలేనప్పుడు చదువులెందుకు? సంస్కారాలు ఎందుకు?

అబ్బాయి వచ్చాక ఆ విషయమే మాట్లాడుకున్నాం. బరువుగా నిట్టూర్చాడు వాడు.

"అయిపోయిన దానికి ఏమీ చెయ్యలేం. ఇక ముందు కొంచెం జాగర్తగా వుండు" అన్నాడు అనునయంగా!

కోడలికి చాలాకోపం వచ్చింది. "అంటే ఇప్పుడు నేనేదో తప్పు చేశాననా మీ ఉద్దేశ్యం? ఇక ముందు జాగర్తగా వుండమనడంలో అర్థం ఏమిటి?" అని నిలదీసి అడిగింది.

"ఇందులో గూడార్థం ఏమీలేదు. మనం సమాజంలో బతుకుతున్నాం. ఆ సమాజం కొన్ని హద్దులని ఏర్పరిచింది. కనిపించకుండానే ఏర్పడిన ఆ హద్దులని ఎవరికి వారు అందరూ పాటిస్తున్నాం. అవి ఎవరైనా అతిక్రమిస్తే వాళ్ళని గురించి నలుగురూ నాలుగుమాటలు అనడం సహజమే" అన్నాడు తాపీగా.

"అంటే! ఆ మాటలు అంటున్న వాళ్ళనే

సమర్థిస్తున్నావా నువ్వు?" అని అడిగాను.

"నేను సమర్థించినా సమర్థించకపోయినా వున్న మాట అదే. అంతదాక ఎందుకు. మన పక్కింటావిడో, ఎదురింటావిడో పరాయి మగవాడితో నాలుగైదుసార్లు చనువుగా మాట్లాడుతూ కనిపిస్తే నువ్వూ నేనూ వింతగా చూసి వాళ్ళగురించి నాలుగు మాటలు మాట్లాడుకుంటాం. అది సహజం. మనం నిత్యం చూసే పద్ధతికి భిన్నంగా వున్నారు కాబట్టి ఏమిటా ఈ విషయం అని కుతూహలం. అంత మాత్రాన మనం సంస్కారం లేని వాళ్ళమా?" అన్నాడు అబ్బాయి.

"అంతే లెండి ఎవరన్నా ఆడవాళ్ళనే అంటారు. ఏం చేసినా ఆడదానిదే తప్పు. వేలెత్తి చూపేది ఆడవాళ్ళనే. మమ్మల్ని అంటే నోరు మూసుకుని పడివుంటాం కదా! అదే అలుసు మీ అందరికీ" అంది ఉక్రోషంగా కోడలు.

"నువ్వు వుడుక్కున్నా వున్నమాట అది. ఇప్పుడు నీ విషయంలో నిన్ను హేళన చేస్తారు. మీ బాస్ జోలికి ఎవ్వరూ పోరు. మీ చనువు అసహజంగా అందరికీ అనిపించింది కాబోలు. అందుకే మాటలంటున్నారు. నిజానిజాలు ఆలోచించి తెలుసుకోవలసినంత తీరికా ఓపికా వాళ్ళకి వుండదు

ఆడదాన్ని కాబట్టి నన్ను అంటున్నారు అని నువ్వు బాధ పడుతూవుంటే ఆ అన్న వాళ్ళను నాలుగూ అడిగేసి నీ అక్కసు తీర్చుకో. కానీ ఒక్క విషయం మాత్రం గుర్తుపెట్టుకో. నువ్వు నాలుగూ అడిగేసి పోట్లాట పెట్టుకున్నంత మాత్రాన వాళ్ళు నిజం గ్రహించి మారిపోతారని మాత్రం ఆశపెట్టుకోకు.

అందరూ నీకు శత్రువులవుతారు. పైగా నీ మనసులో ఏ కుళ్ళూ లేకపోతే నిన్ను కాదన్నట్లు వూరుకునే దానివి. ఏదో వుంది కాబట్టే భుజాలు తడుముకుంటున్నావు అని ఎదురుతిరిగి నిన్నే అంటారు.

నేను చెప్పేది చెప్పాను. సమస్యను సున్నితంగా పరిష్కారం చేసుకోవాలంటే ఆయనతో స్నేహం మానేయ్. లేదంటావా ఎదురు తిరిగి పోట్లాడు నీ ఇష్టం" అని నెమ్మదిగానే ఖచ్చితంగా చెప్పేశాడు.

వాడి మాటల్లో నిజం గ్రహించిందేమో ఇంకేమీ అనలేదు కోడలు. మొదటి మార్గాన్నే ఎంచుకుంది. "ఏదో మంచివాడు, వంటరిగా వున్నాడు అందుకే భోజనానికి రమ్మన్నాను ఇకనించీ మానేస్తాను. ఆయనేం నాకు బంధువా స్నేహితుడా?" అనుకుంది.

కానీ ఆ మానేయడం అంత సులభం కాలేదు. అంత వరకూ చనువుగా మాట్లాడుతూ హఠాత్తుగా మొహం చాటేసేసరికి ఆయనకి ఆగ్రహం వచ్చిందిట. మాటల్లో చెప్పకపోయినా ఆ ఆగ్రహం చేతల్లో చూపించడం మొదలుపెట్టాడుట.

అది కనిపెట్టి తోటి వాళ్ళంతా సరదాపడిపోయారుట. అబ్బో ఒకళ్ళకోసం ఇంకోళ్ళు అన్నట్లు వున్నారు. తీరా చూస్తే అది కాస్తా బెడిసికొట్టింది. ఇలాటి స్నేహాలు ఎన్నాళ్ళు సాగుతాయి? అనుకుని చెవులు కొరుక్కున్నారుట.

మా కోడలు మళ్ళీ యథాప్రకారం బిక్కమొహం వేసుకుని వచ్చేది. "ఏమిటో వెధవ ఉద్యోగం. వదిలేసే వీలూ లేదు. ఈ ఉద్యోగంతో మనశ్శాంతిలేదు. దిక్కుమాలిన జీవితం" అని సణుక్కునేది.

"మీరోజులే నయం అత్తయ్యా. లక్షణంగా ఇంటిపట్టున వుండేవాళ్ళు. బయటికి వెళ్ళి అందరిచేత మాటలు పడే అవస్థ వుండేది కాదు మీకు" అనేది. దినదిన గండంలా వుంది. ఇక ముందైనా రోజులు మారిపోతే బాగుండు. రేపు నాకూతురు పెరిగి పెద్దదై రాజాలాటి ఉద్యోగం చెయ్యాలి. నా

గుమాస్తా ఉద్యోగంలో ఏముంది? ఇది పెద్ద ఆఫీసరు అయిపోతే ఎవరూ దీన్ని మాటలు అనరు. అందర్నీ గడగడలాడిస్తుంది మన భారతి" అనేది.



కాలం వేగంగా గడవసాగింది.

ఎన్నో మార్పులు.

'శరవేగంతో మారిపోతున్న సమాజం. దినదినాభివృద్ధి చెందుతూ విజ్ఞానం మనిషి జీవన విధానాన్ని పూర్తిగా మార్చివేసింది.

గడిచిన రెండు దశాబ్దాలతో పోలిస్తే తరువాత రెండు దశాబ్దాలలోనూ చెప్పలేనంత మార్పు.

ఎన్నో వింతలు. విడ్డూరాలు. దైనందిన జీవన విధానాన్ని సరళం చేస్తూ ఎన్నో వస్తువులు. యంత్రాలు.

ఎక్కడో మాట్లాడితే ఇక్కడికి వినిపిస్తుంది. ఎంత విడ్డూరం అని రేడియోలు విని ఆనందపడే రోజులు ముగిసిపోయాయి. ప్రపంచంలో ఏమూలో జరుగుతూవున్న కార్యక్రమాన్ని కళ్ళెదుట సాక్షాత్కరింపజేసే టెలివిజన్లు ఇంటింట్లో ప్రత్యక్షం అయ్యాయి. తద్వారా ప్రపంచం చిన్నది అయిపోయింది. గుమ్మం కదలకుండా ఇంట్లో కూర్చుని దేశంలో ఏ మూల ఏం జరుగుతూ వుందో తెలుసుకునే సౌకర్యం సమకూరింది. కాలక్షేపానికి కరువులేదు. ఇరుగుపొరుగమ్మలంతా ఒకచోట జేరి కబుర్లతో కాలం గడిపే దృశ్యం కనుమరుగయింది. రాకపోకలు క్రమంగా తగ్గిపోయాయి. ఎవరి పని వారు చేసుకుని టి.వి. ముందు కూర్చోవడంతో మనుషులు కలవడమే కరువైపోయింది.

నా మనవరాలు మంచి మార్కులతో చదువు పూర్తిచేసి ఇంజనీరింగులో సీటు తెచ్చుకుంది.

"నీకు తెలుసా మామ్మా! నీ మనవరాలు ఇంజనీర్ అవుతుంది" అంటూ నన్ను కావలించుకుని సంబరంగా చెప్తూ వుంటే ఆనందంతో కళ్ళనీళ్ళు తిరిగాయి నాకు.

ఇంజనీరింగులోనూ, మెడిసిన్‌లోనూ సీటు సంపాదించాలని పిల్లలూ, వాళ్ళతో బాటు తల్లిదండ్రులూ ఎన్ని పాట్లు పడతారో కళ్లారా చూస్తూ చెవులారా వింటూ పేపర్లలో చదువుతూన్న నాకు బాగా తెలుసు. అటువంటిది మా చిట్టితల్లికి ఏనాడూ ట్యూషన్ అయినా పెట్టలేదు మా అబ్బాయి. అసలా అవసరమే రాలేదు. మెరికలాటి పిల్ల అది.

ఆడుతూపాడుతూ చదువుకుని సీటు సంపాదించుకుంది.

ఒక్క చదువేనా! సంగీతంలోనూ ప్రావీణ్యత సంపాదించింది. ఫిడేలు వాయిస్తూ పాడుతూవుంటే వినేవాళ్ళు పరవశులైపోవాల్సిందే.

అంతేకాదు తీరికవేళల్లో పెయింటింగ్ వేసేది. ఆటలాడేది. ఎన్ని చేసినా ఇంకా సమయం మిగిలిపోతూనే వుండేది. అపుడు వంటింటిమీద దండెత్తేది.

చైతన్య స్రవంతి మా భారతి. దాని మనసు వెన్నపూస. మాట మధురం.

ఆడపిల్ల అంటే భారతిలా వుండాలి అనుకునేవారు పరిచయస్థులంతా.

అదీ నేనూ ఆప్తమిత్రులం. గంటల తరబడి కబుర్లు చెప్పుకునే వాళ్లం. నా పక్కనే పడుకునేది భారతి.

"మామ్మ ఆత్మలింగం మా అమ్మాయి" అని ఆటపట్టించేవాడు నా కొడుకు.

పాత విషయాలు అన్నీ నాచేత చెప్పించుకునేది. మా అత్తగార్ని గురించి విని బాధపడేది. 'నేనే గనక తాతమ్మగారి స్థానంలో వుంటే నాన్నతో దెబ్బలాడి ఆస్థంతా నా పేర రాయించుకునేదాన్ని. ఆ ఆస్థిని





వెయ్యింతలు చేసేదాన్ని. నా మనవలకీ మునిమనవలకీ లక్షలకి లక్షలు పంచేదాన్ని' అనేది.

నా గురించి విని 'నీకు అంత పెద్దవాడి నిచ్చి పెళ్ళిచేస్తూ వుంటే నువ్వు కాబట్టి వూరుకున్నావు, నేనైతేనా ఇంట్లోంచి పారి పోయి ఏదైనా శరణాలయంలో జేరేదాన్ని' అనేది.

ఒకసారి ఒక సంఘటన జరిగింది. మా పనిమనిషి ఆదెమ్మ చీటికి మాటికీ నాగాలు పెడుతూవుంటే నయానాభయానా చెప్పి చూశాం. అప్పటికీ లాభంలేకపోయేసరికి రావులమ్మ అనే మరో పనిమనిషిని మాట్లాడాం.

ఫస్టు తారీకున జీతం చేతిలో పెట్టి రేప టినుండి రానవసరం లేదు అని చెప్పాం ఆదెమ్మతో.

అదేమిటని అడిగింది. నీ నాగాలు భరిం చలేం వెళ్ళిరమ్మని మర్యాదగా చెప్పాం. ఆదెమ్మ సణుగుతూనే వెళ్ళిపోయింది.

కాసేపటికి కొత్త పనిమనిషి రావులమ్మ వచ్చింది. కొత్త మోజుకదా గలగలా మాట్లా డుతూ చకచక పనిచేస్తూవుంది.

అంతలోనే ఎద్దంత గొంతు పెట్టుకొని అరుస్తూ వచ్చింది ఆదెమ్మ.

"ఎవర్తె అది? నా సవితి బయటికి రా!"

అంటూ అరిచి రావులమ్మ మీద ధ్వజం ఎత్తింది.

రావులమ్మా వూరుకోలేదు. అదీ నోరు చేసుకుంది. ఇద్దరూ భయంకరమైన భాషలో తిట్టుకున్నారు.

అది చాలక జుట్టు పీక్కుని కొట్టుకు న్నారు. మా ఇల్లు రణరంగంలా మారిపో యింది. ఇరుగూపొరుగూ తొంగిచూట్టం మొదలుపెట్టారు. తలకొట్టేసినట్లు అయింది మాకు.

మనవడు కల్పించుకుని కేకలేశాడు. అప్ప టికీ వినకపోతే పోలీసులని పిలిపిస్తానని బెదిరించాడు.

అప్పుడు కాస్త శాంతించారు ఇద్దరూ.

కొట్టుకోవడం మానేసి గొంతులు తగ్గించి శాపనార్థాలు పెట్టుకోవడం ప్రారంభించారు. భారతి కల్పించుకుని కేకలేసింది.

"డబ్బులిస్తున్నాం, పని చేయించు కుంటాం. నీఇష్టం వచ్చినట్లు నాగాలు పెడ తావ్ చెప్తే వినవ్. నీకు డబ్బిచ్చి నెలలో పది రోజులు మేము పని చేసుకోవాలా? ఎందుకు సర్దుకుంటాం? నువ్వొక్కర్తివే వున్నావా పనిమనిషివి? మా ఇష్టం వచ్చిన వాళ్ళని పెట్టుకుంటాం. మధ్యలో నీగోల ఏమిటి? ఇంటిమీది కొచ్చి అరిస్తే బెదిరిపో తామా? మాట్లాడకుండా పో, లేకపోతే మర్యాద దక్కదు" అని అరిచింది.

"ఎంతమాట చిన్నమ్మా. అరిచి మిమ్మల్ని బెదిరించేపాటి బతుకా నాది! వున్నపాటున ఓ ఇల్లుపోతే నా ఇల్లెట్లా గడుస్తుందా అని ఏడుపు" అంటూ మొదలుపెట్టి చెప్పుకొ చ్చింది ఆదెమ్మ.

దానికి అయిదుగురు పిల్లలు. అంతా చిన్నవాళ్ళే. పెద్దవాడు ఏదో హోటల్‌కి పని కిపోతాడుట. రెండోదాని దగ్గర మిగిలిన ముగ్గుర్నీ పెట్టి పనికొస్తుంది. అయిదిళ్ళు పని చేసుకుంటుంది. నెలకి మూడొందలు సంపాదిస్తుంది. అందరిళ్ళలో మిగిలిన అన్నం అంతా ఇంతా కలిపితే పిల్లలకి ఓ పూటకి సరిపోతుంది. మొగుడున్నాడు. వాడికి ఏదో ఫ్యాక్టరీలో పని. మూడొందలు ఇస్తారు. దాంతో తాగేసి, బ్రాకెట్టు ఆడేసి, అక్కడా ఇక్కడా తిరిగేసి ఓ పదిహేను రోజులు గడిపేస్తాడు. ఆ తర్వాత డబ్బులి మ్మని పెళ్ళాం మక్కెలిరగ తంతాడు. మరీ మోతాదు మించి తన్నులు తిన్నరోజున శరీరం స్వాధీనంకాక పనికి నాగాలు పెడు తుంది.

"ఎట్లాగో బతుకీడుస్తుంటే ఇప్పుడో ఇల్లు





తగ్గిపోతే నాగతేం!గాను? నాకడుపు గొట్టి ఇదేం బాగుపడుతంది" అంటూ రావుల మ్మని చూసి మెటికలు విరిచింది.

"సర్లే, నోరుముయ్యవే సవితీ. నీ కడుపు గొట్టే కర్మ నాకేమిటే! నా కడుపు సంగతి నేను చూసుకుంటున్నా" అంటూ అరిచింది రావులమ్మ.

"మీరే న్యాయం చెప్పండి చిన్నమ్మగారూ!" అంటూ మొదలుపెట్టి చెప్పుకుపోయింది. దానికి ఆరుగురు పిల్లలు. పెద్దపిల్ల పాతబ ట్టలకి స్టీలు సామాన్లు అమ్ముతుందిట. మరొకర్తె ఎవరింట్లోనో దినం అస్తమానం వుండి పనిచేస్తుందిట. మిగిలిన వాళ్ళంతా చిన్నవాళ్ళు.

మొగుడు చాలా మంచివాడుట. మొదటి పెళ్ళి మొగుడు కాల్చుకుతింటూ వుంటే వాడిని వదిలేసి తప్పు కట్టి పిల్లల్నిద్దర్నీ తీసుకుని ఇప్పుడున్న వాడికి మారుమను వుకి వచ్చేసిందిట. కొన్నాళ్ళు బాగానే వున్నా రుట. తరువాత ఆ మొగుడికి ఏదో రోగం వచ్చిందట. పని చెయ్యలేకపోతుంటే పన్లోంచి తీసేశారుట.

దాంతో సంసారం అస్థవ్యస్తం అయిపో యింది. ఇంతమంది బతుకుతూ ఇంటియ జమానికి మంచి వైద్యం చేయించి వాడు బాగుపడి మళ్ళీ పన్లోకి వెళితే వీళ్ళ పరిస్థి తులు బాగుపడతాయి. అందుకని ఎక్కడ పని దొరికినా దొరకబుచ్చుకుని రెక్కలు ముక్కలు చేసుకుంటోంది రావులమ్మ.

"మీరు పిలిచారు నేనొచ్చాను. మధ్యలో దీనికేం దురద" అని విరుచుకు పడింది. మళ్ళీ ఇద్దరూ ఏకమై నానా తిట్లూ తిట్టుకు న్నారు. భారతి కల్పించుకుని కేకలేసి ఆదెమ్మ చేతులో పదిరూపాయలు పెట్టి దాన్ని బయటికి తోలి దీనికి కాసిని కాఫీ పోసి పనిలోకి తోలింది.

"గాలివాన వెలిసినట్లు అయింది. వెధవ న్యూసెన్సు" అని విసుక్కుని బయటికి వెళ్ళి పోయాడు మనవడు. నేనూ నా మనవ రాలూ కాఫీ గ్లాసులు పట్టుకుని కూర్చున్నాం.

"చూశావా మామ్మా! ఈ ఆదెమ్మకీ రావు లమ్మకీ మా అమ్మ వయసే వుంటుంది. కాకపోతే మరో నాలుగైదేళ్ళు తేడా వుంటుం దేమో. దానికి అయిదుగురు పిల్లలుట. దీని కారుగురుట. ప్రభుత్వం ఎంత మొత్తుకుంటే మాత్రం ఏంలాభం. మధ్యతరగతివాళ్ళు ఫ్యామిలీ ప్లానింగ్ పాటిస్తున్నారు. కానీ ఈ కోవకి చెందినవాళ్ళలో మార్పులేదు. లేక పోతే చూడు. మొగుడు తిన్నగాలేడు. కటిక దరిద్రం. దానికితోడు గంపెడేసి పిల్లలు. ప్చ్ లాభం లేదు మామ్మా. ఇవన్నీ నిర క్షరాస్యతవల్ల వచ్చే నష్టాలు.

ఈ వర్గంవారు కూడా అంతోఇంతో చదు వుకుని పరిస్థితి అవగాహన చేసుకుని కుటుంబ నియంత్రణ పాటిస్తేగానీ మన జనాభా సమస్య తీరదు. మనకూ మంచి రోజులు రావు. అంతదాకా ఇలా దారిద్ర్యపు ఊబిలో కూరుకుపోవాల్సిందే ఈ దేశం" అంది.

"నిజమేనే బంగారూ!" అన్నాను.

"మరో విషయం గమనించావా మామ్మా! పిల్లలని కనడంలో భార్యాభర్తలిద్దరి బాధ్యతా వుంది. అట్లాగే పెంచి పెద్దచెయ్య డంలో కూడా సమభారం వహించాలి కదే. వీళ్ళ విషయంలో భారం అంతా తల్లిమీదే పడుతోంది. వీళ్ళిద్దరనేకాదు ఈ వర్గం వాళ్ళలో నూటికి ఎనభైమంది ఈ కోవకి చెందినవాళ్ళే. మొగుడు సంపాదించినది అంతా తాగి తగలేసి తంతూవుంటే, తన్నులు తింటూ, గానుగెద్దులా చాకిరీ చేస్తూ పిల్లలని పోషించుకుంటుంది ఆడది. ఇదంతా అజ్ఞానంవల్లనే కదా మామ్మా. తమకెంత అన్యాయం జరుగుతూ వుందో అర్థంకావడం లేదు వీళ్ళకి" అంది భారతి ఆవేశంగా.



"ఫలానవర్గం అని బేధం ఏముంది తల్లీ. ఏవర్గంవారిలోనైనా పురుషుడిదే పైచేయి. చదువుకున్నంత మాత్రాన ఆడదానికి సమానగౌరవం ఇచ్చి గౌరవిస్తున్నాడా పురుషుడు? మధ్యతరగతివారిలో బహుసంతానం లేకపోవచ్చు మగాడు తాగొచ్చి తన్నకపోవచ్చు కానీ ఈ వర్గం వారిలోనూ పిల్లల బాధ్యత తల్లికే ఎక్కువ.

"మనింట్లోనే చూడు. మీ అమ్మ చదువుకుంది. ఉద్యోగం చేస్తోంది. అయినా మీ నాన్న కట్నం తీసుకోడం మానేశాడా. పెళ్ళయ్యాక ఇద్దరూ ఉద్యోగాలు చేస్తున్నా ఇంటి పని, మీ పని అమ్మే చేసేదిగానీ మీ నాన్న చేసేవాడుకాదు.

ప్రమోషన్ మీద ట్రాన్స్‌ఫర్ చేస్తే సంసారభారం అమ్మమీద మోపి మీనాన్న వేరే వూరు వెళ్ళాడు. అక్కడ మనిషిని పెట్టుకుని వండించుకు తింటూ కాలక్షేపంచేశాడు. మీ ఇద్దరూ చంటివాళ్ళు. అటు ఉద్యోగం చేస్తూ ఇటు మిమ్మల్ని చూసుకుంటూ అష్టావధానం చేసింది మీ అమ్మ.

మరి మీ అమ్మకు వేరే వూరు ట్రాన్స్‌ఫర్ అయితే మీ నాన్నేం చేశాడు? "ఆనాడు నాకు అవసరం వచ్చింది. ఉద్యోగంలో వృద్ధి చెందాలంటే వెళ్ళాలి కాబట్టి వెళ్ళాను. ఇప్పుడు నీకు అవసరం వచ్చింది. నువ్వు వెళ్ళు. సంసారం నేను చూసుకుంటాను" అని అనగలిగాడా? ట్రాన్స్‌ఫరూ వద్దు ప్రమోషన్లూ వద్దు తూర్పుకి తిరిగి దణ్ణం పెట్టమన్నాడు.

"మీ అమ్మ బుర్రూపి వూరుకుందిగానీ ఎదురు తిరిగిందా? ఏం మగవాడు వేరే వూరు వెళ్ళి వంటరిగా వుండగలిగినప్పుడు, ఉద్యోగం కోసం ఆడది వెళ్ళి వంటరిగా వుంటే తప్పేముంది? ఆడది భర్త తోడులేకుండా పిల్లల్ని పెట్టుకుని వుండగలిగినప్పుడు, భర్త భార్య తోడులేకుండా పిల్లల్ని పెట్టుకుని ఎందుకు వుండలేడు?

"ప్రయత్నం చేస్తే అన్నీ సాధ్యమే. కానీ ఆ ఆలోచనైనా వచ్చిందా ఇద్దర్లో ఒకరికైనా! సరే అదంతా గతం. ఇప్పటి సంగతి చూడు.

"నెలకి నాలుగురోజులు ఫ్రెండ్స్ అనీ, పార్టీలనీ పోయి అర్ధరాత్రిదాకా జల్సా చేసి వస్తాడు మీ నాన్న. మరి మీ అమ్మ ఏనాడైనా ఫ్రెండ్స్‌తో పార్టీ అని వెళ్ళిందా? క్రికెట్టు ఆటలమీదా, సినిమాలూ షికార్లూ అంటూ ఖర్చుపెడతాడు మీనాన్న. జాగర్తగా డబ్బు దాచి నీ పెళ్ళికోసం బంగారం షాపులో చీటీలు కడుతుంది మీ అమ్మ.

"నాన్న రావడం ఆలస్యం అయితే అందరం కంగారుపడిపోతాం. వచ్చీరాగానే తనెంత కష్టపడిపోయాడో చెప్తే అందరం పరుగులు పెట్టి కాఫీ, టిఫెన్లు, వేడినీళ్ళూ అందించి విశ్రాంతి తీసుకోమంటాం.

"అదే అమ్మ చచ్చీచెడీ చాకిరీ చేసి ఆలస్యంగా వస్తే అందరికీ అసహనం. చిరాకు. వాకిట్లోంచే సంజాయిషీ చెప్పుకుంటూ వస్తుంది. పాపం ఆకలేస్తోందేమో మీ అందరికీ. ఎంత చిటికెలో వండేస్తాను అంటూ కొంగు దోపుకుని వంటింట్లోకి వెళ్తూ వుంటే మనందరం ఉదారంగా చూస్తూ వూరుకుంటాం!

"ఏమిటిదంతా? " అన్నాను

"అలా అయితే ఆడవాళ్ళందరూ అణిగిమణిగి వుంటున్నారనీ మగవాళ్ళు కఠినమైనవాళ్లని అంటావా మామ్మా నువ్వు? గయ్యాళి ఆడవాళ్ళు ఎంతమంది లేరు? ఎడాపెడా అప్పులు చేసి చీరెలూ నగలూ కొనేసి సంసారాన్ని రోడ్డున పడేసే ఆడవాళ్ళు సవాలక్షమంది. తనవైపు వారికి అడుగులకి మడుగులొత్తి ఆదరిస్తూ, అత్తింటివారిని గడప ఎక్కకుండా చేసే గడసరి ఆడవాళ్ళు కూడా ఎదురవుతూనే వుంటారు కదా





మామ్మా" అంది భారతి.

"నేను చెప్పినది నువ్వు సరిగ్గా అర్థంచేసుకోలేదే అమ్మడూ. ఆడది పత్తిత్తు అనీ మగవాడు రాక్షసుడనీ నేను అన్లేదు. మగవాడు శాశించకపోయినా ఆడదే తనకుతానే కొన్ని హద్దులు ఏర్పరుచుకుని, కొన్ని బాధ్యతలు నెత్తిన వేసుకుని హైరానాపడి పోతోంది. అది ఆసరాగా చేసుకుని మగవాడు సుఖపడుతున్నాడు.

పోతే నువ్వు చెప్పినట్లు గయ్యాళి గంగమ్మలు కూడా వున్నారు. కాకపోతే అటువంటివారి సంఖ్య చాలా తక్కువ. ఎక్కడో నూటికో అయిదారుగురు వుంటారేమో" అన్నాను.

"ఆమాట నిజమే మామ్మా. అటువంటి కేసుల్లో మగవాడు నరకం అనుభవిస్తాడు. అసలు భార్యాభర్తలమధ్య పరస్పరావగాహన వుంటే సంసారం సుఖంగా సాగిపోతుంది. రోజులు మారుతున్నాయి. మీరోజులకీ ఇప్పటికీ సంబంధమేలేదు.

"మీరోజుల్లో భర్త అంటే అతడేదో దిగొచ్చిన దైవం. పతిని పూజించాలి. అత్తమామలకు సేవలు చెయ్యాలి. అణిగిమణిగి వుండాలి అనుకునేవారు. మంచి భర్తకోసం పూజలూ వ్రతాలూ చేసేవారు. అమ్మానాన్నా తెచ్చిన వరుడిని వివాహం చేసుకుని అతడికి బానిసలా బతికేవాళ్ళు

"ఇప్పుడు ఈ తరంలో భర్తంటే దేవుడు కాదు. సాటి మనిషి అని భావిస్తున్నారు. భర్తంటే ఫ్రెండ్‌లా వుండాలి అనుకుంటున్నారు. ఇది ఆడపని, ఇది మగపని అనే బేధాలు సమసిపోయి ఏ పనిలోనైనా పాలు పంచుకుంటున్నారు భర్తలు. పెళ్ళి చూపుల్లోనే ఖచ్చితంగా మాట్లాడుకుని నచ్చితేనే పెళ్ళి చేసుకుంటున్నారు. ఒకరి ఇష్టాఇష్టాలు మరొకరు ముందుగా అడిగి మరీ తెలుసుకుంటున్నారు. అందువల్ల వైవాహిక జీవితం ఆనందమయంగా సాగిపోతోంది" అంది భారతి.

"అంతకంటే సంతోషమైన విషయం ఇంకేముంటుంది? సర్వేజనాః సుఖినో భవంతు అని సమాజంలో అందరూ ఆనందంగా వుంటే అదే స్వర్గం" అన్నాను నేను.

ఆరోజుల్లోనే మా మనవరాలి పెళ్ళి, అంటే నా కూతురి కూతురి పెళ్ళి జరిగింది. నెల్రోజులు ముందుగానే రమ్మని రాసింది కూతురు. వెళ్ళాను. మనవరాలు పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేసింది.

పెళ్లికొడుకు డాక్టరు. మంచి సంబంధమే. వాళ్లదీ ఆ ఊరే. అబ్బాయికి పక్క ఊళ్లో ఉద్యోగం. చీటికీ మాటికీ వస్తూనే వుండేవాడు. వచ్చినప్పుడు ఇక్కడికి వచ్చేవాడు. కాబోయే భార్యాభర్తలు కబుర్లు చెప్పుకునేవాళ్లు.

"పెళ్లి సెటిల్ అయి రెండు నెలలు అయింది. అప్పట్నించి ఇదేవరస. మీ అల్లుడికి ఇదంతా నచ్చదు. నువ్వు చెప్పు దానితో. తల్లివి ఆమాత్రం తెలియదా అని నా మీద చిరాకు పడతారు. దానితో చెప్తే ఇది మరీ బాగుంది. నేనెలా చెప్తాను. అంత కష్టంగా వుంటే నాన్నగార్ని చెప్పమను. లేదా నువ్వు చెప్పు" అంటుంది.

"కాబోయే అల్లుడిని రావద్దని నేనెలా చెప్తానే అమ్మా? అతనికి కోపం వస్తే మొదటికే మోసం కదూ! అతను వచ్చినప్పుడల్లా నా గుండె పీచుపీచు మంటుంది. సినిమాకో షికారుకో తీసుకుపోతాను పంపించండి అంటాడేమో ఏం సమాధానం చెప్పాలిరా దేవుడా! అని బెదిరి ఛస్తున్నాను. ఏదో ఈ నెలా గడిచి ఆ మూడు ముళ్లూ పడితే నా జన్మ ధన్యం. ఏమిటో దిక్కుమాలిన రోజులు. మీ రోజుల్లో మీకీ బెడదలేదు"

అంటూ తన బాధ వెళ్లబోసుకుంది నా కూతురు.

"మరేం ఫర్వాలేదు అతను అడిగినపుడు



అప్పుడాలోచించవచ్చు. వూరికే ఆలోచించి బుర్రపాడు చేసుకోకు" అన్నాను.



ఆ నెల రోజులూ హడావిడిగా గడిచిపోయాయి.

పెళ్లి ఘనంగా జరిగింది. ఒక్కతే కూతురేమో దర్జాగా చేశాడు మా అల్లుడు. అటు వైపు వాళ్లూ మంచివాళ్లే. ఎటువంటి పేచీలూ లేకుండా పెళ్లి సరదాగా జరిగిపోయింది. మనవరాలు అత్తవారింటికి వెళ్లిపోయింది. మేమందరం బయలుదేరి వచ్చేశాం.

మరో పది రోజులాగి ఒక ప్రస్థావన తెచ్చాడు అబ్బాయి.

"అమ్మా! బావగారు మంచి ఉద్యోగంలో వున్నారు. చెల్లాయ్ చాలా మంచిది. కాస్తో కూస్తో ఆస్తివున్నవాళ్లు. ఆడపిల్ల పెళ్లి అయింది. మగ పిల్లవాడు మంచి ఉద్యోగంలోనే చేరాడు. మనకు అయినవాళ్లు. అన్నీ తెలిసినవాళ్లు. పరాయివాడికెవడికో కట్టబెట్టేకంటే మేనల్లుడికే ఇస్తే సుఖం కదూ! నీ అభిప్రాయం ఏమిటమ్మా" అన్నాడు.

"చూడు నాయనా! నాకున్నది మీ ఇద్దరు. మీరిద్దరూ సంబంధం కలుపుకుని మరింత దగ్గరవుతామంటే అంతకంటే ఆనందం ఏముంటుంది. మరి వయసు వచ్చిన పిల్లలు. వాళ్ల ఆలోచనలు ఎలా వున్నాయో! తీరా అడిగి అది కుదరకపోతే మనసులు కష్టపెట్టుకోకుండా వుండగలిగే పక్షంలో అట్లాగే అడిగి చూడు" అన్నాను.

"ఆ మాట నిజమే. అందరికీ అంగీకారం అయితేనే కదా పెళ్లి. అడిగి చూస్తే సరి. కాదంటే మరో సంబంధం చూసుకుందాం. కాదన్నంత మాత్రాన ఆవిడ చెల్లెలు కాకపోతుందా? ఈయన అన్నయ్య కాకపోతారా?" అంది కోడలు. "ముందు భారతికి చెప్పి దాని అభిప్రాయం తెలుసుకోవాలి" అన్నాడు అబ్బాయి.

"వద్దు నాన్నగారూ" అంది అంతా వింటున్న భారతి.

గతుక్కుమన్నాం అందరం.

"అదేమిటే అలా క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా ఠకీమని చెప్పేస్తావేం. ఎందుకొద్దు?" అంది కోడలు.

"రక్తసంబంధంలో పెళ్లిళ్లు అయితే పుట్టబోయే పిల్లలకి కాంప్లికేషన్సు వచ్చే అవకాశం వుంది. అదీగాక బావ నాకు కజిన్ అంతే, అతడిని భర్తగా అంగీకరించను" అనేసింది. దాంతో ఆ ప్రసక్తి ముగిసిపోయింది.

★ ★ ★

ఇంజనీరింగ్ ఆఖరి సంవత్సరంలోకి వచ్చింది భారతి. ఒకరోజు పరిగెట్టుకుంటూ వచ్చింది. నా నోట్లో చాక్లెట్ కుక్కేసింది. నన్ను గిర్రున తిప్పేసింది. ఎగిరి గంతులు వేసింది.

"ఏమిటే ఈ హడావిడి అంతా!" అన్నాను.

"నాకు ఉద్యోగం వచ్చింది మామ్మా!" అంది.

"ఉద్యోగం వచ్చిందా! మరి చదువేం చేస్తావు? మధ్యలో మానేస్తావా?" అని





అడిగాను.

కాదుట చదువు పూర్తి చేశాక ఉద్యోగంలో చేరుతుందిట.

చదువు ఆఖరి సంవత్సరంలో వుండగానే పెద్ద కంపెనీల వాళ్లు కాలేజీకి వచ్చి వాళ్లకు కావలసిన ఉద్యోగులను ఎంచుకుంటారుట. పరీక్షలు పెట్టి ఇంటర్వ్యూలు తీసుకుని సెలక్ట్ చేస్తారుట. మెరికల్లాటి వాళ్లనే ఎంచుకుంటారుట. అలాగే వచ్చిందిట దీనికి.

"ఎంతోమంది వెళ్తే నలుగురిని మాత్రం ఎంచుకున్నారు. అందులో నేనొకర్తైను. జీతం ఎంతో తెలుసా అయిదు వేలు" అంది మెరిసే కళ్లతో.

పట్టలేనంత ఆనందం కలిగింది నాకు.

చదువు పూర్తి కాకుండానే ఉద్యోగం అంటే మాటలా?

అమాంతం కావలించుకున్నాను.

"ఇలాంటి శుభవార్తలు ఇలాగే నేను బతికున్నన్నాళ్లు చెప్తూ వుండవే బంగారు తల్లీ" అన్నాను.

కొడుకూ, కోడలూ ఈ వార్త విని పరమానంద భరితులయ్యారు.

"ఇన్నేళ్లనుంచి ఇలా చాకిరీ చేస్తున్న నాకు ఇప్పుడొచ్చేదీ అంత జీతమే! ఒక్క అప్లికేషను పెట్టకుండానే ఉద్యోగం వచ్చేసింది దీనికి" అంటూ మురిసిపోయింది కోడలు.

"అందరితో గర్వంగా చెప్పుకుంటానే అమ్మా" అంటూ ఆనందపడిపోయాడు కొడుకు.

కూతురికి బోలెడన్ని బహుమతులు కొనిచ్చారిద్దరూ!

ఆ సాయంత్రం గుడికి వెళ్లాం. అక్కడినుంచి హోటల్‌కి వెళ్లి అక్కడే భోజనాలు చేసి ఇంటికొచ్చాం.

"ఇన్నాళ్లూ ఆషామాషీగా చదివాను. ఇక లాభం లేదు. ఇది నా కొంప ముంచింది. ఇక నుంచీ నేనూ కష్టపడి చదవాలి. ఇలాగే ఉద్యోగం తెచ్చుకోవాలి. లేకపోతే నా పరువు పోతుంది" అన్నాడు ఆ ఏడాదే ఇంజనీరింగ్‌లో చేరిన నా మనవడు.

"హమ్మయ్య ఇప్పటికైనా జ్ఞానోదయం అయింది" అన్నారు అబ్బాయీ, కోడలూ.

మరో నెల రోజులు గడిచిపోయాయి. ఒకరోజు భారతి కాలేజీకి వెళ్తూ నా దగ్గరికి వచ్చింది.

"మామ్మా ఇవ్వాళ నాకు క్లాసులు లేవు. మధ్యాహ్నం భోజనానికి నా ఫ్రెండ్‌ని తీసుకొస్తాను. ఏదైనా స్పెషల్ చెయ్యవా!" అంది.

"అలాగే దానికేం భాగ్యం" అన్నాను నేను.

మామూలు వంటతోబాటు పులిహోర, రవ్వకేసరి చేసి ఇల్లు నీట్‌గా సర్ది నేనూ చీర మార్చుకుని కూర్చున్నాను.

పన్నెండు దాటాక వచ్చింది భారతి. వెంట ఒక అబ్బాయి.

ఫ్రెండ్ అంటే అమ్మాయేమో అనుకున్న నేను ఆశ్చర్యం దాచుకుని ఆహ్వానించాను.

"మామ్మా! ఇతను నా క్లాస్‌మేట్. చాలా క్లోజ్ ఫ్రెండ్ కూడా. పేరు సురేష్" అంటూ పరిచయం చేసింది.

వినయంగా నమస్కరించాడు అతను.

కాసేపు కబుర్లు చెప్పి లోపలికి వెళ్లి వడ్డించాను.

భోజనానికి కూర్చున్నారు ఇద్దరూ. వాళ్లిద్దరి చనువూ చూసి నాకు అనుమానం కలిగింది. మధ్యాహ్నం రెండింటిదాకా వుండి వినయంగా శలవు తీసుకుని వెళ్లిపోయాడు సురేష్.

భారతి వచ్చి నా పక్కన కూర్చుంది.

"మామ్మా! ఎలా వున్నాడు నీక్కాబోయే మనవడు? " అని అడిగింది.

ఏం చెప్పాలో తోచలేదు నాకు.

అంత పెద్ద నిర్ణయం వంటరిగా తీసేసు కుంది. కాబోయే మనవడని ఖచ్చితంగా చెప్తోంది. ఇంకేం మాట్లాడతాను?

అయినా అభిప్రాయం చెప్పడానికి నేనె వర్ని? అందుకే నవ్వేసి వూరుకున్నాను.

ఆ రాత్రి భోజనాలు అయ్యాక అందర్నీ హాల్లో సమావేశపరిచి ఆ విషయం బయ టపెట్టింది. నాకంటే ఎక్కువగా ఆశ్చర్యపో యారు అబ్బాయి, కోడలు, మనవడు.

"సురేష్‌ని ఇంటికి తీసుకొచ్చాను. మామ్మ చూసింది. ఏం మామ్మా నువ్వు చూశావు కదూ! ఎలా వున్నాడో చెప్పు" అంది.

నేను నోరు విప్పేలోగానే అబ్బాయి అందుకున్నాడు,

"అతడి అందచందాలు తర్వాత వింటాను. అసలతను ఎవరు? ఏ కులం? వాళ్ల కుటుంబ వివరాలు ఏమిటి? స్థితిగ తులు ఏమిటి? " అని అడిగాడు.



"ఈ రోజుల్లో కూడా ఇవన్నీ అవసరమా నాన్నా? " అని ప్రశ్నించింది భారతి.

"అక్షరాలా అవసరమే. ఎందుకంటే ఇక్కడినుంచి అక్కడికి వెళ్లే ఆడపిల్లవి. ఇక్కడి వాతావరణమే అక్కడ కూడా సమకూరితే ఎడ్జస్ట్ అవడం తేలిక. అందుకే సమాన వియ్యం అన్నారు పెద్దవాళ్లు. కాబట్టి ఆ కుటుంబం గురించి తెలుసుకోవడం అత్యవసరం!" అన్నాడు అబ్బాయి.

సరే అంటూ చెప్పుకొచ్చింది భారతి. వాళ్లది మా కులమే. సురేష్ తండ్రి ఏదో కంపెనీలో కొన్నాళ్లు పనిచేసి ప్రస్తుతం ఖాళీగా వున్నాడుట. ఆవిడకి ఉద్యోగం లేదు. వాళ్లకి అయిదుగురు పిల్లలు. ముగ్గురు మగ. ఇద్దరు ఆడ. పెద్ద వాడికి పెళ్లి అయింది. రెండోవాడు ఆర్మీలో ఉద్యోగం చేస్తున్నాడు. తర్వాత అమ్మాయికి పెళ్లయింది. సురేష్ నాలుగోవాడు. ఆ తర్వాత ఒక ఆడపిల్ల. డిగ్రీ చదువుతోంది. స్వంత ఇల్లుంది. సురేష్‌కి ఇంకా ఉద్యోగం రాలేదు. అతనికి కూడా ఉద్యోగం వచ్చాక పెళ్లి చేసుకుంటారు.

వివరాలన్నీ చెప్పి లోపలికి వెళ్లిపోయింది భారతి.

నేనూ, అబ్బాయి, కోడలు మిగిలాం. చేదు తిన్నట్లు మొహాలు పెట్టుకుని కూర్చున్నారు భార్యాభర్తలు.

"వివరాలని బట్టిచూస్తే ఆయన నాకంటే ఏ రెండు మూడేళ్లో పెద్ద అయివుంటాడు. ఆ రోజుల్లోనే ఫేమిలీ ప్లానింగు బాగా అమల్లో వుంది. ఇద్దరు పిల్లలతో సరిపెట్టుకునే రోజుల్లో అయిదుగురు పిల్లల్ని కన్నాడంటేనే తెలిసిపోతోంది. ఆయన మన స్తత్వం. దానికి సాయం ఉద్యోగం లేకుండా వూరికే వున్నాడంటేనే నాకు నీరసం వస్తోంది. మనకూ వాళ్లకీ బోలెడంత తేడా వుంటుంది ఆలోచనా విధానంలో

"ఈ అబ్బాయి దీనికంటే రెండేళ్లు పెద్దవాడు. అయినా దాని క్లాస్‌మేట్ అంటే చదువులో కాస్త వెనకపడినట్లే అర్థం. అంటే తెలివి తేటల్లో ఖచ్చితంగా దీనికంటే ఓ మెట్టు తక్కువే అన్నమాట. ఏమిటీ సంబంధం? నాకేమిటో అయోమయంగా వుంది" అన్నాడు అబ్బాయి.

"మీరు చెప్పింది మరీ బాగుంది. ఇదేదో మీరు చూసిన సంబంధం అయినట్లు మంచి చెడ్డలు విచారిస్తున్నారు? ఇది ప్రేమ వివాహం. అమ్మాయి ఎంచుకుని మన చెవిన వేసింది. దాని మాటల్ని బట్టి చూస్తే అన్నీ నిర్ణయించుకున్నట్లు తెలుస్తూనే వుంది. అయినా మనుషుల్ని చూడకుండా అంచనాలు వెయ్యడం తప్పుకదూ! మంచి రోజు చూసి వాళ్లింటికి వెళ్దాం. కంటితో చూస్తే మన అభిప్రాయాలు మారతాయేమో" అంది కోడలు.

మర్నాడు భారతితో ఆ మాటే చెప్పింది కోడలు.

"అట్లాగే సమయం చూసి నేను చెప్తాను. అప్పుడు వెళ్లండి" అంది భారతి.

మరికొద్ది రోజులకి సురేష్‌ని తీసుకొచ్చి తల్లిదండ్రులకి పరిచయం చేసింది భారతి. అబ్బాయి చాలాసేపు అతనితో మాట్లాడాడు.

"ఏమిటో ఈ అబ్బాయి. కాసేపు ఓ మాట అంటాడు కాసేపు మరోమాట అంటున్నాడు" అన్నాడు అతను వెళ్లాక.

భారతి చదువు పూర్తి అయింది. ఉద్యోగంలో చేరింది. సురేష్ ఇంకేదో కోర్సులు చేస్తానని అందులో చేరాడుట. అవి పూర్తి అయ్యాక ఉద్యోగం చూసుకుంటాడు.

"ఉద్యోగం దొరికిన తర్వాత పెళ్లి చేసుకుంటాం. ఈలోగా కావాలనుకుంటే మీరు వెళ్లి వాళ్ల వాళ్లతో మాట్లాడి రండి" అంది భారతి.





ఆయనతో ఫోన్లో మాట్లాడాడు అబ్బాయి. వాళ్లింట్లో ఫోన్ లేదు. పక్కింటివారికి ఫోన్ చేస్తే వాళ్లు పిలుస్తారు. అలాగే పిలిపించి మాట్లాడాడు.

"అలాగే మంచి రోజు చూసుకుని రండి" అన్నాడుట ఆయన.

"ఆ మంచి రోజేవిటో మీరే నిర్ణయించి చెప్పండి" అన్నాడుట అబ్బాయి.

"సరే అలాగే కేలెండరు చూసి ఫోన్ చేస్తాను" అన్నాడుట ఆయన.

పదిహేను రోజులు ఎదురు చూసి మా అబ్బాయే మళ్లీ ఫోన్ చేశాడు.

ఫలాని రోజు మధ్యాహ్నం మూడు గంటలకి రమ్మని చెప్పారుట.

భార్యాభర్తలిద్దరూ శలవులు పెట్టారు. వద్దు అంటున్నా వినకుండా నన్నూ బయలుదేరదీశారు.

"ముగ్గురం ఎందుకురా" అన్నాను నేను.

"మరేం ఫర్వాలేదు. అంతగా అయితే వీడినీ తీసుకు వెళ్దాం" అన్నాడు కొడుకుని చూపించి.

"పెళ్లి మాటలకి నేను ససేమిరా రాను" అన్నాడు వాడు.

"మమ్మల్ని దింపేసి ఓ అయిదు నిముషాలుండి వచ్చెయ్" అన్నాడు అబ్బాయి.

అనుకున్న సమయానికే పళ్లూ స్వీట్లూ పట్టుకుని వెళ్లాం. ఇల్లు పాతగా వుంది. ఏ జన్మానా సున్నానికీ రిపేర్లకీ నోచుకోనట్లుగా వుంది. బయట గేటు తెరవగానే నక్కలు ఊళ పెట్టినట్లుగా శబ్దం వచ్చింది. మమ్మల్ని చూసి ఆదరంగా ఎదురొచ్చారు అందరూ. మర్యాదగా ఆహ్వానించారు.

లోపలికి వెళ్లాం. ఇల్లు చూపించారు. వరుసగా రైలు పెట్టెల్లాగా రెండు గదులూ, వంటిల్లు. పక్కనా అంతే పోర్షను వుందిట. కాస్త సందడిగా వుంటుంది కదా అని అద్దెకిచ్చారుట. మేడమీద గది వుందిట. అది రేకులదిట. అదీ ఓ స్టూడెంటుకి అద్దెకి ఇచ్చారుట. ఇంటికి తగ్గట్టుగానే పాత కుర్చీలు, మంచాలూ.

ఇల్లంతా తిప్పి చూపించి ముందు గదిలో కూర్చోబెట్టారు. వెండి గ్లాసులతో మంచి నీళ్లు ఇచ్చారు.

"ఏమిటో స్టీలు బొచ్చెలు మాకు నచ్చవు సుమండీ. ఇంట్లో వెండే వాడతాం" అంది ఇంటి ఇల్లాలు.

అత్తగారూ ఆవిడ పెద్దకోడలూ బాగా పాత బడిపోయిన పట్టుచీరెలు మూరెడం చువి కట్టుకున్నారు. కూతురు, మనవరాలు పట్టుపరికిణీలు కట్టుకున్నారు. నేనూ, నా కోడలూ మామూలు చీరలే కట్టుకున్నాం. వాళ్లింట్లో పూజలూ, వ్రతాలూ అయినా, ఇలాంటి ప్రత్యేకమైన సందర్భాలలోనూ దర్జాగా పట్టు వస్త్రాలే కట్టుకుంటారుట.

ఇంటి యజమాని స్వతంత్ర సమరంలో పాల్గొన్నాడుట. ఆయనే కాదు ఆయన తండ్రి, తాతముత్తాతలూ కూడా గొప్ప దేశ భక్తులుట. ఆయన తాతగారూ మోతీలాల్ నెహ్రూగారూ నువ్వంటే నువ్వు అనుకునేటంత దగ్గర వాళ్లుట.

"మీరు ఆంధ్రకేసరి సినిమా చూశారా? " అని అడిగాడు హఠాత్తుగా!

"చూశాం" అన్నాడు మా అబ్బాయి.

ఆ సినిమాలో ప్రకాశంగారు గుండుకెదురుగా గుండె పెట్టిన సమయంలో కుడి చేతి వైపున రెండో మనిషే వాళ్ల తండ్రిగారుట

"మీ తండ్రిగారు సినిమాల్లో నటించే వారా? " అని అడిగాడు అబ్బాయి.

కాదు ఒరిజినల్‌గా జరిగినపుడు ఆయనక్కడ వున్నాడుట. ఆ సంగతి తెలిసి విజయచందర్ పనిగట్టుకుని ఈయన్ని పిలిపించి వివరాలడిగి తెలుసుకుని మరీ చిత్రించారుట ఆ దృశ్యం. ఇలాటి కబుర్లే కాసేపు చెప్పి తర్వాత సూటిగా విషయంలోకి దిగి



పోయాడు.

"మా సురేష్ చెప్పాడు విషయం అంతా వాళ్లిద్దరూ పెళ్లి చేసుకోవాలనుకున్నారుట. మాది చాలా సాంప్రదాయమైన కుటుంబం. ఈ ప్రేమ పెళ్లిళ్లు మా ఇంటావంటా లేవు. అయినా పిల్లలని కొంత వయసు వచ్చాక స్నేహితుల వలె చూడాలన్నది నా పాలసీ" అన్నాడు ఆయన.

"అవును ఆ మాట అక్షరాలా నిజం" అన్నాడు అబ్బాయి.

"కట్నాలూ అవీ కూడా నాకిష్టం వుండవు. లక్షణంగా కొడుకు పెళ్లి చేస్తూ పరాయి వాళ్ల దగ్గర డబ్బు పుచ్చుకోవడం ఏమిటీ? సంస్కార హీనం కాకపోతే!" అన్నాడు ఆయన.

"అలా అని వాళ్లూరుకుంటారా మీ పిచ్చి కాకపోతేనూ! వాళ్ల అమ్మాయికి ఇవ్వ దల చుకున్నది ఏదో ఇవ్వరా ఏమిటి? ఆ మాట కొస్తే మా అమ్మాయిదీ ప్రేమ వివాహమే. మా అమ్మాయి ఇంటరు చదువుతుండగా ప్రేమించాడు మా అల్లుడు. అప్పుడే పెళ్లి చెయ్యం అంటే అలాగే అని అమ్మాయి పీ. హెచ్. డీ చేసేదాకా ఆగి అప్పుడు పెళ్లి చేసుకున్నాడు" అంది సురేష్ తల్లి.

"మీ అమ్మాయి ఏ సబ్జెక్ట్‌లో పీ. హెచ్. డీ చేసింది? " అని అడిగింది మా కోడలు.

"భారతంలో స్త్రీ పాత్ర అనే అంశం మీద థీసిస్ సబ్మిట్ చేసింది. పీ. హెచ్. డీ రావా లంటే వాళ్ల చుట్టూ ప్రదక్షిణలు చెయ్యా లిట. అదంతా ఎవరు తిరుగుతారు నాన్న గారూ అంది. సరే మానెయ్ తల్లీ! నువ్వేం చదివి ఉద్యోగాలు చెయ్యాలా అన్నాను" అన్నాడు ఆయన.

"అవునండీ... ఆడది ఉద్యోగం చేస్తే ఇంట్లో మగవాడికి సుఖం వుండదు. ఆ రోజుల్లో నేను కావాలనుకుంటే చిటికెలో ఉద్యోగం దొరికేదే! నాకే ఇష్టం లేక మానే శాను" అంది ఆవిడ.

"మరి మా అమ్మాయి ఉద్యోగం చేస్తోంది కదా! ఆ విషయంలో మీకేం అభ్యంతరం వుండదుకదా!" ముందు జాగ్రత్త కోసం అడి గాడు అబ్బాయి.

"అబ్బే! నాకేం అభ్యంతరం లేదు. అంతగా అభ్యంతరం అయితే మా అబ్బాయే వద్దంటాడు" అన్నాడాయన ఉదా రంగా.

"అంతేలెండి పెళ్లయ్యాక వాళ్లిష్టం. నిజం చెప్పాలంటే కోడలు సంపాదించి పోషించా ల్సిన అవసరం మాకు లేదు. రేపోమాపో రాజాలాంటి ఉద్యోగం వస్తుంది. దాంతో వాళ్లిద్దరూ దర్జాగా బతకొచ్చు ఇక ఆస్తి పాస్తులంటారా అవే అమరిపోతాయి. ఆమధ్యన ఎక్కడో స్థలం చూశాడుట. పెళ్లి విషయం తేలితే వాడిపేర కొందామనుకుం టున్నారు వాళ్ల నాన్నగారు. స్థలం వుంటే ఇల్లెంతసేపు కట్టాలి. మొన్నామధ్య మాకు తెలిసిన వాళ్ల అబ్బాయికీ ఇలాగే స్థలం కొన్నారు వాళ్ల తండ్రిగారు. పెళ్లవగానే అందులో ఇల్లు కట్టించేశారు వాళ్ల మామ గారు. వాళ్లూ మీలాగే భార్యాభర్తా బ్యాంకు లోనే ఉద్యోగాలు చేస్తున్నారుట. ఏమిటో లెండి ఇవన్నీ ఒకరడిగేవీ మరొకరు ఇచ్చే వీనా ముచ్చటలు అంతే" అందావిడ నవ్వుతూ.

మరో అరగంట కూర్చుని వచ్చేశాం. కూర్చున్నంతసేపూ అదే ధోరణిలో మాట్లా డుతూపోయారు ఆ దంపతులు. వాళ్లేం చెప్పదల్చుకున్నారో ఓ పట్టాన అర్థం కాలేదు మాకు. ఆటోలోనే తల పట్టుకుని కూర్చు న్నాడు అబ్బాయి. కోడలి మొహాన నవ్వు ఎగిరిపోయింది.

ఇంటికి రాగానే భారతిని దగ్గర కూర్చో బెట్టుకుని ఎన్నో విధాల నచ్చచెప్పాడు అబ్బాయి. అన్నీ విన్నది.

"ప్రేమ వివాహం అంటే ఒకవిధమైన





నెగెటివ్ మైండ్‌తో ఆలోచిస్తారు పెద్దవాళ్లు. మీరూ అలాగే ఆలోచిస్తున్నారు. వాళ్లది కాస్త పాత పద్ధతులున్న ఇల్లు. అంతే. అంతకుమించి మరేం లేదు. మీరు అనవసరంగా భయపడకండి.

పెద్దవాళ్లు చేసే పెళ్లిళ్లల్లో కూడా ఆలోచించేది అబ్బాయి గురించే కదా! అబ్బాయితో బాటు అత్తగారూ ఆడపడుచూ అందరూ నచ్చేదాకా ఆగరుకదా నాన్నగారూ? అబ్బాయి నచ్చితే పెళ్లి జరిగిపోతుంది. తర్వాత అన్నీ అవే సర్దుకుంటాయి.

నాకు సురేష్ చాలా నచ్చాడు. అతనితో సుఖపడగలననే నమ్మకం వుంది. అది చాలదా నాన్నగారూ? మీకూ సురేష్ నచ్చాడుకదా! మా పెళ్లి జరిపించండి. వాళ్లతో నేను ఎడ్జస్ట్ అయిపోతాను" అంది భారతి.

సరే నీ ఇష్టం అన్నాడు అబ్బాయి. మరో ఆరు నెలల తర్వాత సురేష్‌కి ఉద్యోగం వచ్చింది. భారతికంటే జీతం తక్కువ అని సణుక్కుంది కోడలు. పెళ్లికి ముహూర్తాలు పెట్టారు. స్వంత ఇంట్లో ఇరుకు అవుతుంది అని వేరే ఇల్లు చూసుకున్నారు. ఇంటికి కావలసిన సామాన్లన్నీ కొన్నాడు అబ్బాయి.

పెళ్లి జరిగిపోయింది. భారతి అత్తవారింటికి వెళ్తుంటే నా గుండె చెరువైపోయింది. ఎంత ఆపుకున్నా దుఃఖం ఆగలేదు. భారతే నన్ను ఓదార్చింది. ఈ ఊళ్లోనే వుంటాగా మామ్మా. రోజూ వస్తాను. అసలు నిన్నే నాతో తీసుకు వెళ్తాను" అంది.

"నేను వచ్చినా నువ్వూ మీ ఆయనా ఉద్యోగాలకి వెళ్తే నేనేం చెయ్యను మునిమనవడు వచ్చాక వస్తానులే" అన్నాను.

నవ్వింది భారతి. దంపతులిద్దరూ హనిమూన్ వెళ్లివచ్చారు. ఉద్యోగాలలో జాయిన్ అయిపోయారు. అల్లుడికి స్కూటర్ కొనిచ్చాడు అబ్బాయి.

ఒకరోజు సాయంత్రం బయలుదేరి భారతీవాళ్లింటికి వెళ్లాను. నన్ను చూసి ఆనందంతో కేరింతలు కొట్టింది.

"ఈ పూటకి నేను వండి పెడతానే తల్లీ" అన్నా వినిపించుకోకుండా,

"నువ్వు కదలడానికి వీల్లేదు. నా వంట రుచి చూసి చెప్పు" అంది.

"అవును అమ్మమ్మగారూ భారతి వండుతుంది. మీరు నాతో కబుర్లు చెప్పండి" అన్నాడు సురేష్.

నన్ను డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చోబెట్టి దంపతులిద్దరూ పనుల్లో మునిగిపోయారు. నాతో మాట్లాడుతూనే పన్లన్నీ పూర్తి చేశారు.

టైములు కుదరవని పనిమనిషిని పెట్టుకోలేదుట. భారతి గిన్నెలు కడుగుతూ వుంటే సురేష్ వాటిని బట్టతో తుడిచి నీట్‌గా సర్దేశాడు.

అది ఇల్లు చిమ్ముతుంటే అతను బట్టలు మడతలు పెట్టాడు.

అది వంట చేస్తూ వుంటే అతను బజార్నించి తెచ్చిన కూరలన్నీ కడిగి శుభ్రం చేసి ప్లాస్టిక్ సంచుల్లో వేసి ఫ్రిజ్‌లో పెట్టాడు.

ఇద్దరూ కలిసి కంచాలు గ్లాసులూ టేబుల్ మీద అమర్చారు. భారతీ, సురేష్, అని ఒకర్నొకరు ప్రేమగా పేర్లు పెట్టే పిలుచుకుంటూ చిలకాగోరింకల్లా తిరుగుతూ వుంటే చూడముచ్చట వేసింది నాకు. దాంపత్యం అంటే ఇదీ అనిపించింది. సరదాగా కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేశాం.

ఎన్నో పాత విషయాలు అడిగి తెలుసుకుని ఆ కబుర్లన్నీ చెప్పించుకొని ఆనందించాడు సురేష్.

భోజనాలు కాగానే మాయాబజార్లోలాగా ఆ గిన్నెలన్నీ తీసేసి కడగాల్సినవి కడిగేసి, ఫ్రిజ్‌లో సర్దేవి సర్దేసి, పాలు తోడుపెట్టి వంటిల్లు అద్దంలా సర్ది బయటపడ్డారు దంపతులు.



"ఇక నేను బయలు దేరతాను" అన్నాను. రాత్రికి వుండి వెళ్లమని బలవంతం చేశారి ద్దరూ.

వద్దు మళ్లీ వస్తానని చెప్పాను.

ఇద్దరూ గదిలోకి వెళ్లి అయిదు నిము షాల తర్వాత బయటికి వచ్చారు. వాళ్ల చేతుల్లో కొత్త చీర.

ఎందుకే తల్లీ ఇవన్నీ అన్నా వినలేదు.

"మొదటిసారి మా ఇంటికి వచ్చావు మామ్మా" అంటూ చీర చేతికిచ్చి నమ స్కారం చేశారు.

మనసారా దీవించాను.

కట్టుకోమని బలవంతం చేసింది. కట్టుకు న్నాను తెల్లటి పట్టుచీర. సన్నజరీ అంచు. ఎంతో అందంగా వుంది. నా మనవరాలి మనస్సంత స్వచ్ఛంగా వుంది.

ఇల్లు తాళం పెట్టి ఇద్దరూ నాతో బయ లుదేరారు. కొంత దూరం నడుచుకుంటూ వచ్చి నన్ను ఆటో ఎక్కించారు.

ఇంటికొచ్చి అన్నీ వివరంగా చెప్పాను.

"ఒరే అబ్బాయ్ నీ అల్లుడిని చూసి నేర్చు కోరా! భార్యకి ఎంత చక్కగా సాయం చేస్తు న్నాడో. చూడముచ్చటవేసింది. నువ్వూ వున్నావు ఎందుకూ? ఇవతల పుల్ల తీసి అవతల పెట్టవు" అన్నాను.

"సరేలెండి. నాకు సహాయం చెయ్యొద్దు. తన వస్తువులు తను సర్దుకుంటే, వెతు క్కుంటే అదే పదివేలు" అంది కోడలు.

"ఆ నా మొహం! ఇంత వయసు వచ్చాక నేనేం మారతాను? ఇలాగే మరికొంత కాలం సర్దుకుపో" అన్నాడు అబ్బాయి.

ముందు ఏదో భయపడినా భారతి సంసారం చక్కగా వున్నందుకు అందరం ఆనందించాం.



రోజులు శరవేగంతో గడిచిపోసాగాయి. భారతి ఆ కంపెనీ వదిలేసి మరింత జీతం మీద వేరే కంపెనీలో చేరింది.

ఏడాది గిర్రున తిరిగి వచ్చింది. ఆర్భా టంగా మొదటి మేరేజిడే జరుపుకున్నారు భారతి, సురేష్.

అందర్నీ పిల్చి మంచి హోటల్లో పార్టీ ఇచ్చారు. కేక్ కట్ చేశారు. ఆ తర్వాత అందరికీ డిన్నర్.

"ఏమిటే భారతీ! ఇంకా చడీ చప్పుడూ లేదు. అప్పుడే ఏడాది అయిందికదా!" అన్నారు కొంతమంది అటువైపు పెద్దవాళ్లు.

"అమ్మ బాబోయ్! అప్పుడే చడీ చప్పుడూ అయితే ఆరిపోతాం. మరో రెండేళ్లు పోయాక అప్పుడాలోచిస్తాం" అంది భారతి నవ్వుతూ.

ఆ మరుసటి నెలలో భారతికి ఫారెన్ ఛాన్సు వచ్చింది. వాళ్ల కంపెనీ వాళ్లే పంపి స్తారు. ఆరు నెలలు ట్రైనింగ్ట.

సరదాపడిపోయింది భారతి. అంతకంటే ఆనందపడిపోయాడు సురేష్.

"అంతమందిలో భారతికి ఒక్కర్తికే వచ్చిందీ ఛాన్స్. షీ ఈజ్ గ్రేట్. నాకెంతో

గర్వంగా వుంది" అన్నాడు.

ఏమాత్రం ఈర్ష్యాసూయలు లేకుండా భార్య వున్నతికి గర్విస్తున్న అతడిని చూసి చాలా సంతోషించాం అందరం. అన్నీ సర్దుకుని ప్రయాణానికి సిద్ధమైంది భారతి.

వీడ్కోలు ఇవ్వడానికి అందరం విమానాశ్రయానికి వెళ్లాం. ఎంతో అందంగా వుంది విమానాశ్రయం.

అందరికీ కాఫీలు ఇప్పించింది భారతి. మైక్‌లో ఎనౌన్స్‌మెంట్ వినగానే లేచి మా అందరికీ పేరు పేరునా చెప్పి ఒక ఎయిర్ బాగ్ భుజాన తగిలించుకుని హేండ్‌బాగ్ మరో భుజాన తగిలించుకుని చకచకా నడుస్తూ వెళ్తూ వుంటే నా కళ్లను నేనే నమ్మలేకపోయాను.

అద్దాల తలుపుల్లోంచి మేము చూస్తుండగా దర్జాగా వెళ్లి విమానం ఎక్కేసింది.

చూస్తుండగానే రివ్వున ఎగిసింది విమానం. బాంబే వెళ్లి అక్కడ ఇంటర్నేషనల్ విమానం ఎక్కుతుందిట.

ఆ రాత్రి అంతా నిద్రేపట్టలేదు నాకు. పదేపదే ఆ మధుర దృశ్యాన్ని మననం చేసుకుంటూ పడుకున్నాను.

వెళ్లిన రెండోరోజు ఫోన్ చేసింది. క్షేమంగా చేరిందిట.

"అక్కడంతా చాలా బాగుందిట. నా గురించి మీరేం దిగులు పడకండి" అని మరీమరీ చెప్పింది.

మరుసటి నెలలో ఒక రోజు సురేష్ వచ్చాడు.

"ఒక్కడినీ వుండాలంటే బోర్‌గా వుంది. అందుకే ఇల్లు ఖాళీ చేసి అమ్మా వాళ్లింటికి వెళ్లిపోతున్నాను. భారతి వచ్చాక ఎలాగూ ప్రమోషన్ వస్తుంది. ఇల్లూ, కారూ, వాళ్లే ఇస్తారు. అంతగా వాళ్లు ఇవ్వకపోతే అప్పుడే వేరే ఇల్లు తీసుకోవచ్చు" అన్నాడు.

అబ్బాయి కాస్త సణిగాడు. "ఆ ఇల్లు అసలే ఇరుకు. ఇంత సామాను వేసుకుని అక్కడికి వెళ్తే మరీ ఇరకాటం అయిపోదూ! అర్థంలేని పని చేస్తున్నాడు" అన్నాడు.

"ఒంటరిగా ఎట్లా వుంటాడు? కాలక్షేపం కాక స్నేహితులని పోగేసి పార్టీలూ పేకాటలూ మొదలుపెట్టే బదులు ఇది నయం కదా!" అంది కోడలు.

"అంత కాలక్షేపం కాకపోతే ఇల్లు తాళం పెట్టి ఈ ఆర్నెల్లూ వాళ్ల అమ్మా వాళ్లింట్లో వుండచ్చుగా! ఇల్లు ఖాళీ చేసి సామాన్లతో సహా తరలి వెళ్లడం ఎందుకు? " అన్నాడు అబ్బాయి.

"ఏదో పోనివ్వండి. అతనిష్టం. మనని సలహా అడిగాడా మని అభిప్రాయం చెప్పడానికి" అనేసింది కోడలు.

తర్వాత ఓ రోజు వచ్చి ఇల్లు ఖాళీ చేసేశానని చెప్పాడు. ఆ తర్వాతి నెల్లో ఆదరాబాదరా వచ్చాడు సురేష్. వెంట తల్లీ తండ్రి, అన్నా, వదినా దర్జాగా పట్టు చీరలు కట్టుకుని మరీ వచ్చారు. చేతిలో కుంకం భరిణె.

వాళ్ల అబ్బాయి పెళ్లి కుదిరిందిట. మరో పది రోజుల్లో ముహూర్తాలు పెట్టుకున్నారుట.

"అంతా హఠాత్తుగా అయిపోయింది. అసలు నిశ్చయం చేసుకున్ననాడే మిమ్మల్ని పిలుద్దామని అనుకున్నాం. కుదర్లేదు. భారతి వచ్చేదాకా పెళ్లి ఆపుదాం అనుకున్నాం. కానీ అవతలవాళ్లు తొందరపడుతున్నారు. మీరు నాల్రోజులు ముందుగానే రావాలి" అని మరీమరీ చెప్పారు.

ఇంకా పెళ్లివారి వివరాలు, పెళ్లి కబుర్లూ చెప్పి కాఫీ ఫలహారాలు సేవించి వెళ్లారు.

హఠాత్తుగా కుదిరింది పెళ్లి. సమయానికి భారతి దగ్గర లేదు. వుంటే ఎంతో నిండుగా వుండేది అనుకున్నాం. పెళ్లికూతురికి మంచి బహుమతి కొనుక్కుని పెళ్లికి వెళ్లాం.



పెళ్లి ఒక గుడి పక్కన, సుమారైన కళ్యాణ మండపంలో చేసేరు.

అనవసరమైన ఆర్భాటాలవీ లేకుండా సింపుల్‌గానే వున్నాయి ఏర్పాట్లు. ఆ మాటే అంటే

"అవునుమరి కొడుకు పెళ్లి అయితే అవి కావాలి ఇవి కావాలి అని అడిగి చేయించు కున్నారు. అవన్నీ కూతురి పెళ్లికి చెయ్యా లంటే చేతి చమురు వదుల్తుందికదా!" అన్నాడు అబ్బాయి మాకుమాత్రమే వినిపిం చేలా.

ముహూర్తం అయింది. జనం కొంచెం పలచబడ్డారు.

భారతి అత్తగారు మా దగ్గరకు వచ్చింది.

"ఫలహారాలు చేశారా? కాఫీ తాగారా?" అని మర్యాదగా కనుక్కుంది. "ఇదుగో భోజనం వడ్డించేస్తారు. భోజనాలు చెయ్యండి. హడావిడిగా వెళ్లిపోకూడదు. అప్పగింతలయి పిల్ల వెళ్లేదాకా వుండి అప్పుడు వెళ్లాలి" అని నాలుగుసార్లు చెప్పింది. మా దగ్గర్నించి కదిలి వెళ్లి నాలుగు కుర్చీల అవతల కూర్చుని వున్నవా ళ్లని ఎవర్నో పలకరించింది.

"పెళ్లి బాగా చేశారండీ" అన్నారు వాళ్లు.

"ఏం బాగా చెయ్యడమో లెండి. మీరు కదిలిస్తే కళ్లనీళ్లు వస్తాయి నాకు. కడసారి పిల్ల పెళ్లి ఘనంగా చెయ్యాలని ఎన్నో కలలు కన్నాను. తీరా చూస్తే ఇలా చప్పగా జరిగిపోయింది. ఏం చేద్దామన్నా వ్యవధి ఏది? అంతా హడావిడిగా అయిపోయింది. అంత అర్థాంతరంగా పెళ్లి చెయ్యాలంటే మాటలా! ఈ రోజుల్లో ఇద్దరు సంపాదించుకుంటూ వున్నవాళ్లే పెళ్లిళ్లు సూక్ష్మంగా తేల్చేస్తుంటే మా లాంటివాళ్లం ఏం చేస్తాం?

"పోనీ పెళ్లితో ఆగితే అదోదారి. వెంటనే కాపురానికి తీసుకు వెళ్తామని అన్నారు. కాపురానికి పంపాలంటే నాలుగూ అమర్చాలా వద్దా? అందులోనూ కడసారి పిల్ల! ఆయన ఏదో లోన్‌కి పెట్టారుట. మన వెర్రిగానీ లోన్లు అంత తొందరగా వస్తాయా? అందుకే ఏం చేద్దామా అని తలలు పట్టుకున్నాం. మా చిన్నబ్బాయి కల్పించుకుని సలహా చెప్పాడు. పోనీ నా సామాన్లు చెల్లెలికి ఇచ్చేద్దాం. నాన్నగారి లోను వచ్చాక నేను కొనుక్కుంటాను అన్నాడు

"అదేమిట్రా శుభమా అని పిల్ల పెళ్లి చేసుకుని వెళ్తూ వుంటే నీ పాత సామాన్లు ఇస్తానంటావా! అని కేకలేశాను. కానీ మా చిన్నమ్మాయి 'నాకలాంటి పట్టింపులేమీ లేవమ్మా! వదిన మాత్రం పరాయిదా? నా తోడబుట్టిన అక్కలాంటిది. ఆవిడ వాడుకుంటే మాత్రం నాకేం అభ్యంతరం లేదు' అంది.

"చెప్పకూడదుగానీ నా బిడ్డలు రత్నాల్లాంటి వాళ్లు. కుళ్లూ కుత్సితం లేవు. సరే అందరికీ అంగీకారమే కదా అని మా భారతి సామాన్లన్నీ పాక్ చేయించి పంపించేశాం.

"ఎలాగూ భారతి వచ్చేసరికి ఆయన లోన్ శాంక్షన్ అవుతుంది. అప్పుడు వాళ్లు కొత్తవి కొనుక్కుంటారు" అంటూ పెద్ద గొంతుతో మాకు వినపడేలా చెప్పి,

"మళ్లీ వస్తా బోలెడంత పని" వుంది అని లోపలికి వెళ్లిపోయింది.

అయోమయంగా మొహమొహాలు చూసుకుంటూ వుండిపోయాం. అతికష్టంమీద భోజనాలు అయ్యేదాకా ఆగి వాళ్ళకి చెప్పి ఇంటికి వచ్చిపడ్డాం.

"ఇదెక్కడి విచిత్రం? భారతికి మనం ఇచ్చిన సామాన్లన్నీ వాళ్ళ కూతురికి ఇవ్వడం ఏమిటి అత్తసొమ్ము అల్లుడు దానం చేసినట్లు. అలా చెయ్యడానికి వాళ్ళకి మనసెలా అంగీకరించింది? " అన్నాడు అబ్బాయి ఆగ్రహంగా.

"కలర్ టీ.వి., ఫ్రిజ్, డబుల్‌కాట్లు, డైనింగ్ టేబుల్, డ్రెస్సింగ్ టేబుల్, బీరువా, సోఫాలు, ఇవిగాక వంటింటి సామాను అన్నీ ఇచ్చాం. తల్చుకుంటే కడుపు మండిపోతోంది. అవన్నీ ఎవరికో ఇచ్చేస్తే దానికేం మిగుల్తాయి? రేపది వచ్చాక ఏం చేస్తుంది?

పైగా లోన్‌కి పెట్టాం రాగానే కొంటాం అని చెప్తోంది ఆవిడ. అదెంత నిజమో! ఉద్యోగం సద్యోగం లేనివాడికి అంతంత లోన్లు ఎవరిస్తారు? పెళ్ళికూతురి మెడలోని గొలుసు అచ్చంగా భారతి గొలుసు లాగానే వుంది. అది బాగుందని ఆ మోడల్‌దే చేయించామని ఆవిడ చెప్తోంది. ఇదంతా చూస్తుంటే గొలుసు కూడా ఇచ్చేశారేమో అని అనుమానంగా వుంది నాకు. బుర్ర తిరిగిపోతోంది. ఏం చెయ్యాలో తోచడం లేదు" అంది కోడలు.

"ఏం చెయ్యడం ఏమిటీ రేపే వెళ్ళి నిలదీసి అడుగుతాను. మా అమ్మాయికోసం మేమిచ్చినవన్నీ దాన్ని అడక్కుండా ఎలా ఇచ్చారని ఖచ్చితంగా అడుగుతాను" అన్నాడు అబ్బాయి.




"ఆవేశపడకురా అబ్బాయ్. అయిందేదో అయిపోయింది. ఇప్పుడు మనం గొడవచేసినా ప్రయోజనం వుండదు. అనవసరంగా గొడవలవుతాయి. ఏమో వాళ్ళు చెప్పినదే నిజం అయితే మళ్ళీ కొనిస్తారేమో. కాదూ తూర్పుకి తిరిగి దణ్ణం పెడదాం. అల్లుడికి కట్నంగా ఇచ్చాననుకో. సామాన్లు కాబట్టి లెక్కకి కనిపిస్తున్నాయి. అదే డబ్బు రూపంలో ఇచ్చివుంటే ఆ డబ్బు వాళ్ళేం చేస్తారో మనకి చెప్తారా? కట్నం డబ్బులు వాళ్ళ ఖర్చులకే వాడుకుంటారు అందరూ ఇదీ అటువంటిదే అనుకో" అన్నాను.

"అదీ నిజమేలే అమ్మా" అన్నాడు అబ్బాయి నీరసంగా. భారతికి ఈ మాట చెప్పాలా అనుకుని మళ్ళీ వద్దనుకున్నారు. దూరానవుంది అసలీ పాటికి వాళ్ళే చెప్పారేమో. అయినా దానికి తెలియచేసినా అదేం చేస్తుంది. అనవసరంగా దాన్ని హైరానా పెట్టడం అవుతుంది అనుకున్నారు.

అదీ నిజమే. ఆ ఇంటికి చెందిన మనిషి అది. వాళ్ళమీద నేరాలు చెప్పడం భావ్యం కాదు. అందుకే ఆ తర్వాత అది ఫోన్ చేసినప్పుడు పెళ్ళి వివరాలు మాత్రం మాట్లాడి వూరుకున్నారు.

ఆ పెళ్ళి తర్వాత సురేష్ మా ఇంటికి రావడం బాగా తగ్గించాడు. బిజీగా వున్నాను అనేవాడు.



భారతి తిరిగి వచ్చేలోగా మరో మార్పు జరిగింది. సురేష్ పెద్దన్నయ్యకి వేరే ఊళ్ళో ఇంకేదో ఉద్యోగం దొరికి వెళ్ళిపోయాడు. కాబట్టి తల్లిదండ్రులకు తోడుగా ఆ ఇంట్లోనే వుండదల్చుకున్నాడట. సురేష్ ఫోన్‌చేసి చెప్పాడు.

"అయితే ఇకమీదట భారతికి ఉమ్మడి సంసారం అన్నమాట. ఎలా ఎడ్జస్ట్ అవుతుందో" అంది కోడలు.

"అదే అలవాటు అయిపోతుంది. రేపు మనవాడికి పెళ్ళి అయితే ఆ అమ్మాయి కూడా ఉమ్మడి కుటుంబంలోనే వుండాలి కదా" అన్నాడు అబ్బాయి.

"అవుననుకోండి. వాళ్ళకీ మనకీ పద్ధతుల్లో చాలా తేడా వుందికదా" అంది కోడలు. "మరేం ఫర్వాలేదు. తెలివిగలపిల్ల. అన్నీ అదే చూసుకుంటుంది" అని ధైర్యం చెప్పాడు.

భారతి రాకకోసం అందరం వెయ్యికళ్ళతో ఎదురుచూడసాగాం. భారతి వచ్చేసింది. మరింత రంగువచ్చి మిసమిసలాడిపోతోంది. మరికాస్త దర్జాగా హుందాగా వుంది. అందరికీ బహుమతులు తెచ్చింది. అక్కడి విశేషాలు పూసగుచ్చినట్లు చెప్పింది.

మర్నాడు డ్యూటీకి వెళ్ళింది. అనుకున్న ప్రకారం ప్రమోషన్ ఇచ్చి జీతం పెంచారుట. ఇల్లు, కారు ఇస్తాం అన్నారుట. ఇల్లు ఎందుకు? ఇక్కడే వుండాలికదా. ఆ అద్దె అడిగి తీసుకో అంతగా అయితే మేడమీద గది ఖాళీ చేయిద్దాం. అందులో వుందాం అన్నాడుట సురేష్.

పదవితో బాటు బాధ్యత, పని కూడా బాగా పెరిగాయి. భారతి రోజంతా ఆఫీస్‌లోనే వుండి రాత్రి ఏడు దాటాక ఇంటికి వెళ్ళేది. అదివరకులా చీటికీ మాటికీ దాన్ని చూడ్డానికి వెళ్ళాలంటే మాకూ మొహమాటంగా వుండేది. పోనీ అలాగే వెళ్ళినా పట్టుమని పదినిముషాలు దానితో మాట్లాడే అవకాశం దొరికేది కాదు. అందరూ వుంటే ఏం మాట్లాడతాం? అదీగాక ఆఫీస్‌నుండి వచ్చీరాగానే వంటగదిలో దూరిపోయేది. అలాంటి సమయంలో వెళ్ళి దాన్ని అవస్థపెట్టడం ఎందుకని వూరుకున్నాం. వీలు చూసుకుని అదే వచ్చివెళ్ళేది.

భారతి ఉద్యోగంలో ఒక మెట్టుపైకి

ఎక్కింది. కానీ దాని జీవితం కాస్తంత దిగజారిందనే చెప్పాలి. పని పెరిగింది. భర్త సహాయం తగ్గిపోయింది. ఇది ఆఫీస్‌నుంచి వచ్చే సమయానికి అతను ఏ స్నేహితుల ఇంటికో పోయేవాడు.

"పాపం పిచ్చిసన్నాసి తోటివాళ్ళలాగా భార్యతో సినిమాలకీ, షికార్లకీ వెళ్ళే అదృష్టం వాడికి లేదు. వాడి భార్యకి ఎప్పుడూ పీకల దాకా పనే" అని జాలిపడేది సురేష్ తల్లి.

మేడమీది గది రేకులది. వేసవికాలం భరించలేనంత వేడి, చలికాలం వస్తే వణికించే చలి. వానొస్తే ధనధనమని మోత.

"లక్షణంగా కొన్న సామాన్లన్నీ పరాయి వాళ్ళ పాలైపోయాయి. ఆ రేకుల గదిలో నవారు మంచంమీద పడుకుంటూ కాలక్షేపం చేస్తోంది. పిచ్చితల్లి నాకేమిటో దాన్ని చూస్తే దిగులుగా వుందమ్మా. మీ మామగారు కొనకపోతే నువ్వైనా కొనుక్కోవే బోలెడంత జీతం వస్తోంది కదా! అంటే "నిదానంగా చూద్దాంలే నాన్నా ఇప్పుడేవో ఖర్చులున్నాయి" అంటుంది. పోనీ నేనే కొనిస్తాను అంటే అదీ వద్దంటుంది ఎలాగమ్మా" అని బాధపడేవాడు అబ్బాయి.

ఓ రోజు భారతి ఏదో మాటల్లో చెప్పుకొచ్చింది. ఆడపడుచు పెళ్ళికోసం అప్పు చేశారుట. అది తీర్చాలిట. నాన్నని అనవసరంగా బాధపడొద్దని చెప్పు మమ్మీ. కొన్నాళ్ళు కళ్ళు మూసుకుంటే అవీ తీరిపోతాయి. అని చెప్పింది. ఆ అప్పు తీరక ముందే ఆడపడుచు నెల తప్పింది. సీమంతం ఖర్చు తర్వాత పురిటిఖర్చు ఆ తర్వాత బారసాల ఖర్చు ఆ తర్వాత మామగారి షష్టిపూర్తి ఖర్చు పన్లోపనిగా ఆవిడ లక్షవత్తుల నోము చేసుకుంది. ఆ ఖర్చు అలా అనంతంగా సాగిపోతూనే వుంది.

భారతి నెలతప్పింది. నాల్రోజులు మా ఇంట్లో వుంటుంది అని తీసుకొచ్చాం. మునుపటి కళ తగ్గిపోయింది. నీరసంగా వుంది పిల్ల. డాక్టరు దగ్గరికి తీసుకువెళ్ళారు. అన్ని పరీక్షలూ చేయించారు. అమ్మా నీకు మునిమనవరాలు పుట్టబోతోంది అన్నాడు అబ్బాయి. స్కానింగ్‌లో తెలిసిందట. కడుపులో పిండం ఎదుగుదల మామూలుకంటే తక్కువగా వుందిట. మందులు రాసి ఇచ్చారు. బాగా విశ్రాంతి తీసుకోవాలని చెప్పారు.

ఆఫీస్‌కి శలవు పెట్టింది. అన్నాళ్ళు శలవు ఇవ్వడం కష్టం అన్నారుట వాళ్ళు. అయితే ఉద్యోగం రిజైన్ చేస్తాను అందిట ఇది. వద్దులే మరోదారి చూస్తాం అన్నారు వాళ్ళు. భారతి అసిస్టెంట్ రాజా అవసరం అయినప్పుడల్లా ఇంటికి వచ్చి దాని సలహాలు తీసుకునే ఏర్పాటు చేశారు. భారతి కోసం కోడలు పదిహేను రోజులు శలవు పెట్టింది.

భారతిని మా ఇంటికి తీసుకొచ్చిన వారం రోజుల తర్వాత సురేష్, అతని తల్లి, తండ్రి వచ్చారు. దర్జాగా తయారై కోడలికోసం బుట్టెడు పళ్ళు తీసుకుని మరీ వచ్చారు. భారతిని వెంట తీసుకువెళ్తాం అన్నారు.

"ఇప్పుడే కదా వచ్చింది. మరికొన్నాళ్ళు ఇక్కడే వుండనివ్వండి. విశ్రాంతి తీసుకుంటుంది" అంది కోడలు.

"అక్కడికి వస్తే మేం రాచిరంపాన పెడతామా? " అంది అత్తగారు.

"అలా అని మేం అన్నామా? ఇటువంటి సమయంలో ఆడపిల్ల తల్లిదగ్గర వుండడం సహజం. మీరుమాత్రం మీ అమ్మాయిని తీసుకురాలేదా? ఇది పద్ధతేకదా" అన్నాడు మా అబ్బాయి.

"అవన్నీ మాకు తెలియవండీ! మా కోడలు మాత్రం మా ఇంట్లోనే వుండాలి. పెద్దకోడల్నీ పుట్టింటికి పంపలేదు మేం. ఇప్పుడు భారతికూడా మా ఇంట్లోనే





వుండాలి. పెళ్ళయిన తర్వాత ఆడపిల్లకి అత్తవారిల్లే అన్నీనూ.

ఏదో చుట్టంచూపుగా నా(ల్రోజులు పుట్టింటికి వెళ్ళిరావాలి అంతేగానీ నెలలు తరబడి భర్తని వదిలిపోతానంటే ఎట్లా? " అన్నాడు మామగారు.

"నువ్వేమంటావ్ సురేష్. నీ అభిప్రాయం చెప్పు" అన్నాడు మా అబ్బాయ్.

"ఇదంత సీరియస్ విషయమేం కాదు మామయ్యగారూ. మా అందరికీ భారతి లేకపోతే బోరు కొడుతోంది. అమ్మకి వంటరిగా వుండడం అసలు అలవాటులేదు. ఇన్నాళ్ళూ మా వదిన వుండేదికదా. ఇల్లంతా బోసిగా వుంది. అందుకే తీసుకెళదామనుకుంటున్నాం" అన్నాడు.

"అది నిజమే బాబూ. కానీ భారతి ఆరోగ్యం అంత బాగాలేదు. ఓ నె(ల్రోజులు ఆగి అలాగే తీసుకువెళ్ళండి" అంది మా కోడలు.

"ఏమో మరి మేం చెప్పాల్సింది చెప్పాం. ఇక మీ ఇష్టం. మీ అమ్మాయి ఇష్టం" అన్నారు వాళ్లు.

"మరో పదిరోజులు ఇక్కడే వుండి వస్తాను." అని తేల్చి చెప్పేసింది భారతి.

మరి కాసేపు కూర్చుని కాఫీ, ఫలహారాలు సేవించి వెళ్ళిపోయారు వాళ్ళు. సురేష్ రెండురోజులకి ఒకసారి వచ్చిపోతూనే వున్నాడు.

ఒకసారి వచ్చినపుడు చెప్పాడు. వాళ్ళ అక్క భర్తకి ఈ ఊరే ట్రాన్స్‌ఫర్ అయిందిట. ఇల్లు దొరికేదాకా ఇక్కడే వుంటారుట.

చాలా సంతోషం అన్నాం.

వాళ్ళంతా భారతిని చూడాలని ఎంతో ఉబలాటపడుతున్నారుట.

"తీసుకురాలేకపోయావా మరి? " అంది మా కోడలు.

"ఎందుకు భారతే అక్కడకి వస్తుందిగా. ఈ బుధవారం మంచిదిట. నాన్నగారు చెప్పారు. ఆవేళ తీసుకురమ్మన్నారు" అన్నారు.

గతుక్కుమన్నాం. "ఇక్కడైతే కాలు కదపకుండా అన్నీ అందిస్తున్నాం. ఆఫీసునుండి వాళ్ళ అసిస్టెంట్ వచ్చి పనులేవో చూసుకు వెళ్తున్నాడు. ఏవైనా పన్లుంటే తమ్ముడు చేసిపెడుతున్నాడు. మరి అక్కడికి వెళ్తే ఇంత విశ్రాంతిగా వుండగలదా! సరే కానీయ్ వెళ్ళనీ. ఏడో నెలరాగానే సీమంతం చేసి తీసుకొచ్చేద్దాం." అని చెప్పాను కోడలితో.

అనుకున్నట్టుగానే బుధవారం పొద్దున్నే వచ్చాడు. లక్ష జాగ్రత్తలు చెప్పి పంపించాం. మళ్ళీ బుధవారం నేను వస్తాను లేవే అమ్మడూ అని చెప్పాను. ఆ అవసరం లేకుండా మంగళవారం సాయంత్రానికే భారతి వచ్చేసింది. వస్తూనే తల్లిని కావలించుకుని బావురుమంది.

కాళ్ళూచేతులూ ఆడలేదు మాకు. కాసిని మంచినీళ్ళు తాగించి ఏడవవద్దని బతిమాలేం. తల్లిని వదిలి నన్ను కావలించుకుంది.

నమ్మి మోసపోయాను. మీరు చెప్తే వినకుండా నా లైఫ్ పాడుచేసుకున్నాను. అంటూ మొదలుపెట్టి చెప్పుకొచ్చింది.

ఇంట్లో మామగారికి ఏవో ఫిక్సెడ్ డిపాజిట్లమీద వచ్చే వడ్డీ, ఇంటి అద్దె ఆధారం. ఆడపడుచు వచ్చాక ఆ పక్కపోర్షను ఖాళీ చేయించి ఆవిడకి ఇచ్చారుట. దానితో అద్దె ఆగిపోయింది. ఖర్చులు పెరిగాయి.

ఆ ఆడపడుచుకి కాస్త నోరెక్కువ. భారతి కోసం దాని అసిస్టెంట్ రావడం ఆవిడకి అంతగా నచ్చలేదుట. గదిలో కూర్చుని గంటల తరబడి ఏమిటా కబుర్లు? భారతీ... భారతీ అంటూ పేరుపెట్టి పిలు

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

స్తాడేం? అంటూ ఏమిటో మాట్లాడిందిట.

దాంతో దీనికి ఒళ్ళుమండి నాలుగు పెట్టింది ఆవిడకి. అది వాళ్ళ అత్తగారికి నచ్చలేదట. ఆడపడుచుని అలా అనొచ్చా అని దీన్నే తిట్టిందట. పైగా ఆరోగ్యం బాగా లేదు విశ్రాంతిగా వుండాలి అని ఇది చెప్పినా వినిపించుకోకుండా అన్నీ దొంగ ఎత్తులు అని వంకలు పెడతారుట. చీటి కీమాటికీ మేడెక్కి దిగడంతో బాగా అలసట అవుతోందట. సురేష్‌తో చెప్తే అతను పట్టించుకోలేదుట.

డాక్టర్ దగ్గరికి వెళ్తే ఆవిడ పరీక్ష చేసి చీవాట్లు వేసిందిట. ఇదివరకుకంటే వెయిట్ తగ్గావు. ఇలా అయితే ఎలా? పూర్తి విశ్రాంతి తీసుకో. చదువుకున్నదానివి నీకామాత్రం తెలీదా అని మందలించింది.

ఇంటికి రాగానే ఆ మాటే చెప్పి మా అమ్మావాళ్ళింటికి వెళ్తాను అందిట. అంతే పెద్ద గాలిదుమారం లేవదీశారుట. ససేమిరా వెళ్ళడానికి వీల్లేదు అన్నారుట. వెళ్తానని ఇది పట్టుబట్టిందట.

"నీ వ్యవహారం మాకు తెలుసులే. అక్కడైతే నీ ఆటలు సాగుతాయి. ఇక్కడైతే మేం అడ్డుపడుతున్నాం. అందుకే అనారోగ్యం వంక పెట్టుకుని అక్కడికి పోతున్నావు. లేకపోతే మాకెవరికీ కడుపులు రాలేదా? కనలేదా? " అన్నారుట.

అంత నింద భరించలేక సామాన్లు సర్దుకుని వచ్చేసింది భారతి. "అంతమాట అనడానికి వాళ్ళకు నోరెలా వచ్చిందే" అంది కోడలు.

"వాళ్ళ బాధ అది కాదమ్మా. నేను వచ్చేస్తే నా జీతం వుండదు. ఇల్లు గడవడం కష్టం అవుతుంది. విందులూ, వినోదాలూ సాగవు. అందుకే నన్నెలాగైనా అక్కడే వుంచాలని ప్రయత్నం. అది కుదరకపోయేసరికి కడుపుమంటతో ఆమాట - అన్నారు" అంది భారతి.

అంతలోనే అబ్బాయి వచ్చాడు. విషయం విని ముందు మండిపడ్డాడు. తర్వాత బాధపడ్డాడు. ఆ తర్వాత భయపడ్డాడు. ఇప్పుడేం చేద్దాం అన్నాడు అయోమయంగా.

"అది ప్రస్తుతానికి ఇక్కడే వుంటుంది. రేపు మీరు సురేష్ ఆఫీస్‌కి వెళ్ళి అతన్తో మాట్లాడండి. అతను ఏం చెప్తాడో వినండి. నచ్చచెప్పి వ్యవహారం సర్దుబాటు చెయ్యండి" అంది కోడలు.

అలాగే అబ్బాయి సురేష్ ఆఫీస్‌కి వెళ్ళాడు. అక్కడ సురేష్ కనిపించలేదు సరికదా అతను నెల్రోజులు కిందటే ఆ ఉద్యోగం వదిలేశాడని తెలిసిందట.

బ్యాంక్‌కి కూడా వెళ్ళకుండా ఇంటికి వచ్చేశాడు అబ్బాయి. జరిగినది తెలుసుకుని తెల్లమొహం వేసింది భారతి. నాతో మాటమాత్రమైనా చెప్పలేదు అంది ఆగ్రహావేశాలతో.

హైరాన పడవద్దని పరిస్థితులు చక్కబడతాయనీ గర్భవతి అయిన తను దిగులు పెట్టుకుంటే ఆ ప్రభావం బిడ్డమీద పడుతుందనీ సంతోషంగా వుండాలనీ నచ్చచెప్పాం. బాధని దిగమింగుకుని పైకి నవ్వుతూ తిరగసాగింది భారతి.

ఫోన్ చేసి సురేష్‌ని ఒక్కసారి వచ్చివెళ్ళమని చెప్పాడు అబ్బాయి. ఆ కబురు అందిందో లేదోగానీ అతను మాత్రం పత్తా లేడు.

వారంరోజుల తర్వాత సాయంత్రం సమయంలో వచ్చాడు.

అతడిని చూస్తూనే దెబ్బలాటకి దిగింది భారతి. ఉద్యోగం మానేసిన విషయం ఎందుకు చెప్పలేదు అని నిలదీసి అడిగింది.

సురేష్ చిన్నగా నవ్వాడు. "నీకు తెలిసిపోయిందా? అసలే నీ ఆరోగ్యం బాగాలేదు. ఇదంతా చెప్పి నిన్ను ఇంకా బాధపెట్టడం

ఇష్టంలేక చెప్పలేదు. ఆ జాబ్ నాకు నచ్చ లేదు. వేరేచోట ప్రయత్నాలు చేస్తున్నాను. రెండుమూడురోజుల్లో దొరుకుతుంది. అప్పుడు ఏకంగా నీతో చెప్పాలనుకున్నాను" అన్నాడు.

అందరం ఊపిరి పీల్చుకున్నాం. ఆపూట భోజనం ఇక్కడే చేశాడు. సమయం చూసు కుని అబ్బాయి, వాళ్ళింట్లో జరిగిన గొడవ గురించి అతన్ని అడిగాడట.

"ఏం చెప్పమంటారు? మా అక్కయ్య అదోరకం మనిషి. మా అమ్మకూడా పెద్దగా చదువుకోలేదు. అయినా ఈ వివరాలన్నీ పెళ్లికి ముందే స్పష్టంగా చెప్పాను. అనకూ డదుగానీ భారతికి మొండితనం బాగా ఎక్కువ. వూరికే కోపం వచ్చేస్తుంది తనకి. లోపం రెండుపక్కలా వుంది. ఇలాంటి గొడవలు ప్రతి ఇంట్లోనూ వుంటాయి. మీరేం భయపడకండి" అన్నాడుట.

ఆ ఉద్యోగం దొరకలేదుట. మరెక్కడో ప్రయత్నం చేస్తున్నాననీ దుబాయ్ వెళ్ళాలని అనుకుంటున్నాననీ చెప్తూ వుండేవాడు. వారానికో పదిరోజులకో వస్తూనే వున్నాడు. డబ్బు తీసికెళ్తూ వుండేవాడు. బ్యాంక్‌లో జాయింట్ ఎకౌంట్. చెక్ ఇస్తూ వుండేది భారతి.

★ ★ ★



# సచిత్ర విచిత్రం





## 'లయన్‌కింగ్' రహస్యం

'లయన్‌కింగ్' అనే వాల్ట్‌డిస్నీ కార్టూన్ సినిమా 3 ఏళ్ళక్రితం విడుదలై బాక్సాఫీసు దగ్గర గొప్ప విజయాన్ని సాధించింది. 74 కోట్ల డాలర్లు ఆ సినిమా మొదటిరన్‌లో వసూలు చేసింది. 2 కోట్ల 60 లక్షల వీడియోకేసెట్లు ప్రపంచమంతటా అమ్ముడయ్యాయి. 'లయన్ కింగ్' పేర విడుదలైన అనేక వస్తువులు (టీషర్ట్స్, కీ చెయిన్స్, స్టేషనరీ, ఫ్రిజ్ మ్యాగ్నెట్స్ మొదలైనవి) మొత్తం వందకోట్ల డాలర్ల సరుకు అమ్ముడయింది. ఇటీవల కెంటకీ రాష్ట్రంలోని ఒకయూనివర్సిటీకి చెందిన సైకాలజీ ప్రొఫెసర్ డాక్టర్ స్టేన్లీ ఫ్రాగల్ దీని విజయానికి గల కారణాన్ని అన్వేషించాడు. ఆయన కనుక్కొన్నది ఇది. అమెరికాలో నేడు తండ్రి తనపాత్రను సరిగా పోషించడంలేదు. కొడుకులకి ఇవ్వాల్సిన ప్రేమను వాళ్ళివ్వడంలేదు. కొడుకుతో కలిసి ఆడటానికి పాడటానికి వాళ్ళకి మంచిమాటలు చెప్పడానికి తండ్రులకు సమయం చిక్కడంలేదు. దాంతో తండ్రి ప్రేమకి మొహం వాచి వున్నారు అమెరికాలో పిల్లలు.

లయన్ కింగ్ విజయానికి దానికి సంబంధం వుందని కనుగొన్నాడాయన. ఈ చిత్రంలో సాంబా అనే సింహానికి తండ్రి ముసాఫా. అతని తండ్రి బతికుండగా చెప్పిన మోరల్స్‌ని సాంబా నిత్యజీవితంలో ఆచరించి విలన్‌స్కార్‌ని చివరకు ఎదుర్కొనగలిగాడు. ఈ తండ్రీకొడుకుల సంబంధం అమెరికన్ ప్రేక్షకులకు నచ్చడంతో ఈ చిత్రం హిట్టయిందిట.

డాక్టర్ జాయస్ బ్రదర్స్ రాసిన 'ఫాదర్‌లెస్ అమెరికా' అనే పుస్తకం అమెరికాలో టాప్ సెల్లర్ అవడానికి కూడా ఇదేకారణమంటున్నారు.

భారతి డెలివరీ డేట్ దగ్గరపడింది.

ఆఫీస్‌పని పూర్తిగా మానేసింది. అందరం రాబోయే చిన్నారి పాపకోసం ఎదురుచూస్తున్నాం.

క్రమం తప్పకుండా డాక్టర్ దగ్గరికి వెళ్ళి వస్తూ వుండేది భారతి. ఒకసారి వెళ్లినపుడు జాయిన్ చేసేసుకున్నారు. పురుడు మామూలుగా కాదనీ ఆపరేషన్ చెయ్యాలనీ చెప్పారు. సాయంత్రం నాలుగు గంటలకు ఆపరేషన్ చేశారు.

తెల్లటి బట్టలకి చుట్టిన పాపాయిని తీసుకువచ్చి చూపించారు. చందమామలావుంది పాపాయి. పాపాయిని ముందుగా సురేష్ ఎత్తుకున్నాడు. ఇదుగోనండీ మీ మునిమనుమరాలు అంటూ నాకు అందించాడు. అబ్బాయి వెళ్ళి అందరికీ ఫోన్లుచేసి శుభవార్త చెప్పాడు.

సాయంత్రం విజిటింగ్ అవర్స్‌లో భారతి ఆఫీస్ వాళ్ళందరూ వచ్చారు. అబ్బాయి స్నేహితులు, కోడలి స్నేహితులు చాలా మంది వచ్చారు. భారతి అందరినీ చూసి చిన్నగా నవ్వింది సగం మత్తులోనే. పూల గుత్తులతో రూమ్ అంతా గుభాళించింది. అభినందనలు తెలియచేసే కార్డులతో గది కళకళలాడింది.

మరునాడు భారతి పూర్తిగా స్పృహలోకి వచ్చింది. కూతుర్ని పక్కన పడుకోబెట్టమంది. ప్రేమగా బుగ్గలు నిమిరింది. "చూశావా మామ్మా నా కూతురు ఎంత బాగుందో? " అంది గర్వంగా.

ఆ సాయంత్రం భారతి అత్తగారు, మామగారు, ఆడపడుచు, ఆవిడ భర్తా, పిల్లలూ అందరూ బిలబిల్లాడుతూ వచ్చారు. "ఏది మా బంగారుతల్లి? ఏది మా ఇంటి మహాలక్ష్మి" అంటూ హడావిడి చేసింది అత్తగారు.

మనవరాల్ని ఎత్తుకుని ముద్దులాడింది. బిడ్డ వాడిపోయింది. ఏం ఆపరేషనో ఏంపాడో. ఎలా ఓర్చుకున్నావే తల్లీ అంటూ భారతి తల నిమిరి కళ్ళనీళ్లపర్యంతం అయింది. నెలలోపలే నామకరణం చేద్దాం. దీని తాతగారు ఇది పుట్టిన టైం తీసుకుని సిద్ధాంతిగారికి ఇచ్చివచ్చారు. ఆయన ముహూర్తం పెట్టగానే మీకు చెప్తాం అంది మా కోడలితో.

బిడ్డపుట్టిన వేళావిశేషం కలతలు మాసిపోయి అందరూ దగ్గర అయ్యారు అని సంతోషించాను. వారంరోజుల తర్వాత కుట్లు విప్పారు. భారతి, పాపాయిని ఎత్తుకుని ఇంటికి వచ్చింది.

ఆరోజే మా మనవడూ రైలు ఎక్కాడు.

వాడికి బెంగుళూరులో మంచి ఉద్యోగం వచ్చింది. అక్కకు తగిన తమ్ముడు అన్నారు అందరూ. నామకరణం అయ్యేదాకా వుంటాడేమో అనుకున్నాం కానీ వీలుపడదుట.

"ఏం చేస్తాను ఇది వచ్చిందోలేదో నన్ను రైలెక్కించేస్తోంది. అదీ మంచిదేలే. లేకపోతే నేనుంటే దీన్నెవరు ముద్దుచేస్తారు? " అన్నాడు అల్లరిగా. పాపాయిపేరున తన బహుమతిగా అయిదువేలతో ఏవో బాండ్లు కొనమని తండ్రికి చెప్పాడు. తనకు జీతం రాగానే పంపిస్తానని చెప్పాడు.

నెలకు ఒకరోజు తక్కువచేసి నామకరణం చేశారు. మనస్విని అని పేరుపెట్టారు. భారతి సెలక్షనే. ఇరువైపుల తాతగార్లూ బంగారం నగలు చేయించారు పాపాయికి. ఘనంగా జరిగింది వేడుక.

మరోవారం రోజులతర్వాత షాపింగ్ చెయ్యాలి అంటూ బయలుదేరింది భారతి. కూతురికోసం ఏవిటో కొనాలిట. చాంతాడు అంత లిస్ట్ రాసుకుంది. పాపాయిని నాకు అప్పగించి తల్లీకూతురూ వెళ్ళి రావాలనుకున్నారు. బ్యాంక్‌కి వెళ్ళి డబ్బు తీసుకుని అక్కడినించి బజారుకి వెళ్ళాలని ప్లాన్.

ఇంట్లో పదింటికి బయలుదేరారు.

పదకొండింటికి తిరిగి వచ్చేశారు. ధుమ ధుమలాడుతూ వచ్చి బ్యాగు విసిరికొట్టి గది లోకి వెళ్ళిపోయింది భారతి. నా పక్కనే కూర్చుని కళ్ళనీళ్ళు పెట్టుకుంది కోడలు.

డబ్బుకోసం బ్యాంక్‌కి వెళ్తే భారతి ఎకౌంట్లో నిల్ బేలన్స్‌ట. దానికి చాలా కోపం వచ్చిందట. అవమానం అనిపించిందట. వెంటనే వాళ్ళింటికి వెళ్ళిందట. సురేష్‌ని నిలదీసి అడిగిందట. చాలామటుకు నీకోసం ఖర్చు అయింది. మిగిలినది ఏదో ఇటూ అటూ ఖర్చయిపోయింది. నాకూ ఉద్యోగం లేదుకదా అన్నాడుట తాపీగా. మాటామాటా పెరిగింది.

"తెలివిగలదానివని, పెద్ద ఉద్యోగం చేస్తున్నానని గర్వం నీకు. నువ్వే ఆటలాడినా భరించినందుకు తగిన శాస్తే జరిగింది. అందరూ వద్దని చెప్తున్నా వినకుండా నిన్ను పెళ్ళి చేసుకున్నందుకు ఇప్పుడు అనుభవిస్తున్నాను"అన్నాడుట. అత్తగారైతే అనరానిమాటలన్నదట.

"దానిచేత చాకిరీ చేయించుకుని, దాని డబ్బు తిని దాన్ని అనడానికి వాళ్ళకి నోరెలాగ వచ్చిందో?" అంది కోడలు. మర్నాడు అబ్బాయి వాళ్ళింటికి వెళ్ళాడు. సురేష్ ఏదో ఊరికి ఉద్యోగానికి వెళ్ళాడుట. ఏ ఊరో పేరు చెప్పాడుట. కానీ వీళ్ళే మర్చిపోయారట. అబ్బాయి నాలుగుమాటలు అంటే వాళ్ళు పదిమాటలని పంపించారుట. తల వంచుకుని తిరిగొచ్చాడు అబ్బాయి.

"అసలు నాదే తప్పు. ఆనాడే నువ్వాపెళ్ళి చేసుకుంటే నేను వురేసుకుని చస్తాను అని బెదిరించి వుంటే బాగుండేది. మీ అందరి మాటలకూ విలువ ఇచ్చి వూరుకున్నాను. అదే నా బుద్ధితక్కువ. ఆడవాళ్ళ ప్రయోజకత్వం ఇలాగే ఏడుస్తుంది" అని మండిపడ్డాడు.



కాలం గడిచిపోయింది.

ఆరోజు రాత్రి బాగా పొద్దుపోయింది. పదకొండు దాటింది. గదిలో మంచంమీద పడుకున్నాను. నాపక్కన మనూ. మనస్విని పేరుని కురచచేసి ముద్దుగా మనూ అనే పిలుస్తాం. దానిపక్కన ఆవేళ దానికి వచ్చిన ప్రజంటేషన్లు అన్నీ వున్నాయి. గుచ్చుకుంటాయి తీస్తానే తల్లీ అన్నా విన్లేదు. నేను నిద్రపోయాక తీశావంటే లేచాక ఏడుస్తా అని చెప్పి మరీ పడుకుంది. తెలివితేటల లోనూ, పట్టుదలలోనూ అచ్చంగా అమ్మమ్మపోలికే అంటాడు వాళ్ళ తాత.

తలుపు చప్పుడు అయింది. అబ్బాయి మెల్లగా లోపలికి వచ్చాడు. ఏమిట్రా ఏం కావాలి? అని అడిగాను. "ఏమీలేదమ్మా ఈ సిసింద్రీ పడుకుందో లేదో చూద్దామని వచ్చాను" అంటూ మనవరాలి పక్కనే చోటుచేసుకుని కూర్చున్నాడు. టెడ్డీ బేర్‌ని కావలించుకుని పడుకున్న మనవరాలి తల నిమిరి ముద్దుపెట్టుకున్నాడు. "నిన్నమొన్న పుట్టినట్లు వుంది. అప్పుడే అయిదేళ్ళు నిండాయి. రేపు ఇది వెళ్ళిపోతుందని దిగులుగా వుందమ్మా. భారతి ఇల్లు వదిలి వెళ్తున్నపుడు కూడా ఇంత బాధపడలేదు నేను"

అంటూ వుంటే వాడి కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి.

"అవును - మరి అసలుకంటే వడ్డీముద్దు అని వూరికే అన్నారా?" అన్నాను. "ఆ మాట నిజమేలే. అందుకేగా ఈ వయస్సులో నువ్వు అసలుని వదిలి వడ్డీవెంట ప్రయాణం కట్టావు" అన్నాడు తెచ్చిపెట్టుకున్న నవ్వుతో.

"బాధపడకు నాన్నా! అన్నీ మనమంచికే అన్నారు" అన్నాను వాడి తల నిమిరి.

బరువుగా నిట్టూర్చి ఏదో ఆలోచనల్లో మునిగిపోయాడు.

గత అయిదు సంవత్సరాలలో ఎన్నో అవాంఛనీయమైన సంఘటనలు జరిగిపోయాయి.

మనూ పుట్టిన తర్వాత వేరే ఊరికి ఉద్యోగం కోసం వెళ్ళిన సురేష్ చాలాకాలం తిరిగిరాలేదు.

మనూకి మూడోనెల రాగానే భారతి మళ్ళీ ఆఫీసుకి వెళ్ళడం ప్రారంభించింది. పైకి మామూలుగానే కనిపించినా లోలోపల బాధపడేది. మనూని చూసి ధైర్యంగా వున్నా వుండుండి కళ్ళనీళ్ళు తిరిగేవి దానికి. మనూ ఏడాది పిల్ల అయింది. ఫ్రెండ్స్‌ని పిల్చి పార్టీ ఏర్పాటుచేసింది.

ఆరోజు మధ్యాహ్నం ఊర్నించి వచ్చాడు సురేష్. కూతురి కోసం గౌను, బొమ్మలు తెచ్చాడు. ఒరిస్సాలో ఏదో ఊర్లో పనిచేస్తున్నాడుట. జీతం ఏడువేలు వస్తుందిట. భార్యని తనవెంట రమ్మన్నాడు.

"నీమాటమీద నాకు నమ్మకం పోయింది. ఎన్నోసార్లు ఇలాగే మంచిమాటలాడి నన్ను మోసం చేశావు. పిల్ల పుట్టగానే నన్నూ దాన్నీ మా ఖర్మానికి వదిలేసి మాటమాత్రమేనా చెప్పకుండా వెళ్ళిపోయి ఏడాది అయ్యాక ఇప్పుడొచ్చి మొహం చూపిస్తున్నావు. ఏ నమ్మకంతో నీవెంట వస్తాను? తీరా అక్కడికి తీసుకువెళ్ళి నన్ను నాదారిన వదిలేసి మళ్ళీ మాయం అయిపోవని ఏమిటి గ్యారంటీ? అదీగాక నాకు ఇక్కడ అదనపు సౌకర్యాలు కాక పాతికవేలు వస్తోంది. ఈ ఉద్యోగం వదలడం నాకిష్టం లేదు. నువ్వే ఇక్కడికి రా? మా కంపెనీలోనే ఉద్యోగం ఇప్పిస్తాను. జరిగింది ఏదో జరిగిపోయింది. గతం మర్చిపోయి మనూ కోసమైనా ఇద్దరం కలిసివుందాం. వేరే ఇల్లు తీసుకుందాం. మన బతుకు మనం బతుకుదాం" అంది భారతి.

"నీ సలహాకు థాంక్స్" అన్నాడు మొహం గంటుపెట్టుకుని. పార్టీకి కూడా వుండకుండా వెళ్ళిపోయాడు. తర్వాత రెండునెలలకోసారి వచ్చి కూతుర్ని చూసి వెళ్ళేవాడు. వచ్చినప్పుడంతా అదేపాట, ఇదే సమాధానం. అలా గడిచిపోయింది. హఠాత్తుగా లాయరు నోటీసు పంపించాడు.

పెళ్ళయిన తర్వాత పట్టుమని పదిరోజులు కూడా కలిసి వుండలేదని, కాబట్టి తనకు విడాకులు ఇవ్వమని నోటీసు ఇచ్చాడు.

మా అబ్బాయి బాధపడ్డాడు.

కోడలు ఏడిచింది.

భారతి విరక్తిగా నవ్వింది. "మనుషులం ఎప్పుడో విడిపోయాం. ఇప్పుడు చట్టపరంగా విడిపోతాం అంతే! అనవసరంగా బాధపడకండి" అంది.

"పోనీ విడాకులు కాకుండా ఏదోమార్గం చూడండి. నువ్వే ఎలాగో సర్దుకుపో. కొంతకాలం అతని దగ్గరకు వెళ్ళివుండు. నెమ్మదిగా నచ్చచెప్పి ఈ ఊరు తీసుకురా! ఉద్యోగం అంటావా నీకు ఎప్పుడైనా దొరుకుతుంది" అని చెప్పింది కోడలు.

"అవన్నీ జరిగేపన్లు కావులే అమ్మా. నేను సర్దుకుపోయినంత మాత్రాన సంసారం

# ఏరిన ముత్యాలు

★ మనిషి పరిపూర్ణత అతని ఆస్తులలోకాదు, అతని స్వభావంలో ఉంటుంది.

-ఆస్కార్‌వైల్డ్

★ బాధలను నివారించడం కోసమే కళ పుట్టింది.

-థామస్ జెఫెర్సన్

★ ఒక రహస్యాన్ని దాచిపెట్టి ఉంచు, అది నీకు బానిసగా పడి ఉంటుంది. దాన్ని ఒకరికి చెప్పావంటే అది నీకు యజమానై కూర్చుంటుంది.

-ఎల్. హెన్రీ

★ ప్రయత్నం చేయువానికంటే పాటుపడువాడు ఉత్తముడు

-స్వామి వివేకానంద

★ కవుల లక్ష్యం సౌందర్యం, ధార్మికులది సత్యం.

-ఎమర్సన్

★ కనిపించే వాటిని అద్దంవలె ప్రతిబింబింపచేయడం మాత్రమే గాక కనిపించనివాటిని దీపంవలె ప్రకాశించేటట్టు చేయడం రచయిత బాధ్యత.

-సంజీవ్‌దేవ్

★ విమర్శవల్ల సాహిత్యంలో అభిరుచులు సువ్యక్తమౌతాయి.

-టి.యస్. ఇలియట్

★ తన మనసుకు స్వేచ్ఛ ఇవ్వడానికే కళాకారుడు సృష్టికర్త అవుతున్నాడు. కళాకారుడొక్కడే ప్రపంచంలో స్వేచ్ఛాజీవి.

-మామ్

★ తన విద్యుక్తధర్మం నెరవేర్చడానికి సిద్ధంగా ఉండేవారికి భగవంతుని సహాయం ఎల్లప్పుడూ ఉంటుంది.

-టి.యల్. క్యూలర్

★ నిదానం ఆనందమయ జీవితానికి మూలాధారం. ఈ సత్యాన్ని గుర్తుంచుకొంటే నీవు నేడూ, రేపూ ఉజ్వలంగా ఉండగలవు.

-వివేకానంద

★ **శత్రువును** క్షమించడం, ప్రత్యర్థిపట్ల సహనం, మిత్రుడి మాట వినడం, **పిల్లలకు ఆదర్శ**ప్రాయంగా ఉండడం, తల్లి గర్వపడేలా సత్ప్రవర్తన, ఆత్మాభి**మానం, అందరిపట్ల** దయాదాక్షిణ్యాలను చూపడం ఇవన్నీ **అత్యుత్తమమైన గుణాలు.**

-బెంజిమన్ ఫ్రాంక్లిన్

★ అన్నింటిలోకి అతి గొప్ప ప్రార్థన సహనమే

-గౌతమబుద్ధుడు

★ మూగ జీవులపై దయా, కనికరంలేని, చూపని నాగరికత సంపూర్ణమైనది కాదు.

-విక్టోరియా మహారాణి

సేకరణ: శివప్రసాద్ పండా

చక్కబడుతుందా? ఇంతదాకా రాకుండా వుండాలని మొదట్లో ఎన్నోవిధాల నేను సర్దుకుపోయాను. తను చెప్పిన దానికి తలాడిస్తూ కావలసినంత డబ్బు ఇస్తూ వుంటే బాగానే వుంటుంది. ఎదురుతిరిగి ఏమైనా అంటే నీకు తలపొగరు, గర్వం అని మాట పడాల్సివస్తుంది. ఎందుకొచ్చిన బతుకమ్మా అది? నావల్లకాదు. అంతకంటే విడిపోయి ప్రశాంతంగా బతకటం సుఖం" అంది.

ఇరువైపులవారూ అంగీకరించడాన విడాకులు తేలికగానే మంజూరు అయ్యాయి. కూతురు కావాలని అతనేం పట్టుబట్టలేదు. మనూ ఇంకా చిన్నపిల్ల కాబట్టి తల్లి ఆర్థిక స్థితి తండ్రికంటే అన్నివిధాలా మెరుగు కాబట్టి మనూ బాధ్యత తల్లికే దక్కింది.

విడాకులు అయ్యాక ఇంటికి రాగానే నా దగ్గరకి వచ్చి కూర్చుంది భారతి. "నీకు తెలుసా మామ్మా నేనిప్పుడు శ్రీమతి భారతిని కాను. కుమారి భారతిని" అంది కళ్ళనిండా నీళ్ళతో నవ్వుతూ.

ఈ విషయం గురించి తెలిసిన వాళ్ళందరూ వింతగా చెప్పుకుంటారేమో అనుకున్నాం. కానీ ఎవరూ ఏమీ అన్లేదు. ఆప్తులందరూ 'మంచిపని చేశారు పీడా వదిలింది' అనే అన్నారు.

ఎవరూ ఏమీ అనకపోయినా, విడాకులు తీసుకోకపూర్వం వాళ్ళిద్దరూ కలిసి వుండకపోయినా, విడాకులు అయ్యాక అందరిలోనూ ఏదో మార్పు. పైకి కనబడకపోయినా భారతి లోలోపలే బాధపడసాగింది. మనసు తిన్నగా లేక ఆఫీస్ పనిలోకూడా మునుపటంత శ్రద్ధ వహించలేకపోయేది. దానివల్ల దానికంపెనీకి సమస్యలు వచ్చేవి. వాళ్ళు మెత్తగానే మందలించారుట. పోనీ ఓ పదిరోజులు శలవులో వెళ్ళి రమ్మన్నారుట.

అలాగే పదిరోజులు శలవుపెట్టి కూతుర్ని తీసుకుని నాలుగూళ్ళూ తిరిగి వచ్చింది. మనసు కుదుటపరచుకునేందుకు క్షణం తీరికలేకుండా ఏదో వ్యాపకం ఏర్పాటు చేసుకుంది. యోగా క్లాసులలో చేరింది. ఏనాడో మూలపడేసిన ఫిడేలు పైకితీసి ప్రాక్టీసు మొదలుపెట్టింది.

అబ్బాయి కూడా పైకి ఎంత గాంభీర్యం నటించినా లోలోపల బాగా కుంగిపోయాడు. కొద్దిగా బి.పి. పెరగడంతో క్రమం తప్పకుండా మందులు వాడసాగాడు.

అందర్లోకి అధ్వాన్నం మా కోడలు. బాగా కుంగిపోయింది. అంతకుముందు ఏ ఫేషన్ చీర బజార్లోకి వచ్చినా వెళ్ళి కొనుక్కొనేదల్లా షాపింగ్ మానేసింది. అలంకరణ పట్ల శ్రద్ధ తగ్గిపోయింది. పెళ్ళిళ్ళకు పేరంటాలకు వెళ్ళడం బాగా తగ్గించింది. ఉత్సాహం అంతా హుష్‌కాకీ అయిపోయి ముభావంగా తయారైంది. పరధ్యానం బాగా ఎక్కువైంది. కూరల్లో ఉప్పు మర్చిపోవడం, పులుసుల్లో రెండుసార్లు వెయ్యడం ఏదో మొక్కుబడిగా బ్యాంకుకి వెళ్ళిరావడం. ఆలోచనలు ఎక్కువై తలనెప్పివల్ల కళ్ళజోడు రెండు సార్లు మార్చాల్సి వచ్చింది.

"ఇదంతా చూసి అబ్బాయి కేకలేసేవాడు. ఏదో కొంపలంటుకుపోయినట్లు ఇలా తయారయ్యావేం? మనకేం తక్కువ? దర్జాగా వుండు" అని కోప్పడేవాడు.

"ఈయనకి నా బాధ అర్థంకాదు. తల్లి ప్రాణం. అదలా నాకళ్ళముందే ఏ అచ్చటా ముచ్చటా లేకుండా పడుంటే నా కడుపు తరుక్కుపోతోంది. నేనేం చెయ్యను. మామూలుగా వుండాలని ఎంతగా ప్రయాస పడుతున్నా నాచేత కావడంలేదు" అని చాటున కళ్ళనీళ్ళు పెట్టుకునేది.

ఎంతటి గాయాన్నైనా కాలమే మందు. క్రమంగా ఆ పరిస్థితులకు అలవాటు పడసాగాం. ఆరునెలలు గడిచాయి. ఆరోజు



బ్యాంకు శలవు. భారతికూడా పొద్దున భోజనానికి వచ్చింది. అందరం భోజనాలకి కూర్చోబోతుండగా కాలింగ్ బెల్ మోగింది.

వెళ్ళి చూస్తే సురేష్ తల్లీ, తండ్రీ. "బావున్నారా" అంటూ లోపలికి వచ్చారు. "ఎలా వున్నావు భారతీ? " అని పలకరించారు.



అబ్బా ఇది బాగా పొడుగు అయిందే అని మనూని ముద్దులాడారు తర్వాత చేతిలోని జేబురుమాల్లోంచి కుంకుమ భరిణ తీసింది ఆవిడ. మా కోడలికి బొట్టు పెట్టింది. మా రెండో అబ్బాయికీ, మూడో అబ్బాయికీ పెళ్ళిళ్ళు వచ్చే ఆదివారం. మీరంతా తప్ప కుండా రావాలి అని పిలిచింది.



"పెద్దవారు మీరు తప్పకరావాలి పిన్ని గారూ" అని నాతో చెప్పింది. "ఆదివార మేగా భారతీ! నువ్వురా" అని దానికీ చెప్పింది. మేం కూర్చోమనకపోయినా కూర్చుని మేం అడగకపోయినా వివరాలు చెప్పారు. పెళ్ళికూతుళ్ళిద్దరూ అన్నదమ్ముల పిల్లలట. ఇన్నాళ్ళూ ఆర్మీలో వుండేవాడు ఇప్పుడు రిటైరైపోయాడు. వాడు వద్దం టున్నా మేమే పట్టుబట్టి ఒప్పించాం. సురే ష్‌కి కూడా చక్కటిపిల్ల దొరికింది. డిగ్రీపా సైంది. ఎంత బుద్ధిమంతురాలో. మీరు చూస్తే ముచ్చటపడతారు" అంది.

మమ్మల్ని రమ్మని మరోమారు చెప్పి బయలుదేరింది. గడపదాకా వెళ్ళి వెనక్కితిరిగి మీరంతా రండిగానీ మనూని తీసుకురావద్దు. పిల్లలు తండ్రి భాషికం చూడకూడదుట అని చెప్పి వెళ్ళిపోయింది.

హఠాత్తుగా వడగాలి కొట్టినట్లు అయింది. ఊపిరాడనట్లు అయింది.

భారతి ఇప్పుడు నాకు ఆకలిగా లేదు తర్వాత తింటాను అని వెళ్ళిపోయింది.

కోడలు కంచంముందు కూర్చుని కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

"ఎవరో చచ్చినట్లు ఎందుకా ఏడుపు? అవతల వాళ్ళేమో రింగురంగామని తిరుగుతూ కొడుక్కి పెళ్ళి చేస్తుంటే మనం మాత్రం మొర్రోమని ఏడుస్తున్నాం వాళ్లను చూసి నేర్చుకో" అంటూ కోడలిమీద మండిపడ్డాడు అబ్బాయి.

"వాళ్ళు సంతోషంగా వున్నారంటే అందుకు తగిన కారణం వుంది. నా కూతురికి మళ్ళీ పెళ్ళి చెయ్యండి. నేనూ అంతకంటే సంతోషంగా తిరుగుతాను" అంటూ ఎదురుతిరిగింది కోడలు.

"అలాగే చేద్దాం. నా మనసులో ఆ ఆలోచన వుండనేవుంది. సమయం చూసి బయటపెడదాం అని వూరుకున్నాను. దాంతో మాట్లాడి ఇక ఆ ప్రయత్నాలు చేద్దాం" అన్నాడు అబ్బాయి. భారతితో మాట్లాడారు. చెప్పవలసిన రీతిన చెప్పారు.

"సరే నాన్నా! మీ ఇష్టం. నన్నూ, మనూని ఆదరించేవాడు దొరికితే తప్పకుండా పెళ్ళి చేసుకుంటాను" అంది భారతి.

అందరం ఎంతో సంతోషించాం. భారతి జీవితం మళ్ళీ ఒకదారిన పడుతుందని తృప్తిపడ్డాం.

మంచిరోజు చూసి పత్రికలో ప్రకటన వేయించాడు అబ్బాయి.

సమాధానంకోసం వేయికళ్ళతో ఎదురు చూశాం. మేం ఆశించినంత రెస్పాన్స్ రాలేదు. నాలుగైదు ఉత్తరాలు వచ్చాయి. అవి అబ్బాయికే నచ్చలేదు. ఏదో పెళ్ళి చేసెయ్యాలని కంగారుగా ఎవరో ఒకరికిచ్చి చెయ్యలేరు. నెలకు ముప్పైవేలు సంపాదించుకుంటున్న మహా మేధావి. విడాకులు తీసుకుంది. పైపెచ్చు బిడ్డతల్లి. దానికి తగిన సంబంధం దొరకాలి కదా! పరిచయస్థులకీ చెప్పి చూశారు. అలాగే తప్పకుండా చూస్తాం అన్నారు వాళ్లు.

సురేష్ పెళ్ళికి మేం వెళ్ళకపోయినా అతను భార్యని వెంటబెట్టుకుని మా ఇంటికి వచ్చివెళ్ళాడు. మీ ఆశీర్వాదం కోసం వచ్చాను అన్నాడు. కూతురితో కాసేపు ఆడుకుని వెళ్ళిపోయాడు. అప్పటికి మనూకి నాలుగో ఏడు వచ్చింది. స్కూల్లో చేర్పించారు. మాటలపుట్ట.

సురేష్ భార్యని తీసుకుని వచ్చివెళ్ళిన మర్నాడు స్కూల్నించి వచ్చి, "అమ్మమ్మా నిన్న డాడీ పెళ్లిచేసుకుని మనింటికి వచ్చాడు కదా! ఆ మాట చెప్తే నా ఫ్రెండ్స్ అందరూ నీ మొహం పిచ్చివాగుడు అన్నారు. నేను చెప్పింది నిజమే కదా అమ్మమ్మా? మా మమ్మీ డాడీ అందరిలా ఒకదగ్గర ఎందుకుండరు. అందరూ పేరెంట్స్ దగ్గర వుంటే నేను గ్రాండ్ పేరెంట్స్ దగ్గర ఎందుకున్నాను. డాడీకి పెళ్ళి ఎందుకయింది? " అని అడిగింది కుతూహలంగా.

కోడలి మొహం మాడిపోయింది. "చాల్లే వూరుకో ఆరిందా మాటలూ నువ్వూనూ" అని కసురుకుంది.

అబ్బాయి కోడల్ని మందలించాడు. "దానికీ బుద్ధి తెలుస్తోంది. ఎవరో చెప్పే కంటే మనమే చెప్పడం మంచిది" అని మనూని దగ్గర కూర్చోబెట్టుకున్నాడు.

అన్నీ వివరంగా చెప్పాడు. "ఇదీ సంగతి. నిన్ను ఈసారి అడిగితే మా మమ్మీ డాడీ




డ్రైవర్ను తీసుకున్నారు. నేను, మా మమ్మీ తాతగారింట్లో వుంటాం అని చెప్పాలి. అందుకే మా డాడీ మళ్ళీ పెళ్ళి చేసుకున్నారు అని చెప్పాలి సరేనా" అన్నాడు.

"సరే అలాగే చెప్తాను. మరి మమ్మీ పెళ్ళిచేసుకోదా? " అని అడిగింది.

"ఎందుకు చేసుకోదు? మంచి డాడీ దొరికితే పెళ్ళిచేసుకుంటుంది మమ్మీ" అన్నాడు.

"మరి ఈ డాడీ మంచివాడు కాదా? " మరో ప్రశ్నవేసింది.

"ఈ డాడీ కూడా మంచివాడే. కానీ మమ్మీకి ఇంకా మంచి డాడీ కావాలిట" అన్నాడు.

భలేభలే అయితే నాకు రెండు డాడీలు అని గంతులేసింది.

అంతలోనే వాళ్ళ అమ్మ వచ్చింది. దానికీ చెప్పి ఆనందపడిపోయింది.

"రౌడీ పిల్లవి అయిపోతున్నావే. డాడీల సంగతి తర్వాత చూద్దాం పద నిన్ను షాపింగ్‌కు తీసుకుపోతాను" అంటూ అట్లాగే కూతుర్ని తీసుకుని కార్లో వెళ్ళిపోయింది.

భారతి పెళ్ళి వ్యవహారం ఒక కొలిక్కి రాలేదుగానీ దానికి మళ్ళీ ఫారెన్ ఛాన్సు వచ్చింది. ఎనిమిది నెలలు ట్రైనింగ్‌ట.

మనూని వెంట తీసుకువెళ్తాను అంది.

"ఇప్పుడొద్దు. నువ్వు ఆఫీసుకు వెళ్తే అది ఒక్కర్తీ ఏం చేస్తుంది? అదీగాక ఈ వింటర్‌లో అక్కడ చలి విపరీతం. పసిపిల్ల తట్టుకోలేదు. నువ్వు వెళ్ళు. ఓ రెండు నెలల ముందు దీన్ని పంపిస్తాం ఆ రెండు నెలలూ అక్కడే వుండి అన్నీ చూసి తిరిగి రండి" అన్నాడు అబ్బాయి.

అందుకు అంగీకరించింది భారతి. భారతిని సీఆఫ్ చెయ్యడానికి మేమందరం బొంబాయి వెళ్ళాం. నేనూ విమానం ఎక్కాను. మా మనవడు బాంబేలోనే వున్నాడు ఉద్యోగం చేస్తూ. వాడొచ్చి రిసీవ్ చేసుకున్నాడు. ఎక్కువ వ్యవధిలేదు కాబట్టి ఎయిర్‌పోర్టులోనే కూర్చున్నాం. భారతికి వీడ్కోలు చెప్పి అప్పుడు మనవడి ఫ్లాట్‌కి వెళ్ళాం.

కంపెనీ వాళ్ళే ఇచ్చారు ఇల్లూ సామాన్లూ. అద్దంలా సర్దుకున్నాడు. అందులోనూ బాంబేలో పనివాళ్ళు దొరకరు. అయినా చూడముచ్చటగా వుంది ఇల్లు. "ఏరా! నీకు పెళ్ళి వయసు వచ్చింది అని నా ఉద్దేశ్యం. నువ్వు చేసుకుంటావా? నన్ను చెయ్యమంటావా? " అని అడిగాడు అబ్బాయి.

"నావల్లకాదు. మీరే పుణ్యం కట్టుకోండి" అన్నాడు వాడు.

"ఎలాటి సంబంధం చూడమంటావ్. నీలాగే కంప్యూటరు ఇంజనీర్ని చూడనా? " అన్నాడు తండ్రి.

"వద్దు నాన్నగారూ వర్కులోడ్ ఎక్కువ. సంపాదన బాగానే వుంటుందిగానీ టెన్షన్స్ ఎక్కువే. అసలు నాకు వర్కింగ్ గర్ల్‌వద్దు. చదువుకున్న పిల్ల చాలు" అన్నాడు.

"ఏరా వర్కింగ్ గర్ల్ అయితే ఏం? నిన్ను కొరుక్కు తింటుందా? " అంది కోడలు.

"అది కాదమ్మా ఇద్దరూ జాబ్ చేస్తుంటే అదో పద్ధతి. మనింట్లో అంటే మామ్మ వుంది కాబట్టి సరిపోయింది. ఫ్యూచర్లో సమస్యలు వస్తాయి. అయినా అవసరం లేదుకదా! కాలక్షేపానికి కావాలంటే ఇంట్లో వుండే ఏదైనా చెయ్యొచ్చు. అదీకాదు ఉద్యోగం చేసే కోడలే కావాలంటే నువ్వు జాబ్ రిజైన్ చేసి నా దగ్గరికి వచ్చెయ్" అన్నాడు అల్లరిగా.

"ఏడిశావులే" అని కసిరింది కోడలు.

ఊరికి రాగానే మంచి రోజు చూసి ప్రయత్నాలు ప్రారంభించాడు. ఫ్రెండ్స్ చెపిన

ఓమాట వేశాడో లేదో బోలెడన్ని సంబంధాలు వచ్చాయి. బోలెడన్ని వడపోతలు జరిపి రెండుమూడు ఎంచారు. వాడికి చెప్తే రెండ్రోజులు శెలవుపెట్టి వచ్చాడు. ఈ మూడూ చూడు ఇందులో నీకు ఏది నచ్చితే అదే ఖాయం చేద్దాం అన్నాడు అబ్బాయి.

మొట్టమొదట చూసిన అమ్మాయినే ఓ.కే చేశాడు. కాబట్టి ఇంకెవరినీ పెళ్ళిచూపులు చూసే అవసరమే రాలేదు. అమ్మాయి పేరు అనూష. ఏమ్.కాం. పాసయింది. ఏదో ప్రైవేట్ స్కూల్లో టీచర్‌గా చేస్తోందిట. ఏదో కాలక్షేపానికి ఉద్యోగం చెయ్యడమే తప్ప చేసి తీరాలనే పట్టింపు లేదుట.

పన్లోపనిగా భారతికీ పెళ్ళి చెయ్యాలని కోడలు చాలా హైరానపడింది కానీ ఎక్కడా కుదర్లేదు.

ఘనంగా మనవడి పెళ్ళయింది. అనూష కాపురానికి వెళ్ళి పోయింది. భారతి ఉద్యోగంలో మరో మెట్టు పైకి ఎక్కింది. కంపెనీ వాళ్ళు హైదరాబాదులో వున్న వాళ్ళ బ్రాంచికి భారతిని పంపించాలనుకున్నారు. భారతి కూడా ఎంతో ఉత్సాహం చూపించింది.

ఈ ఊళ్ళో వుండి వుండి విసుగెత్తింది. ఊరు మారితే నాకూ బాగుంటుంది. కొత్త మనుషులు. కొత్త వాతావరణం. నాకూ మార్పు కావాలి అంది. మనూని వెంటతీసుకు వెళ్తానంది.

"దాని చదువు ఏంచేస్తావ్? సంవత్సరం మధ్యలో వెళ్తే అక్కడ స్కూల్లో ఎడ్మిషన్ దొరకద్దూ. ఈ ఏడాది ఇక్కడే వుండనీ. వచ్చే సంవత్సరం తీసుకువెళ్ళి అక్కడ జాయిన్ చెయ్యి. ఈలోగా నీకూ అక్కడ అంతా అలవాటు అవుతుంది" అన్నాడు అబ్బాయి.

"అవును. నేనా విషయం ఆలోచించనే లేదు" అంది భారతి.

నాకెందుకో ఆ మార్పు నచ్చలేదు. పక్కకి పిల్చి అడిగాను. "ఎందుకొచ్చిన గొడవే ఇది? అక్కడ వంటరిగా ఏం చేస్తావ్? అందరం కలిసి ఇక్కడ వుంటే సుఖం కాదా" అన్నాను.

బరువుగా నిట్టూర్చింది. "ఎవరికి సుఖం మామ్మా? అమ్మా నాన్నగారూ లోలోపల ఎంత బాధపడుతున్నారో నేను గమనించలేదనుకున్నావా? వాళ్ళిద్దరిలో ఎంత మార్పు వచ్చింది? అదివరకు ఎలావుండే వాళ్ళు ఇప్పుడెలా వున్నారు? వాళ్లని అలా చూస్తుంటే నాకు చాలా బాధగా వుంది. నన్ను నేను క్షమించుకోలేక పోతున్నాను. నేను వాళ్ళకళ్ళ ఎదుట వున్నంత వరకూ వాళ్ళకీ నరకం తప్పదు. అందుకే కొన్నాళ్ళు దూరంగా వెళ్ళిపోతే సుఖంగా వుంటారేమో అని ఆశతో నేనే అడిగి ఈ ఛాన్సు తీసుకున్నాను" అంది. ఇక నేనేం చెప్పను?

మమ్మీ వేరే ఊరు వెళ్ళిపోతుందని తెలిసి మనూ ముందు బిక్కమొహం వేసింది. తర్వాత అన్నీ వివరంగా చెప్తే అర్థంచేసుకుని "సరే మమ్మీ వెళ్ళు" అనేసింది నవ్వుతూ. భారతి వెళ్ళిపోయింది.

"ఇదీ ఒకందుకు మంచిదే. మనందరితో వుంటే దీనికి వంటరితనం బాధించడం లేదు. అక్కడికి వెళ్తే వంటరితనం భరించలేక పెళ్ళికోసం తనూ సీరియస్‌గా ప్రయత్నిస్తుంది. ఇన్నాళ్ళూ నాగోల తప్ప తండ్రీ కూతురూ నిమ్మకు నీరెత్తినట్లు వూరుకుంటున్నారు" అని ఆనందపడింది నా కోడలు.

ఇంట్లో మేము ముగ్గురం. 'మనూ' కి బాగా జ్ఞానం వస్తోంది. ఆ వయసుకి తగిన కుతూహలం జిజ్ఞాస పుష్కలంగా వుండటంతో తన తోటి వారితో తనని పోల్చుకుని వాళ్ళలా తను బాల్యాన్ని అనుభవించడం లేదని బాధపడేది. పైకి నోరు విప్పి చెప్పక పోయినా దాని తపన మాకు అర్థం అవుతూనే వుంది.




అందరం దాని మనసునుండి ఆ భావ నను తొలగించడానికి శాయశక్తులా ప్రయత్నం చేశాం. అంతకుమించి ఇంకా చెయ్యడానికి మా మనసులు ఉత్సాహం తెచ్చుకున్నా శరీరాలు సహకరించకపోవ డంతో ఇబ్బంది వచ్చిపడింది. నేనా బాగా పెద్దదాన్ని అయిపోయాను. అబ్బాయికి అరవై దగ్గరపడుతోంది. బ్లడ్‌ప్రెషరు మనిషి. కోడలికి మెనోపాజ్ సమయం.

ఎదురింట్లో వున్న దాని ఫ్రెండ్ అప్పటిక ప్పుడు కావాలని పేచీపెడితే వాళ్ళ నాన్న వున్నపళంగా బయలుదేరి రాత్రి పదింటికి ఎక్కడికో తీసుకువెళ్ళి ఐస్‌క్రీమ్ కొనిపె ట్టాడు.

దాన్ని చూసి ఇదీ కావాలని అడిగింది. రాత్రిపూట ఎవరు తీసికెళ్తారు? అబ్బాయి డ్రైవింగ్ బాగా తగ్గించేశాడు. అందులోనూ రాత్రిపూట అంటే అసలే సాహసించడు. అందుకే "ఇప్పుడు కాదులే మనూ. రేపు వెళ్దాం" అని నచ్చచెప్పాడు.

పక్కింట్లోని దాని ఫ్రెండ్ వాళ్ల అమ్మా నాన్నలతో అదేదో ఎగ్జిబిషన్‌కి వెళ్లి అక్కడ నాలుగు గంటలసేపు తిరిగి ఎంజాయ్ చేసి వచ్చాడుట.

మనమూ వెళ్దాం. నన్నూ తీసుకు వెళ్లండి అని పేచీపెట్టింది. ఇదుగో అదుగో అని వాయిదా వేసి చివరికెలా అయితేనేం తీసుకు వెళ్లాం. వెళ్లటం వెళ్లాంగానీ దాని సరదా తీరనే లేదు. ఆ జెయింట్‌వీల్, టొరాటోరా, రోలర్ కోస్టర్... వగైరాలన్నీ ఎక్కుతానని సరదాపడింది. వాటిని దూరం నుంచి చూస్తుంటేనే మాకు కళ్లు తిరుగుతు న్నాయి. ఇంక మేము ఎలా ఎక్కుతాం?

తల్లిదండ్రులతో వాటినెక్కి తిరిగే పిల్లలని చూసి చిన్నబుచ్చుకుంది. ఐస్‌క్రీమ్‌లు, కేండీలు కావలసినన్ని కొనిపెట్టాడు అబ్బాయి. కాసేపు తిరిగి ఇంక ఇంటికెళ్లి పోదాం అంది.

ఇంటికి రాగానే నాకు కడుపు నొప్పి అని చాలాసేపు ఏడిచి పడుకుని నిద్రపోయింది. కడుపు నొప్పి ఒక సాకు అనీ ఉక్రోషం పట్ట లేక ఏడ్చిందనీ మాకు అర్థం అవుతూనే వుంది.

ఆ తర్వాత మమ్మల్ని ఏమీ అడిగేది కాదు. మా అంతట మేమే పూనుకుని ఎక్క డికైనా తీసుకువెళ్తే వెంట వచ్చేది. ఏం కొనిస్తే అది తీసుకునేది. తనకై తను ఏమీ అడిగేది కాదు. పసిపిల్లలు అల్లరి చేసి ఏడిచి గొడవచేస్తే విసుక్కుంటూనే వాళ్లని సముదాయించగలం గానీ పరిస్థితులను అర్థం చేసుకుని తదనుగుణంగా నడుచు కుంటూ వుంటే పెద్దవాళ్లకి గుండె కలిచివే స్తుంది.

రెండు వారాలకి ఒకసారి భారతి వచ్చేది. అప్పుడు దానికి ఆటవిడుపు. తల్లీకూతురూ కలిసి ఊరంతా బలాదూరు తిరిగేవాళ్లు. అది వెళ్లగానే మళ్లీ మామూలే. ఎలాగో ఈ నాలుగైదు నెలలూ గడిస్తే తల్లి వెంట వెళ్లి పోతుంది. అన్ని సమస్యలూ తీరుతాయి అనుకున్నాం.

కానీ మనూలో చెప్పలేని మార్పు వచ్చింది. స్తబ్దుగా తయారయింది. చదు వులో వెనక పడసాగింది. అన్నం తినడానికి పేచీ పెట్టేది. డాక్టర్‌కి చూపిస్తే పరీక్షలు అన్నీ చేయించి చూశాడు.

"శారీరకంగా అంతా నార్మల్‌గా వుంది. ఎందుకైనా మంచిది నాకు తెలిసిన చైల్డ్ సైకాలజిస్ట్ ఒకరు వున్నారు ఆయన దగ్గరికి తీసుకు వెళ్లండి" అన్నాడు.

భారతి వచ్చినప్పుడు ఆయన దగ్గరికి తీసుకు వెళ్లింది. మనూతో చాలాసేపు కబుర్లు చెప్పాడుట ఆయన. తర్వాత మనూని పంపించి భారతితో మాట్లాడా డుట.

"తనతోటి వారితో తనని పోల్చుకుని

బాధపడుతోంది. సామాన్యంగా ఈ వయసు పిల్లలు ఇలా అవడం సామాన్యమే. ఇదేమీ ప్రమాదం కాదు. కానీ ఇలాగే వుంచితే ముందుముందు సమస్యలు ఎదురు కావచ్చు

"ఆర్థికంగా మీకు సమస్య లేదుకాబట్టి మంచి రెసిడెన్షియల్ స్కూల్లో పాపని జాయిన్ చెయ్యండి. అక్కడైతే అందరి తోనూ కలిసిపోతుంది. ఈ కాంప్లెక్స్ తగ్గి పోతుంది" అన్నాడుట.

భారతి గతుక్కుమందిట.

"పోనీ నేను మళ్లీ పెళ్లి చేసుకుని సెటిల్ అయితే దానికి సంతోషంగా వుంటుందా" అని అడిగిందిట.

"వద్దు. హడావిడిగా అటువంటి పని ఎప్పుడూ చెయ్యకండి. పాపకి తన తండ్రి ఎవరో బాగా తెలుసు. మరో కొత్త తండ్రితో అంత త్వరగా అడ్జస్ట్ కాలేకపోవచ్చు కాబట్టి మీరు మరో పెళ్లి చేసుకున్నా కొన్నాళ్లు పాపని ఇంటి వాతావరణానికి దూరంగా వుంచడం అన్ని విధాలా మంచిది. దూరంగా వుండాలి అని బాధ పడకండి. అటువంటి వాతావరణంలో వుంటే మన స్విని ఉత్సాహంగా వుంటుంది. చాలా బ్రైట్ ఛైల్డ్. బాగా పైకి వస్తుంది. పాప ఫ్యూచర్ కోసం మీరీ డెసిషన్ తీసుకుంటే అన్ని విధాలా మంచిది" అన్నాడుట.

"ఇంతమందిమి వుండి పసిపిల్లను ఒంట రిగా వదిలేస్తామా?" అని బాధపడింది కోడలు.

"తప్పదు! దాని మంచికోసం మనం ఈ పని చెయ్యాలి" అన్నాడు అబ్బాయి.

భారతి ఏమీ మాట్లాడలేదు. దిగాలు పడి పోయింది.

"ఆ ప్రయత్నాలు చేస్తాను" అని వెళ్లిపో యింది.





అన్ని ఏర్పాట్లూ జరిగిపోయాయి.

"నేను కొన్నాళ్లు భారతి దగ్గర వుంటా నురా అబ్బాయ్" అన్నాను.

అబ్బాయి, కోడలు నా నిర్ణయానికి సంతో షించారు.

"నేనూ నిన్ను అడుగుదాం అనుకున్నాను మామ్మా! నాకూ ఒంటరితనం చాలా బాధగా వుంది. ఇంట్లో అడుగుపెట్టిన దగ్గ రనుండి ఏదో దిగులు. నువ్వు వుంటే నాకు బాగుంటుంది" అంది భారతి.

నేను, భారతి, మనూ బయలుదేరాం. మనూని హాస్టల్‌లో దించి అక్కడినుంచి భారతి ఇంటికి ప్రయాణం అయ్యాం మేమి ద్దరం.

ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లో ఇద్దరు ప్రయాణం చేసే కూపే. అర్ధరాత్రి దాటింది. బయట పండు వెన్నెల. కిటికీలోంచి చూస్తూ కూర్చున్నాను. అటూ ఇటూ పొర్లి నిద్రపట్టక పై బెర్త్ మీదనుండి దిగి వచ్చింది భారతి.

"నువ్వూ నిద్రపోలేదా మామ్మా?" అని అడిగింది.

"లేదమ్మా! రైలు ప్రయాణం అలవాటు లేదుకదా! అందుకే నిద్ర రావడం లేదు" అన్నాను.

నా ఒడిలో తలపెట్టుకుని పడుకుంది.

"నాకూ నిద్రపట్టడం లేదు మామ్మా! మనూ గుర్తుకి వస్తోంది"

చెప్తుంటే దాని కంఠం బరువెక్కింది. ఆద రంగా దాని తల నిమిరాను.

కాసేపటి తర్వాత తేరుకుని కళ్లు తుడుచు కుంది.

"మామ్మా! నేను ఆడపిల్లగా కాకుండా మగవాడిగా పుట్టివుంటే నా జీవితం ఇంకా బాగుండేదా?" అని అడిగింది!!

**నేనేం సమాధానం చెప్పగలనా ప్రశ్నకి? ఇది తరతరాల తరగని చరిత్ర!!!** ★

# చతుర కథలు

## లంచాల్రావు

లంచాల్రావ్ అసలు పేరేమిటో అందరం ఎప్పుడో మరచిపోయాం. ఈ ఆఫీసులోకి మేమంతా చేరుకొనేసరికే అతనిపేరు అలా మారిపోయి ఉంది. విచిత్రం ఏవిటంటే మేం అంతాకూడా అతన్ని ఈ పేరుతోనే పిలిచిన ప్పటికీ అతనేమీ ఫీలవ్వడు. పైగా ఏదో "భారతరత్న'' బిరుదు తగిలించినంతగా ఆనందిస్తాడు.

అతనికి ఆ పేరెలా వచ్చిందో వేరే చెప్పన క్కర్లేదనుకొంటా!!

లంచాల్రావ్ అంటే ఆఫీసులో అందరికీ అసూయే. అఫ్‌కోర్స్... ఈ అందర్లో నేకూడా ఉన్నానని చెప్పడానికి కొంచెం ఇబ్బందిగా ఉన్నా ఒప్పుకోక తప్పదు.

మడత నలగని బట్టల్తో ఎప్పుడూ టిప్ టాప్‌గా ఉంటాడు. మెడలో బంగారం చైన్... జేబులో ఫారిన్ బ్రాండ్ సిగరెట్, చేతి మణిక ట్టుకి బంగారు బ్రేస్‌లెట్, వేళ్లకి రెండు ఉంగరా లు.. ఎప్పుడూ "నిండుగా'' ఉండే జేబులు, లేటెస్ట్ మోటార్ సైకిల్.

లంచాల్రావ్‌ని ఏ సీట్లోకి మార్చినాకూడా లంచాలు దండుకోగల కెపాసిటీ ఉన్నవాడు. నిజానికి లంచాలు వచ్చే ఆఫీసుకాదు మాది. ఆఫీసులో ఏ సీట్లో కూర్చోబెట్టినాకూడా మాలో ఏ ఘనుడూ కూడా ఒక్క రూపాయి కూడా గిల్లుకోలేడు. అందుకే అతనంటే మా అందరికీ అంత "ఇది''

ఈ 'లంచా'ల్రావ్ విషయం 'పైదాకా' ఎన్నోసార్లు వెళ్ళి మందలింపులు కూడా వచ్చాయ్.

"ఎప్పుడో ఒకప్పుడు దెబ్బతింటావు గానీ, ఈ 'చిరుతిళ్ళు' మానెయ్..." అంటూ మేమంతా పోరు పెడ్తూనే ఉండేవాళ్ళం!

అయితే మరింత గట్టిగా చెప్తే లంచాలు తీసుకోవడం నిజంగా ఎక్కడ మానేస్తాడో అని మావాళ్లలో కొందరు భయపడకపోలే దు.

ఎందుకంటే...

అవసరం పడినప్పుడు అతను మాకు డబ్బు సాయంచేసేవాడు.

నెలకోసారైనా 'పార్టీలు' ఇస్తుండేవాడు. సాయంత్రాలు ఆఫీస్‌లో లేటయితే పలావ్‌లో, టిఫిన్లో అందరికీ తెప్పిస్తుండేవాడు. ఇలా చాలా 'ఉపయోగ పడుతుండేవాడు.

ఇలా లంచాల్రావ్ తన 'తిండి' తను తింటూ మాకు 'సహాయాల్రావ్'గా ఉంటూ వచ్చాడు.

ఇదిలా సాగుతుండగా ఈ లంచాలు తీసు కుంటూ పట్టుబడితే లంచాల్రావ్ ఫ్లస్ అతని కుటుంబం ఏమవుతుందోననే భయంతో మేం చేసే వత్తిడీ, పైనుంచీ అడపాదడపా వచ్చిపడుతున్న శ్రీముఖాలవల్ల... హఠాత్తుగా ఓరోజు అతను 'లంచాలు తీసుకోవడం మా నివేస్తున్నట్లు' ప్రకటించేశాడు.

నిజంగానే లంచాలు తీసుకోవడం మాని వేశాడు.

మేం చాలా సంతోషించాం, కరడుకట్టిన తీవ్రవాది జాతీయస్రవంతిలో కలిసిపోయి నంతగా.

అయితే! అసలు సమస్య ఇక్కడే ప్రా రంభమయింది.

ఓరోజు అర్ధరాత్రి లంచాల్రావ్ మా ఇంటి తలుపుకొట్టి మరీ లేపి చుట్టాలొచ్చారనీ, ఓ అయిదొందలు అర్జంట్‌గా కావాలనీ, పట్టుకెళ్ళా





డు. మరోరోజు వాళ్ళ పిల్లల ఫీజులు కట్టాలని ఇలా ఇలా... నా దగ్గరే కాదు.. ఆఫీసులో అందరిదగ్గరా ఏదోకారణం చెబ్తూ అప్పులు జోరుగా చేసేయసాగాడు.

ఆ విధంగా లంచాల్రావ్ కాస్తా అప్పుల్రావ్‌లాగా మారిపోయాడు. ఆఖరికి మా స్వీపర్నికూడా వదల్లేదు. ఇప్పటి అప్పుల్రావే ఒకప్పటి లంచాల్రావ్ అన్నా ఎవరూ నమ్మలేనంతగా మారిపోయాడు.

అయితే ఇన్నిన్ని అప్పులు ఎందుకు చేస్తున్నాడో మాత్రం మాకెవరికీ అంతుచిక్కక కూపీలాగడం ప్రారంభించాం. చివరికి మావాడొకడు అసలు విషయం కనిపెట్టి మాకు వినిపించాడు.

వాడు ఇదివరలో దండిగా లంచాలు సంపాదించే టైంలో 300 లీటర్ల ఫ్రిజ్, 29 అంగుళాల టీవీ, రిమోట్ వీసీఆర్, వెయ్యివాట్ల మ్యూజిక్ సిస్టమ్, కార్పెట్లూ, రోజ్‌ఉడ్ ఫర్నిచరూ, ఆటోమేటిక్ వాషింగ్‌మెషిన్లూ, ఇళ్లస్థలాలూ ఇంకా... ఏవేవో వాయిదాలపద్ధతిలో తీసుకొన్నాట్ట. ఇప్పుడు వాటివాయిదాతోపాటు ఒకటొకటీ రిపేర్లు మొదలయ్యాయట. వాటి రిపేరు ఖర్చులూ, ఇంకా వాయిదాలూ భరించడానికి ఇప్పుడు లంచాలు లేవుగా మరి. అంచేత మమ్మల్ని బాదేయడం మొదలెట్టాడన్నమాట.

అంతా కలిసి కాంటీన్లో కూచుని లెక్కలు వేయగా సుమారు యాభైవేలకి పైగా కేవలం మా కొలీగ్స్‌నుంచే అప్పులు చేసినట్లు తేలింది.

అందరికీ గుండెలు గుభేల్మన్నాయి. ఇవన్నీ తిరిగిరాని బాకీలుగా జమచేసుకోవాలనుకునేసరికి మాకు కాళ్ళూచేతులూ ఆడడంమానేశాయి. వెన్నులో వణుకు మొదలైంది.

చివరికి అందరం కలిసి స్పెషల్ మీటింగ్ పెట్టుకొని అప్పుల్రావ్‌ని మళ్లీ లంచాల్రావ్‌గా మార్చేయాలనే నిర్ణయానికొచ్చేశాం.

అతను లంచాల్రావ్‌గా ఉంటేనే మాకూ, అతనికీ కూడా ఆనందం అనే కంక్లూషన్‌కి వచ్చేసి మా ప్రయత్నాలు మొదలుపెట్టాం.

ఓ నెల తిరిగేసరికే మా అందరి 'అండ'తో అప్పుల్రావ్ మళ్లీ లంచాల్రావ్ అవతారం ఎత్తేశాడు.

ఓ రెణ్ణెల్లల్లో మా అప్పులన్నీ తీర్చేశాడు.

ఇప్పుడు మళ్లీ మా అందరికీ అప్పులివ్వగలిగే స్థాయికి చేరుకున్నాడు. మా కథ సుఖాంతం అయింది.

—నాగిశెట్టి

# హెచ్చరిక

పోలీస్ ఆఫీసర్ సుబ్బారావుగారికి ప్రభుత్వం ఆయన వృత్తిపరమైన సౌకర్యం కోసం సెల్యులర్ ఫోన్ని ఏర్పాటుచేసిన మర్నాడు ఆయనకి దాంట్లో ఓ చిత్రమైన కాల్ వచ్చింది.

"హలో? సుబ్బారావు హియర్' చెప్పాడాయన.

"క్లాక్ టవర్. సికింద్రాబాద్' విని పించిందో కంఠం.

"హలో? ఎవరు మీరు?"

ఫోన్ పెట్టేశారు అవతలివైపు. ఆ ఫోన్ కాల్ వచ్చిన పదినిమిషాల్లో సికింద్రాబాద్ లోని క్లాక్ టవర్లో అమర్చిన బాంబు పేలి అది కూలిపోయిందని ఆయనకి అయిదు నిమిషాల తర్వాత తెలిసింది.

మర్నాడు సరిగ్గా అదే సమయానికి పోలీస్ కమీషనర్ సెల్యులర్ ఫోన్ మళ్ళీ మోగింది.

"హలో? పోలీసాఫీసర్ సుబ్బారావు హియర్'

"కోళ్ళఫారం, హయత్‌నగర్' విని పించింది నిన్నటి కంఠం.

"హలో. ఎవరు నువ్వు? ఎక్కడనించి?" అడిగాడాయన.

జవాబుగా అవతలవైపునించి లైన్ కట్ అయింది. ఆ సెల్యులర్ కాల్ వచ్చిన సరిగ్గా పదినిమిషాలకి ఓ మంత్రికి చెందిన హయత్ నగర్‌లోని కోళ్ళఫారంలో బాంబు పేలి పాతికవేల కోళ్ళు మరణించాయన్న వార్త అందింది పోలీస్ ఆఫీసరుగారికి.

మూడోరోజు సుబ్బారావుగారు ఎదురు చూసినట్లుగానే సెల్యులర్ ఫోన్ మోగింది మధ్యాహ్నం ఒకటిన్నరకల్లా.

"హల్లో?"

"మహిళా పోలీస్‌స్టేషన్' ఎప్పటి కంఠమే.

"హల్లో? ఎవరు మీరు? హలో... హలో?"

యధాతథంగా ఫోన్ పెట్టేశారు అవతల వైపు.

సరిగ్గా పది నిముషాల తర్వాత మహిళా పోలీస్ స్టేషన్‌లో బాంబు పేలి ఆ బిల్డింగ్ కూలడం జరిగింది. అదృష్టవశాత్తూ అక్కడెవరూ లేరు.

నాలుగవరోజు పోలీసాఫీసర్ సుబ్బారావు



గారు లంచ్‌కోసం తన ఇంటికి కారులో బయలు దేరాడు. ఆ ఫోన్ కాల్ టైం దగ్గరయ్యేకొద్దీ ఆయనలో ఆత్రం అధికం అవసాగింది. మళ్ళీ ఫోన్ వస్తుందా? ఈసారి ఎక్కడ బాంబు అమర్చివుంటారు? అసలు వీళ్ళెవరు? ఎందుకిలా ఒకటొకటి పేల్చేస్తున్నారు? ఆయన కారు హుసేన్‌సాగర్ పక్క నుంచీ విశ్వేశ్వరయ్య స్టేట్యూ ఎదురుగా కొత్తగా కట్టిన ఫ్లై ఓవర్ మీదకి ఎక్కుతుండగా ఫోన్ మోగింది.

"హల్లో' ఆత్రంగా అడిగాడాయన.

"ఫ్లయ్ ఓవర్' వినిపించిందో కంఠం.

"ఏ ఫ్లయ్‌ఓవర్?" అదిరిపడి అడిగాడాయన.

"ఆ సంగతెలానూ త్వరగానే తెలుస్తుంది గదా! ఇదంతా అసలెందుకంటే -మేం చెప్పినట్లు చేసి తీరుతాం- అని మీకు అర్థంకావటంకోసం

మా డిమాండ్స్ గురించి రేపు ఫోన్‌చేసి వివరంగా మాట్లాడతాను గదా! ఈలోగా మా శక్తిసామర్థ్యాలు మీకు తెలియచేయడానికి ఇలా..."

"డ్రైవర్ కారు వెనక్కి తిప్పు" సుబ్బారావుగారు. అరిచిన మరుక్షణం దూరంగా ఓ బాంబు పేలిన శబ్దం వినిపించింది.

**-మల్లాది**

---

# చలో, సింగపూర్

నలభయ్యేళ్ళ చలపతి ఓ చిన్న తరహా బిజినెస్‌మెన్. చదువు పెద్దగా లేకపోయినా ఇంగ్లీషు కొంతవరకు నేర్చుకున్నాడు.

చలపతి మిత్రులు కొందరు సింగపూర్‌లో పనిచేస్తున్నారు. వారు సెలవుల్లో వచ్చినప్పుడల్లా ఆ దేశపు విశేషాలను, రమణీయ దృశ్యాలను, డ్యూటీ ఫ్రీ షాపులనూ గూర్చి వర్ణించి చెబుతూంటే, జీవితంలో ఓసారయినా సింగపూర్ వెళ్ళిరావాలన్న కోర్కె కలిగింది అతనికి.

ఓసారి 'హైద్రాబాద్ టు సింగపూర్ డైరెక్ట్ ఫ్లైట్' అన్న హోర్డింగ్‌ని చూడడం జరిగింది చలపతి. సింగపూర్ వెళ్లాలన్న ఆత్రుత పెరిగిపోయింది అతనిలో. మంచిరోజు చూసి సింగపూర్ ట్రిప్‌కి ముహూర్తం పెట్టేసుకున్నాడు.

అనుకున్న రోజున ఏర్‌పోర్ట్‌కి వెళ్ళి సింగపూర్ ఫ్లైట్ ఎక్కాడు చలపతి. ఎగ్జిక్యూటివ్ క్లాసులో దర్జాగా కూర్చున్నాడు. విమానం ఎక్కడం అదే మొదటిసారేమో అందాలు చిందుతూ, వయ్యారంగా కదిలే ఏర్ హోస్టెసెస్‌నీ, తోటి ప్రయాణీకులనూ ఆసక్తిగా తిలకించసాగాడు.

మరికొన్ని నిముషాలలో విమానం బయలుదేరనున్నట్లు ఎనౌన్స్‌మెంటు వినిపించింది. తన పక్కనున్న సీటువంక చూశాడు చలపతి. ఖాళీగా వెక్కిరించిందది. చుట్టూ జంటలు వున్నాయి.

విమానం బయలుదేరుతూవున్నా, తాను ఆత్రుతతో ఎదురుచూస్తూన్నది జరక్కపోయేసరికి కోపం వచ్చింది చలపతికి. బెల్‌కొట్టి ఏర్‌హోస్టెస్‌ని పిలిచాడు. "వేర్ఈజ్ మై కంపానియన్?" అనడిగాడు.

ఆ పిల్ల అర్థంకాక, "వాడ్డూయూ వాంట్ సర్?" అనడిగింది పొలైట్‌గా.

"మై కంపానియన్... టు ట్రావెల్ విత్ మీ... టు సింగపూర్..." అన్నాడు.

"యువర్ కంపానియన్?! వేరీజ్ షీ?" ఎదురు ప్రశ్న వేసిందామె అయోమయంగా.

చలపతికి చిర్రెత్తుకొచ్చింది. "అదే నేనూ అడుగుతున్నాను'' అంటూ కసురుకున్నాడు. తరువాత "చీటింగ్... ఎవ్విరివేర్ చీటింగ్... ఐ విల్ స్యూ..." అని గొణుక్కుంటూ,

కాళ్ళదగ్గర పెట్టుకున్న బ్రీఫ్‌కేస్‌ని అందుకున్నాడు. అందులోంచి పేపర్ కటింగ్ ఒకటి తీసి ఆ పిల్ల ముందుంచాడు, "సీ దిస్'' అంటూ.

కుతూహలంగా చూసింది ఏర్‌హెూస్టెస్. అందులో ఆ ఏర్‌లైన్స్ వారి ఎడ్వర్‌టైజ్‌మెంట్ వుంది. 'కంపానియన్ ఫ్రీ ఇన్ ఎగ్జిక్యూటివ్ క్లాస్'

విషయం అర్థమయిపోయిందామెకు.

'కంపానియన్ ఫ్రీ అంటే... ఏర్‌లైన్స్ అమ్మాయిలను సప్లయ్‌చేయదనీ, ఓ టికెట్ ఫ్రీ అని అర్థమనీ... ఆ పెద్ద మనిషికెలా ఎరుకపరచాలో బోధపడక, 'ఓ మై గాడ్!" అంటూ తలపట్టుకుని ఖాళీ సీటులో కూలబడిపోయింది.

—తిరుమలశ్రీ



# లక్కీఛాన్స్

పేపర్లో ప్రకటన మరొక్కసారి చదివాడు సుబ్బారావు. తన కళ్ళు కానీ, మెదడు కానీ తనను మోసం చేయలేదు కదా అని మరొక్కసారి ధృవపరచుకున్నాడతను. తాను చదివింది నిజమేనన్న నమ్మకానికి వచ్చాడతను. ఫలానా వీధిలో ఫలానాచోట నల్లని, ఎత్తైన, మెడలో లైసెన్స్ బెల్టు కలిగిన కుక్క ఒక బంగారు గాజు జారవిడిచిందనీ దాని యజమాని కుక్కతోసహా అక్కడకు వచ్చి, గుర్తులు చెప్పి నమ్మకం కలిగించి గాజు పొందవచ్చని ఆ ప్రకటన సారాంశం. ప్రకటన పడిన రోజే ఫలానా టైముకి అదే చోటుకి వచ్చి గాజు తీసుకోవాలని సూచించబడింది. సుబ్బారావు ఆనందంతో తబ్బిబ్బయిపోయాడు. ఆ కుక్క రూఢిగా తనదే, తరచూ పేపరులో ప్రకటించిన ప్రదేశానికి వెడుతూ ఉంటుంది... కానీ గాజు మాత్రం సుబ్బారావు భార్యది కాదు. 'ఆ! అయితేనేం? ఈరోజుల్లో అంత నిజాయితీపరులు ఎవరున్నారు? ఆ పేపర్లో ప్రకటించినాయన శుద్ధ అమాయక చక్రవర్తిగానీ... అంది వచ్చిన అదృష్టం వదులుకోవడం మూర్ఖత్వం' అనుకున్నాడు సుబ్బారావు. పేపరులో చెప్పిన టైము అయ్యింది. సుబ్బారావు కంగారుగా తన కుక్కతోసహా ఆ ప్రదేశానికి బయలుదేరాడు. అప్పటికే అక్కడ మూడు నాలుగు కుక్కలు వాటి తాలూకు





యజమానులు ఉన్నారు. సుబ్బారావుకి కొంచెం నిరుత్సాహం కలిగింది. 'ప్రయత్నం వల్ల నష్టంలేదుగా' అని తననుతాను ఉత్సాహపరుచుకున్నాడు. ఎవరో వ్యక్తి ఒక్కొక్క యజమానిని ప్రశ్నలడగడం, కుక్కలను పరిశీలించడం మొదలుపెట్టాడు. సుబ్బారావు వంతు వచ్చింది. ఆ వ్యక్తి కొన్ని ప్రశ్నలడిగి సుబ్బారావు కుక్కని పరిశీలించి కుక్క సుబ్బారావుదేనని కన్‌ఫర్మ్ చేసాడు. అంతకు ముందు సుబ్బారావు తన కుక్క గుణగణాలు గర్వంగా ఏకరువుపెట్టాడు. అందరి సమక్షంలో గాజు జారవిడిచిన కుక్క సుబ్బారావుదేనని నిర్వివాదంగా నిర్ణయమయ్యింది. సుబ్బారావు ఆనందానికి అంతులేదు. పేపర్లో ప్రకటన వేసిన వ్యక్తి తాపీగా "కుక్క మీదేగదండీ సుబ్బారావు గారూ... అయితే బంగారు గాజు లేదు, ఏమీ లేదు... ఆ రోజున నేను రోడ్డుమీద నడచి వెడుతూంటే నన్ను మీ కుక్క కరిచింది. ఈ చుట్టుపక్కల వాళ్ళంతా చూశారు. నాకు ఇంజక్షన్లకి ట్రీట్‌మెంట్‌కి ఐదువేల రూపాయిలయింది.ఆ ఖర్చు మీరు నాకు ఇవ్వాలి. లేకపోతే మీమీద కేసుపెట్టాల్సి ఉంటుంది" అన్నాడు. సుబ్బారావు మొహంలో కత్తివాటుకు నెత్తురుచుక్కలేదు.

–ఎం.వి.ఎస్.ఎస్. ప్రసాద్

---

# దేముడు

రామకృష్ణ పోస్ట్‌గ్రాడ్యుయేషన్ పూర్తిచేశాడు. అదనంగా అనేక డిప్లమాలు సంపాదించాడు. తెలుగు, ఇంగ్లీషులలోనేకాక హిందీలోనూ ప్రావీణ్యం గడించాడు. వయసు చిలిపిది కావడంతో రామకృష్ణ సహజంగానే ప్రేమలో పడ్డాడు. కంప్యూటర్ క్లాసులో కలుసుకున్న ప్రసన్నలక్ష్మితో పరిచయం పెరిగిపెరిగి ప్రేమగా మారిపోవడంతో రామకృష్ణ ప్రసన్నలక్ష్మినే పెళ్లిచేసుకోవాలనుకున్నాడు.

"నా సైడ్‌నుంచి ఎలాగూ ఓకే అవుతుంది, మీ అమ్మా నాన్నకి చెప్పిచూడు" అన్నాడు ప్రసన్నలక్ష్మితో రామకృష్ణ. "సరే" అంది ప్రసన్నలక్ష్మి.

ఒక రోజున టీవీలో 'రుతురాగాలు' నాట

కం. అయ్యాక అమ్మానాన్నకి ప్రసన్నలక్ష్మి తన ప్రేమవిషయం చెప్పింది. తండ్రి వెంకట్రామయ్య మండిపడలేదు. పెద్ద సమస్య ఎదురయింది. 'రుతురాగాలు'లోని పాండూ వంటివారు వుంటే బావుంటుందనీ అనుకోలేదు. రామకృష్ణ వివరాలు అన్నీ కూతురిని అడిగి తెలుసుకుని సంతృప్తిపడ్డాడు. ఒకసారి అబ్బాయిని ఇంటికి తీసుకురమ్మని కూతురితో చెప్పాడు.

ప్రసన్నలక్ష్మి తండ్రిమాట జవదాటకుండా కంప్యూటర్ క్లాస్ పూర్తయ్యాక రామకృష్ణని ఇంటికి తీసుకువచ్చి వెంకట్రామయ్యగారికి పరిచయం చేసింది.

"కూర్చో బాబూ'' అని ప్రేమతో పలకరించి "మా అమ్మాయిని నీకు యివ్వడానికి నాకు ఏవిధమైన అభ్యంతరమూ లేదు. పెద్ద చదువులే చదివావు. ఇంకా చదువుతావా? లేక ఏంచేస్తావు?" అని రామకృష్ణని అడిగారు వెంకట్రామయ్యగారు.

"దేవుడిదయవలన ఉద్యోగంచేస్తాను'' అన్నాడు రామకృష్ణ.

"వెరీగుడ్, ఆ తర్వాత" అడిగారు వెంకట్రామయ్యగారు.

"దేవుడిదయవలన ఒక ఇల్లు కట్టుకుని నేనూ, ప్రసన్నలక్ష్మి ఆ ఇంట్లో స్థిరపడతాము'' అన్నాడు రామకృష్ణ.

"వెరీగుడ్. మరి ఆ తర్వాత" అడిగారు వెంకట్రామయ్యగారు.

"దేవుడిదయవలన ఒక చక్కటి కారు కొనుక్కుంటాను'' అన్నాడు రామకృష్ణ.

"వెరీవెరీగుడ్. మరి ఆ తర్వాత" వెంకట్రామయ్యగారు అడిగారు.

"దేవుడిదయవలన ఒకసారి స్విట్జర్లాండ్ వెళ్ళివస్తాము'' అన్నాడు రామకృష్ణ.

"అలాగా బావుంది'' అని టిఫిన్, కాఫీ పూర్తయ్యాక సెలవు తీసుకున్న రామకృష్ణని గేటుదాకా సాగనంపారు వెంకట్రామయ్యగారు.

"మీరు దేవుని వంటివారు. మీ అభిమానం, మంచి, మర్యాద మరిచిపోలేనివి'' అంటూ వెనుదిరిగాడు రామకృష్ణ.

"అబ్బాయి అమ్మాయికి, నాకేకాక మీకూ నచ్చాడనిపిస్తోంది. మరి ముహూర్తం ఎప్పుడు పెట్టించుదాము'' అని వెంకట్రామయ్యగారు లోపలికి రాగానే అడిగింది, భార్య.

"ముహూర్తం ఏమిటి. ఈ అబ్బాయి తరహా నాకు నచ్చలేదు. ఈ పెళ్ళి జరగదు''



అన్నారు వెంకట్రామయ్యగారు.

"ఏం, ఎందుకు'' అడిగింది భార్య.

"ఆ అబ్బాయి అన్నిటికి దేవుడినే నమ్ముతాడు. మంచిదేగానీ నన్నే దేవుడనుకుంటున్నాడు, అదీ అసలు గొడవ" అన్నారు వెంకట్రామయ్యగారు!

-తాజీప్రసాద్

# ఫ్రీ

ఆదినారాయణ అంతగా చదువుకోలేదు. అయినా అద్భుతమైన తెలివితేటలున్నాయి. ఏ పనీ ఆలోచించకుండా చేయడు. ఆచి తూచి అడుగేయడం అతని అలవాటు. ఇంటికి కావలసిన సరుకులు కొనడం దగ్గరనుంచీ అన్ని పనులూ తనే స్వయంగా చూసుకుంటాడు. ఊరగాయల దగ్గర్నుంచి కూరగాయలవరకూ గీచిగీచి బేరం ఆడితేకాని కొనడు. డిస్కౌంటులు, ఫ్రీలు ఎక్కడ ఇస్తారో అని బజారంతా వెతికివెతికి మరి కొంటూవుంటాడు. ఒక వస్తువు కొంటే మరో వస్తువు ఫ్రీ అంటే చాలు. ప్రస్తుతం ఆ వస్తువు అవసరం ఉందా లేదా అనేది ఆలోచించడు. అది కొనెయ్యవలసిందే! "ఇప్పుడు అవసరంలేక పోవచ్చు. మరొకప్పుడు అవసరంరాదా! అప్పుడు ఈ ఫ్రీ వస్తువు ఇమ్మంటే ఇస్తాడా?" అనేది ఆదినారాయణ వాదన.

డిస్కౌంటులు కూడా ఏ షాపులో ఎంత పెర్సంటేజీ ఇస్తున్నాడో అని అన్ని షాపులు తిరిగి మరీ ఎంక్వయిరి చేస్తాడు. ఏమాత్రమూ అశ్రద్ధ చేయడు. ఒకటికి రెండుసార్లు అడిగి మరీ తెల్సుకుంటాడు. ఊరికే కొంటున్నామా. బోల్డు రూపాయలు పోసి కొనేవాటి గురించి ఎన్ని జాగ్రత్తలు తీసుకొంటేనేం... అంటాడు. ఒకడికి ఊరకనే పది పైసలన్నా ఇవ్వడానికి ఒప్పుకోడు. అందరూ అతణ్ణి పిసినారి నారాయణ అంటారు. ఆదినారాయణ మాత్రం జాగ్రత్తపరుణ్ణి అంటాడు.




యధాప్రకారం తనే కిరాణాసరుకులకి వెళ్ళవలసి ఉన్నా జ్వరం తగలడంతో బయటకు వెళ్ళలేకపోయాడు ఆదినారాయణ. మానె న్నిండుకోవడంతో పెళ్ళాం పదేపదే పోరగా కొడుకుని పంపడాన్కి ఒప్పుకున్నాడు. చెప్పవలసిన జాగ్రత్తలన్నీ చెప్పి మరీ పంపించా

డు, ఓ కిలో రిఫైండ్ ఆయిల్ పేకెట్ పట్టుకురారా అని. వాడు వెళ్ళి చిటికెలో ఓ పేకెట్ పట్టుకొచ్చి పడేశాడు. "ఫ్రీలు ఏమన్నా ఉన్నాయేమో కనుక్కున్నావా..." అని అడిగాడు కొడుకుని. "ఏం లేవన్నాడు నాన్నా'' అంటూ వాడు తుర్రుమన్నాడు. పేకెట్ చేతిలోకి తీసుకొని చూసేసరికి పెద్దపెద్ద అక్షరాలతో నక్షత్రంలాంటి బోర్డర్‌లో ఫ్రీ అన్న పదం కనపడింది ఆదినారాయణకి. ఒక్కసారిగా గుండె జారిపోయినంత పనయింది. "ఏమేవ్ చూశావా. వెధవ ఫ్రీలేం లేవని చెప్పాడన్నాడా. ఇంతింత అక్షరాలతో తాటికాయల్లా కనపడుతుంటేనూ. ఉండు, నే వెళ్ళి కనుక్కువస్తాను'' అంటూ బయల్దేరాడు. "ఇదేం చోద్యమండీ. జ్వరంతో ఎలా వెళ్తారు'' అంటున్న భార్య మాటల్ని పట్టించుకోకుండా "జ్వరమైతే మాత్రం ఫ్రీగా వచ్చే దాన్ని వదులుకుంటామా'' అంటూ బయటకి నడిచాడు ఆదినారాయణ.

ఆదినారాయణని చూడగానే "ఏమిటండీ మీ అబ్బాయి మీకు జ్వరమని చెప్పాడు'' ఆశ్చర్యపోతూ అడిగాడు షాపతను. "జ్వరమేనయ్యా. ఏంచేస్తాం, రాక తప్పుతుందా నువ్వు చేసిన పనికి'' అన్నాడు ఆదినారాయణ. "నేను చేసిన పనా'' తెల్లబోయి చూశాడు షాపతను. "లేకపోతే ఏమిటి, ఫ్రీ అని రాసి మరీ వుంటే ఏం లేదంటావా పిల్లాడుగదా అని'' అంటూ చేతిలో వున్న ఆయిల్ పేకెట్‌ని చూపించాడు. "అబ్బే దానికి ఫ్రీలేం లేవండి'' అన్నాడు షాపతను.

"మళ్ళీ అదేమాట. నాకెంత ఇంగ్లీషు రాకపోతేనేం ఫ్రీ అన్న పదం చదవడం వచ్చునోయ్'' ధాటిగా అన్నాడు ఆదినారాయణ.

"అదా... అది ఫ్రీ అంటే 'కొలెస్ట్రాల్ ఫ్రీ' అండీ బాబూ'' అన్నాడు షాపువాడు. "అదేనోయ్ ఆ కొలెస్ట్రాలేదో ఇటు పడెయ్'' అన్నాడు ఆదినారాయణ.

తల పట్టుకున్నాడు షాపతను.

**–సూరిపండు**

---

## ఓ జర్నలిస్ట్ కథ

"ఏమండీ. మా అక్కయ్య కొడుక్కి అక్షరాభ్యాసం చేస్తున్నారు. మధ్యాహ్నం ఆఫీసు నించి భోజనానికి అటే రండి" చెప్పింది మిసెస్ సుబ్బారావు తన భర్తతో.

"మధ్యాహ్నం ముఖ్యమంత్రికి సినిమా ఇండస్ట్రీ వాళ్ళతో మీటింగ్ వుంది. దాన్ని నేనే కవర్ చెయ్యాలి" చెప్పాడు సుబ్బారావు.

"ఎటూ మధ్యాహ్నం భోజనం చేస్తారుగా. అదేదో మా అక్క ఇంటికి వచ్చి చేయండి. ప్లీజ్..."

"ఎక్కడ జూబ్లిహిల్స్, ఎక్కడ రామ్‌నగర్. కుదరదు"

"ప్లీజన్నానా... మా అక్క మీరు అలిగారనుకుంటుంది. వాడి మూడో పుట్టినరోజు ఫంక్షన్‌కి కూడా మీరు రాకపోతే వాళ్ళంతా ఎంతో ఇదయ్యారు"

పుట్టింటివాళ్ళని ప్రేమించని భార్య ఆంధ్రాలో ఎలా వుండదో అలాగే, తన పుట్టింటివాళ్ళకన్నా ఎక్కువగా భార్యని ప్రేమించని భర్తా వుండడుకదా.

"సర్లే. ఎలాగో టైం ఎడ్జెస్ట్ చేసుకుంటాలే" చెప్పాడు సుబ్బారావు.

పత్రికాఫీసులోంచి సుబ్బారావు బయట పడుతూంటే న్యూస్ ఎడిటర్ అడిగాడు.

"ఏమయ్యా సుబ్బారావు ఫిల్మ్ ఇండస్ట్రీ మీటింగ్‌ని కవర్ చేస్తున్నావా లేదా? "

"అక్కడికే వెళ్తున్నానండి" అబద్ధమాడాడు సుబ్బారావ్.

'ప్రెస్' అన్న అక్షరాలు అతికించిన స్కూటర్‌మీద సుబ్బారావు సరాసరి రామ్‌నగర్ చేరుకున్నాడు.

అతని భార్య తరపు బంధువులంతా

సాదరంగా రిసీవ్ చేసుకున్నారతన్ని.

"భోజనం వడ్డిస్తున్నారా, లేదా?" అడిగాడు సుబ్బారావు భార్య కనపడగానే.

"ఎంతా! ఇంకో అరగంటేనండీ"

ముఖ్యమంత్రి వివిధ పాలసీల గురించి బంధువులతో చర్చలో పడ్డ సుబ్బారావు తన అసలు ప్రోగ్రాంని మర్చిపోయాడు.

భోజనం అయి తాంబూలం వేసుకుంటూండగా చెప్పిందతని భార్య.

"తిన్న వెంటనే ఐరిష్ బెగ్గర్‌లా హడావిడిగా వెళ్ళిపోకండి. బావుండదు. ఓ పావు గంట కూర్చుని వెళ్ళండి"

అప్పుడు కాని సుబ్బారావుకి తన డ్యూటీ గుర్తుకు రాలేదు. టైం చూసుకుని నాలుక్కరుచుకున్నాడు. మూడున్నర! ముఖ్యమంత్రి సెక్రటేరియట్‌కి వెళ్ళి లాభంలేదు. సినిమా నిర్మాతలంతా ఈసరికి ఇళ్ళకి చేరి మధ్యాహ్నపు నిద్రలో వుంటారు.

అయితే సుబ్బారావు ఎక్కువసేపు కంగారుపడలేదు.

ఆ రకం మీటింగ్స్ కొన్ని వందలు కవర్ చేసిన అనుభవంతో అక్కడ జరిగింది పత్రికాభాషలో, తన ఊహాశక్తిని జోడించి అసలు విషయం ఏమీ లేకపోయినా ఏదో వుందని భ్రమ కలిగించేలా న్యూస్ ఐటమ్‌ని రాసేశాడు. డెస్క్ ఇన్‌ఛార్జ్ దాన్ని తన అలవాటు ప్రకారం అటు మార్చి ఇటు మార్చి రాశాడు. మర్నాటి దినపత్రికలో దాన్ని వేసేశారు. అయితే సుబ్బారావుకి తెలియనిదేమంటే... ఇండస్ట్రీ మొత్తం గౌరవించే ఓ నిర్మాత ఆకస్మిక మరణంవల్ల ఆ మీటింగ్ వాయిదా పడిందని, మర్నాడు ఉదయం మిగతా దినపత్రికలన్నింటిలో ఆ మీటింగ్ వాయిదా పడిందన్న వార్త వస్తే, మన సుబ్బారావు పనిచేసే దినపత్రికలో మొదటి పేజీలో ఏం వచ్చిందో పాఠకవర్యులకు తెలుసు. సుబ్బారావు ఆ పత్రికాఫీస్ గడప మళ్ళీ తొక్కలేదు.



విద్యుచ్ఛక్తికి, వనరులకి కరువున్న ఆంధ్రాలో కరువులేనిదల్లా దినపత్రిక జర్నలిస్టులకి. చక్కా ఇంకో పత్రికలో చేరాడు.

మూడు వారాల తర్వాత ఓ సందర్భంలో అతనికి తారసపడ్డాడు పాత న్యూస్‌పేపర్ ఎడిటర్.

"చెప్పాపెట్టకుండా ఎందుకు అలా ఉద్యోగం మానేశావు?" అడిగాడాయన ఎంతో క్యూరియస్‌గా.

"తప్పుడు వార్తలు ప్రచురించే దినపత్రికలో పనిచెయ్యడం ఇష్టంలేక" జవాబు చెప్పాడు సుబ్బారావు సీరియస్‌గా.

**–డి. పద్మజ**

# 'ప్రేమార్తి' పై సమీక్షలు

ఏప్రిల్ 'చతుర'లో ప్రచురితమైన కోలపల్లి ఈశ్వర్ రచన 'ప్రేమార్తి'పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## అంతర్లీన సందేశం

*(ప్రథమ బహుమతి రూ. 100/-లు పొందిన సమీక్ష)*

ఈ నెల 'చతుర'లో ప్రచురించిన కోలపల్లి ఈశ్వర్‌గారి 'ప్రేమార్తి' ఆద్యంతమూ నవ్విస్తూ చక్కనికథనంతో చతురోక్తులతో సాగిపోయింది. వాస్తవానికి దూరమో, దగ్గరో అన్న విషయం అలా ఉంచితే 'మనిషి'అనే వాడికి 'నిజాయితీ' ముఖ్యం అనే విషయాన్ని తెలియచేస్తుందీ నవల. హీరో సూరిబాబు, ఆస్తి, అంతస్తు, అందం ఉన్న అమ్మాయి తన కరపత్రం చూసి, తనను పెళ్ళి చేసుకుందామని కాళ్ళదగ్గరకొచ్చినా, అంతకుముందే ఆ విధంగానే తన దగ్గరకొచ్చిన బీదమ్మాయికిచ్చినమాటకోసం ఆ అందగత్తెను వదులుకుంటాడు. ఇది అతని నిజాయితీకి ఓ ఉదాహరణ. "ఫలానా

అబ్బాయి కట్నం తీసుకోడు అంటే, అతని కేదో లోపముండి ఉంటుంది" అనే ఈ సమాజంలో, కనకలింగంలాంటి మగాళ్ళే కొల్లలుగా ఉండే ఈ సమాజంలో సూరిబాబులాంటివారిని తక్కువగా చూస్తాం. అలాంటివారిని ప్రోత్సహించటానికి బదులు పిచ్చివెధవల్లాగా చిత్రించడం ఈ సమాజానికే చెల్లింది. రచయిత ఒక మామూలు హాస్యనవల అందించినట్లుగా కనబడినా, అంతర్లీనంగా ఒక చక్కటి సందేశాన్నిచ్చారనిపిస్తుందీ నవల్లో. ఆణిముత్యాలను ఏరి, కూర్చి అందిస్తూ, కొత్తవారిని ప్రోత్సహిస్తూ పాఠకులకు కూడా ఇలా మనసులో భావాన్ని చెప్పుకునే అవకాశాన్నిస్తున్న చతురకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

**–జీడిగుంట ఉషారాణి,**
సిర్పూర్ కాగజ్‌నగర్ - 504 296

## అవగాహనాలోపం

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

ప్రేమ, ప్రేమార్తి అంటే కన్‌ఫ్యూజ్ అయిపోయిన రచయత కనఫ్యూజ్డ్ రచనే 'ప్రేమార్తి'. రచయిత చెప్పాడు కాబట్టి సూరిబాబులో ప్రేమార్తి ఉందని పాఠకులు అనుకోవాలే తప్ప సూరిబాబులో కాగడా పెట్టి వెదికినా ఎక్కడా ప్రేమార్తి కనిపించదు. కథావస్తువుపట్ల, నవలలోని పాత్రలపట్ల రచయిత అవగాహనా లోపమే ఇందుకు కారణం!

ప్రేమ ఇతివృత్తంగా ఎన్నో నవలలు, కథలు వచ్చాయి, వస్తున్నాయి, వస్తూనే ఉంటాయి. వీటిలో 'ప్రేమ' అన్న మాటకున్న క్రేజ్‌ని తమ స్వార్థప్రయోజనాలకి ఉపయోగించుకోవడమే కనిపిస్తుంది. ఈ నవల కూడా ఇందుకు భిన్నమేమీకాదు. ప్రేమ, ప్రేమించుకోవడం అంటే ఏమిటో తెలియని సూరిబాబులో ప్రేమార్తి ఎలా సాధ్యం? పెళ్ళి అయ్యాక కూడా ప్రేమించుకోవచ్చు అన్న సుజీవన ద్వారా ప్రేమ అంటే ఏమిటో ఒక చక్కని నిర్వచనాన్ని పాఠకలోకానికి అందించి ఉన్నట్లయితే ఈ నవలకు ఒక అర్థం పరమార్థం ఉండేవి. "కౌగిలింతలు, ముద్దులు, మురిపాలు ఇవేనా ప్రేమంటే? " అనుకుంటుంది ప్రహేళిక నవలలో ఒకచోట. "ప్రేమంటే.. ప్రేమంటే" అని సాగదీసి 'ఇది...' అంటూ గాల్లోకి ఒక ముద్దు విసిరింది సుజీవన. రచయిత దృష్టిలో ప్రేమ అంటే ఇంత చులకనా?

ఈ నవలలో బాగా నచ్చింది హాస్యం. నిత్యజీవితంలో కుటుంబసభ్యుల మధ్య జరిగే సంభాషణలలోని హాస్యాన్ని అతి సున్నితంగా, వ్యంగ్యంగా వ్రాయటం రచయిత గొప్పతనమే. దాపరికాలు, అరమరికలు లేని స్వచ్ఛమైన స్నేహం ఎలా ఉంటుందో మనకి సూరిబాబు, కనకలింగం మధ్య స్నేహంలో కనిపిస్తుంది.

**–జి. జయశ్రీ,**
ఏలూరు - 534 002

## టానిక్ !

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'ప్రేమార్తి'లోని పాత్రలన్నీ చిత్ర, విచిత్రమైన మనస్తత్వాలు కల్గి సినిమాల్ని దృష్టిలో పెట్టుకొని రాశారేమోనని సందేహం కలిగించేట్లుంది.

సరళమైన శైలిలో, చదువుతున్నామన్నట్లు గాక ఎదుటివారితో మాట్లాడుతున్న భావన కల్గిస్తూ, పెదవులమీద నవ్వుల పువ్వులను

వసివాడకుండా ఉంచి చివరంటా చదివింప చేసింది.

తరాలపాటు కూర్చునితిన్నా తరగని ఆస్తి ఉన్న సూరిబాబు సాధారణమైన జీవితాన్ని గడుపుతూ చిట్‌ఫండ్ కంపెనీలో చిరుద్యోగం వెలగబెట్టడం చిత్రం. పెళ్ళికి డెబ్భై ప్రయత్నాలు చేసి చివరికి కరపత్ర ప్రక్రియకి శ్రీకారం చుట్టి, వచ్చిన అమ్మాయిల్తో ప్రేమపురాణాలు ఎడాపెడా మాట్లాడగలగడం విచిత్రం. ఏమైనా చెయ్యగల వస్తాదు మస్తానయ్య కేవలం తన్నులు మాత్రమే వడ్డించి తన కూతురితో సూరిబాబు పెళ్ళి చెయ్యకపోవడం ఆశ్చర్యాని కల్గిస్తుంది. ఇలా కాస్తంత అసహజంగా, అతిశయోక్తిగా అనిపించినా సమాజాన్ని నిశితంగా పరిశీలిస్తే ఇలాంటి 'శాల్తీ'లు తారసపడకపోరు. ఇతివృత్తం హాస్యం గాబట్టి ఇవన్నీ చెల్లుబాటవుతాయి.

హాస్యం ఉప్పులాంటిదని, ఏమాత్రం కాస్త ఎక్కువ తక్కువ అయినా అపహాస్యమవుతుందనీ, రచనలలోకెల్ల హాస్యరచన చాలా కష్టమని లబ్ధప్రతిష్టులు సైతం అంగీకరించిన విషయాన్ని వమ్ముచేస్తూ హాస్యరచనల్ని 'పల్లీ'లు తిన్నంత అలవోకగా రాసేసే 'కోలపల్లి'గారి ప్రజ్ఞ అనన్యసామాన్యం. నిప్పులు చెరిగే ఎండల్లో తొలకరి చినుకులు చల్లినట్లు 'ప్రేమార్తి' అనే టానిక్‌ని మనకందించిన కోలపల్లి అభినందనీయులు. ఇలాంటివి మరెన్నో వారి కలంనుంచి జాలువారాలని 'ఆర్తి'గా ఎదురుచూస్తుంటాం.

–ఎన్. శ్రీకర్,
నెల్లూరు - 524 004

## తమాషా కరపత్రం

*(నాలుగవ బహుమతి రు: 50 పొందిన సమీక్ష)*

**సినిమాటిక్ నవల కోలపల్లి ఈశ్వర్‌గారి** 'ప్రేమార్తి' కథాకథనమంతా పాతగానే ఉన్నా కథకి కేంద్రబిందువైన కరపత్రం ఉదంతం మాత్రం వెరైటీగా ఉంది. నిత్యం మనం చూస్తూ ఉండే విషయాల్ని పరిశీలిస్తే ఎవరికైనా ఇలాంటి తిక్క ఆలోచనలు తప్పకుండా వస్తాయి. అలా వచ్చిన ఆలోచనల్ని ఒకదానిమీద ఒకటి పేర్చుకుంటూ, హాస్యాన్ని పండించే సంఘటనల్ని చేర్చుకుంటూ సాలెగూడులా అల్లుకుపోతే చాలు. 'ప్రేమార్తి' అంటే ప్రేమించాలనుకునే తపన అని అందంగానే చెప్పినప్పటికీ సన్నివేశాల్ని అందంగానే కూర్చినప్పటికీ ఇది హాస్యాన్ని వెదజల్లే నవ్వులవనమేగానీ సీరియస్ ప్రేమ కావ్యం మాత్రం కాదు.

భానుప్రకాష్ అంతటి కోటీశ్వరుని కూతురు ప్రహేళిక, మొదట సూరిబాబుని గానీ, తర్వాత కనకలింగాన్నిగానీ ప్రేమించడానికి కారణం కేవలం విచిత్రంగా ఉన్న వ్యక్తుల వ్యక్తిత్వాన్ని గుర్తా చూసి అని చెప్పడం సిల్లీగా ఉంది.

అమ్మాయైనా, అబ్బాయైనా ఒకరినొకరు చూసుకున్న తర్వాత ఇద్దరిలో కలగేదీ, కలగవల్సినదీ ప్రేమార్తిగానీ, ఎవర్నో ఒకర్ని ప్రేమించాలనే తపననే ప్రేమార్తిగా రచయిత వ్యక్తీకరించడం ఇబ్బందికరం!

సూరిబాబునుండి ప్రారంభమైన 'ప్రేమార్తి' కనకలింగంలో దూరి దానికోసం డ్రామాలాడటం నాటకీయంగా ఉంది. నిజంగా వెరైటీ వ్యక్తినే కోరుకునే ప్రహేళికకి, కనకలింగం తనని వలలో వేసుకోవడం కోసమే ఇదంతా చేస్తున్నాడని పసిగట్టడం పెద్ద కష్టమేమీకాదే!

భానుప్రకాష్ పాత్ర కూడా మొండి కూతురి మాటలకి లొంగిపోయే తెలుగు

సినిమాలోని హీరోయిన్ తండ్రి పాత్రే! కథా నాయకుడైన సూరిబాబులో ప్రేమ, ప్రేమార్తి ఉంటే ఉండవచ్చుగానీ, ఈ నవల్లో మాత్రం నిఖార్సయిన ప్రేమ ఉందా అని ఎవరైనా ప్రశ్నవేస్తే కొద్దిగా ఆలోచించాల్సిందే. అయితే మనసారా నవ్వుకొనే తొలకరి జల్లులాంటి హాస్యం మాత్రం ఉంది.

రచనాశైలిలో ఇచ్చిన ప్రతి స్టేట్‌మెంట్‌నీ సమర్ధవంతంగా నమ్మించే తమాషా కరపత్రం ద్వారా, ఇద్దరు స్నేహితుల ప్రేమార్తి తీరిన వైనంలో ఆద్యంతమూ చదివించేతీరు ఉంది.

–అద్దంకి శ్రీనివాస్
విశాఖపట్నం-500 043

## కామెడీ సినిమా

*(అయిదవ బహుమతి రూ. 50–పొందిన సమీక్ష)*

ప్రేమకు నిర్వచనం చెప్పటం చాలా కష్టం. ఒక్కమాటలో చెప్పాలంటే ప్రేమకు సరయిన నిర్వచనం ఇప్పటివరకూ ఎవరూ చెప్పలేదు. అటువంటి 'ప్రేమ' కోసం తపించే ఒక యువకుని కథ'ప్రేమార్తి'. ఆద్యంతం సరదాగా సాగి చదవడానికి ఉత్సాహాన్నిచ్చింది. చక్కని కామెడీ సినిమా చూసిన అనుభూతి కలిగింది. నేడు వస్తున్న సినిమాలలో అధిక శాతం కామెడీ అంటే ద్వంద్వ అర్థప్రయోగమే. అటువంటి సినిమాలకు రచనలు చేసేవారికి సున్నితమైన హాస్యంతో చక్కని కథనాన్ని జోడించి కథలు రాయొచ్చని ఈ 'ప్రేమార్తి' నవల తెలియజేస్తుంది. కథలో ప్రధాన పాత్రలు సూరిబాబు, కనకలింగం, సుజీవన, ప్రహేళిక, భానుప్రకాష్‌ల మధ్యే కథ నడుస్తుంది. అనవసరపు వర్ణనలు లేకుండా సంభాషణలతోనే కథను నడిపించి పాఠకులకు చక్కని నవల అందించిన రచయిత అభినందనీయులు. ఈ నవలలోని ప్రతి సన్నివేశం నాటకఫక్కీలో కామెడీ సినిమాను తలపింపచేసింది. కథానాయకుడు సూరిబాబు ముద్రించిన కరపత్రానికి ప్రతిస్పందన వల్ల ఎదురయ్యే చిక్కులు మరింత హాస్యాన్ని పండించాయి. అదే కరపత్రానికి స్పందించిన ఓ ఆడపిల్ల సుజీవన తల్లిదండ్రులకు గుండెలమీద కుంపటి కాకూడదని తీసుకున్న నిర్ణయం నేటితరం ఆడపిల్లలకు ఆదర్శం. చిత్ర, విచిత్ర మనస్తత్వంగల ప్రహేళిక పాత్ర డబ్బుతో ఏదయినా సాధించవచ్చనే అభిప్రాయం కలవారికి కనువిప్పు కావాలి. తన కూతురు తీసుకున్న నిర్ణయాన్ని కాదనలేక, ఇటు సూరిబాబుని నొప్పించలేక మథనపడే ప్రహేళిక తండ్రిగా భానుప్రకాష్ పాత్ర కూడా చాలా బాగుంది. సూరిబాబు రూమ్‌మేట్‌గా, మిత్రుడిగా కనకలింగం పాత్ర ఒకవైపు మిత్రుడి క్షేమాన్ని కాంక్షిస్తూ మరోవైపు ప్రహేళికను, ఆమె ఆస్తిని సొంతం చేసుకోవాలనకోవడం అతని అత్యాశకు నిదర్శనం. అయినప్పటికీ ప్రతి సన్నివేశం ఆసక్తికరంగా చక్కని హాస్యంతో కథనాన్ని నడిపించిన తీరు వర్ణనాతీతం. సుజీవన, సూరిబాబు, కనకలింగం ప్రహేళికల వివాహంతో కథ ముగిస్తుంది. చక్కని హాస్యనవలను అందించిన 'చతుర'కు ధన్యవాదాలు.

–పి.యస్.సి. మూర్తి,
నడకుదురు-533 016

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 338734

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78


# కొందరికి కారం అంటే మమకారం!




ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.







Pickles
ఏ పచ్చడంటే
ఆ పచ్చడి సంసి




**ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్,** (ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 48